# నవజీవనం

( అవతార్ మెహెర్‌బాబా నవజీవన ఘట్టం )

ప్రథమ భాగం

: సంకలనం :

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు




అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు
మచిలీపట్నం

# NAVAJEEVANAM

Compiled by

G. V. G. K. CHANDRAMOULESWARA RAO

First Edition: 24th July 1983

Copies: 1000

PRICE: Rs. 7-00

Title Design by

Dr. G. V. PURNACHAND, B. A. M. S.,

ముద్రణ : స్పందన ప్రింటర్స్, మచిలీపట్టణం

For Copies :-

G. V. G. K. Chandramouleswara Rao

29-36-12 Museum Road, VIJAYAWADA-2

Sole Distributors :-

KEERTHI PUBLICATIONS

VIJAYAWADA - 520 002

2

# తొలి పలుకు

జై బాబా! అవతార్ మెహెర్‌బాబా వారి "నవజీవనం" శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావుగారి నాల్గవ ప్రచురణ. ఇది బాబా ప్రేమిక లోకానికి ఎనలేని కానుక. ఈ "నవజీవనం" గ్రంధము కొరకు, ఎంతకాలం నుండో ప్రేమిక పాఠక లోకం ఎదురు చూస్తున్నారు. బాబా యిచ్ఛగా ఇప్పటికి అది కార్యరూపం దాల్చి, మా సెంటరు ద్వారా ప్రచురింపబడుట చాల సంతోషం. సృష్టి కార్యక్రమంలో సర్వమూ తానైన పరమాత్మ, మానవ రూపంలో భూమిపై అవతరించు కాలము సర్వ జీవకోటికి గొప్ప ఆధ్యాత్మిక సోపానము. ఆ కాలంలో వుండుట, వారిని గుర్తించుట, వారి ప్రేమ సాహవాస కార్యక్రమంలో పాల్గొని ఆనందించుట, అవతార సత్ఫలితములు పొందుటే.

వారి కార్యక్రమ విధానమును అవగాహన చేసుకొనుట, దానిలో భాగస్వాములుగా వుండుట, ఎంతో అదృష్టం. పూర్వ జన్మ సుకృతం. అయితే ఈ త్రోవ ముళ్ళబాట కంటే కఠినం.

చెడు తలంపులకు మూలమైన మనస్సులో, అవతారుని సర్వోన్నతునిగా, సృష్టి కర్తగా, సర్వాధికారిగా గుర్తించ కలిగి, సుఖ వాంఛలకు అలవాటు పడిన మార్గమును వదలి, అవాంఛిత సంఘటనలను ఆనందంగా అనుకరించు శక్తి ఆయన ద్వారా పొంది, ఆచరణ ద్వారా ప్రపంచానికి చాటినదే "నవజీవనం". అవతారునితో జీవించుట శక్తివంతమైన విద్యుచ్ఛక్తితో చెలగాటం మాదిరిదే.

నవజీవన ప్రాశస్త్యం మేధస్సుకు అందని యీ అవతారుని విశిష్ట కార్యక్రమము ఈ చిన్న గ్రంథంలో, తేట తెలుగులో, సులభ శైలిలో, అర్థమయ్యే విధంగా వెలువడుట ముదావహము. చదివినంతసేపూ బాబాతో ఉన్నట్లుగాను, ఆయనతో పాల్గొన్నవారు ఎంతటి అదృష్టవంతులో! అనిపించి, ఆ భాగ్యం యీ గ్రంథపఠనం ద్వారా తమకు పొందినట్లు అనిపిస్తుంది.

భారత యుద్ధంలో కౌరవ పాండవులను గుర్తుకు తెస్తూ, భోగమయ సుఖ శాంతులను కోరే మనస్సు ప్రాముఖ్యతను, మానవాళి శ్రేయస్సుకు త్యాగమయ కష్ట జీవితముగా మరల్చి, హృదయ పరివర్తనమునకు సహాయ పడిన జీవనమే " నవజీవనం ". బాబా నవజీవనంలో గత రామావతార వనవాసము గుర్తుకు వస్తుంది.

బాబా పూర్వ జీవనంలో వున్నా, నవజీవనంలో వున్నా, వారి మౌనం, భిన్నమతాల వారికి ఏకైక ఆధ్యాత్మిక శిక్షణ, సామూహిక కార్య కలాపాలు, వికలాంగులకు, పేదలకు ఆర్థిక సహాయము, కుష్టు రోగులకు సేవ చేయుట, మస్తు కార్యక్రమము మున్నగు వాటి ద్వారా, మానవాళి బాధలు తనపై వేసుకొని, వారిని బాధల నుండి విముక్తులను చేయుట విశదపడుతుంది. ఆచరణ ద్వారా మండలి మధ్య, స్వేచ్ఛా జీవనం, శారీరక శ్రమ, భిక్షుక జీవనం, సంచార జీవనం, నిరాశామయ, నిస్సహాయ జీవనం గడిపి, భావితరాల కొరక మేల్కొలుపుగా బాబా యీ నవజీవనం అందించారు.

ఇందలి సంఘటనలన్నీ, అట్టి జీవనంతో పాల్గొన్న సభ్యులకే కాక, చదివి జీర్ణం చేసుకున్న వారందరికి హృదయం, మనస్సుల మధ్య సంఘర్షణ చెలరేగి, హృదయ పరివర్తనకు సహాయపడగలదనుటలో సందేహం లేదు. చదివినవారు, విన్న వారిలో కూడ చలనం కలిగి, అసలైన జీవితాన్ని తెలుసుకోగలరు.

వేయేల, ఈ గ్రంథం చదివి, తనివితీరా ఆనందించి, యింకా ఇటువంటి ప్రచురణలను ప్రోత్సాహపరచండి !

మచిలీపట్నం
24 - 7 - 83

తాడేపల్లి బసవయ్య
అధ్యక్షులు
అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు

# అభివాదము

సాధారణంగా పురాణాలు చదివితే వాటి సారాన్ని మనలో హత్తుకు పోయేందుకు వీలుగా ఎన్నెన్నో నిజ జీవితంలో ఎదుర్కొనే సంఘటనలను ఉదాహరిస్తూ నిరూపణ చేయబడి వుండుట గమనించవచ్చును. ఆధ్యాత్మిక ఉపన్యాసాలు చెప్పేవారు కూడ రోజూ జరిగే ఏవో సంఘటనలు ఉదహరించి నిత్య సత్యాల్ని సుబోధకం చేయుదురు.

అయితే ఈ యుగావతారుడు, అవతార్ మెహెర్‌బాబా మౌనంతోనే వుండి, మానవాళిలో ప్రేమబీజం నాటి తన చేతలద్వారా నవచైతన్యాన్ని రేకెత్తించి, తమ గమ్యాన్ని చేరుటకు మేల్కొలుపు గావించారు.

దైవం చేసే ముఖ్య కార్యక్రమం, మాటి మాటికి మానవుల మధ్య మానవుడై అవతరించుట. మానవులలో మానవుడై, మానవాళి యొక్క బాధలు తనపై వేసుకొని వారి బాధలు పంచుకొనును.

ఇక్కడ మనం గమనించాల్సిన ఓ విషయముంది. మెహెర్‌బాబా సోదాహరణలతో ఉపమానములు చెప్తూ బోధలు చేయక, కటిక నిజాల్ని ఆచరణ రూపంలో తానాచరించి, తన శిష్య గణాన్ని ఉపకరణలుగా వాడుకొని, సర్వమానవాళి కాయన మేల్కొలుపు కలిగించి యుగావతారుడుగా ముక్తి ప్రదాత అయినారు.

మెహెర్‌బాబా జీవితంలో అత్యంత ప్రధాన ఘట్టం " నవజీవనం ". గతాన్ని పూర్తిగా విస్మరించి, వర్తమానమందే జీవించి, భవిష్యత్తును గురించి ఆలోచించక గడిపిన జీవితమే " నవజీవనం ".

సాధారణ మానవలీల నెఱపుతూ, భగవదన్వేషిగా, సఖునిగా వ్యవహరించి, శిష్యులతో నిరాశామయ, నిస్పృహాయ జీవనాన్ని, ప్రచ్ఛన్నంగా గడిపిన పరివ్రాజక జీవనమే " నవజీవనం ".

రామావతారంలో వనవాస జీవితం ఎంతటి ప్రాశస్త్యాన్ని సంతరించు కుందో, మెహెర్‌బాబా యొక్క యీ " నవజీవనం " కూడ, ఎంతో విశిష్టతతో కూడిన మహాత్మ్యాన్ని అందించింది.

ఈ ప్రథమ భాగంలో మెహెర్‌బాబా జీవితానికి సంబంధించిన అనేక సంఘటనలు పునశ్చరణ చేయబడినా, ముఖ్యంగా నవజీవనానికి నాంది ఎలా జరిగింది ? భోగమయ వాతావరణం నుండి శిష్యులను తప్పించి, సర్వసంగ రాహిత్యం వారి కలవడుటకై కఠోరమగు తపస్వి జీవనం ఎలా సమకూర్చారు ? సాధారణ మానవలీల నెఱపుతూ కఠోర నియమాలను శిష్యులచే పాటింపచేసి అంతర్గత మేల్కొలుపు ఎలా కలుగ చేశారో సంక్షిప్తంగా వివరించుటకు ప్రయత్నించాను.

అక్కడక్కడా కొన్ని సంఘటనలలో, ఆ గాథల వెనుకవున్న అసలు రుచి చెడకుండా అన్ని జాగ్రత్తలు తీసుకొని ప్రతి కథా పదిలంగా పొందుపరచబడినది. కఠోర నియమాలు, ఆజ్ఞలతో, క్రోధోద్దీపితమై రెచ్చకొట్టినట్లున్నా, వినోద భరితమై మానవత్వాన్ని ఉద్రేక పరచే యీ సంఘటనలన్నీ బాబా రూపాన్ని పాఠకుల కళ్ళముందు సాక్షాత్కరింప చేయగలవని ఆశిస్తున్నాను.

అవతార్ మెహెర్‌బాబా గురించిన పుస్తకాలు చాలా ఉన్నాయి. " నవజీవనం " గురించి కూడ వివరించి వుండవచ్చును. అయితే బాబా " నవజీవనం " అనుభవాలను, తేట తెలుగులో ఆంధ్ర ప్రేమిక లోకాని

కందించాలనే తలంపుతో, విశేష కృషి చేసి, విషయ సేకరణ జరిపి, గ్రంథస్థం చేయబూనాను.

సాహిత్య పరిజ్ఞానం లేనప్పటికీ, బాబా ప్రేరణతో చెదురు మదురుగా పడివున్న ముత్యాలను ఏరి కూర్చి, చెండు కట్టి మీ కందిస్తున్నాను. నా తలపుల్లో వున్న ఆకాంక్ష యీ సంకలనంలో మీకు వినబడితే అంతకంటే నే కోరేది లేదు.

నా రచనలన్నీ ప్రోత్సహించి, యింకా యింకా, మరిన్ని సుందర కుసుమాల్ని, ముత్యాలసరాల్ని ప్రోది చేసేందుకు ప్రోత్సాహపరుస్తున్న " అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు " వారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

మచిలీపట్నంలో స్త్రీల విభాగం వారం వారం శుక్రవారం కార్య క్రమాల్లో " నవజీవనం " గురించి ప్రసంగిస్తున్న నన్ను వుత్తేజపరచి, ఆ ప్రసంగాలన్నీ కావ్యరూపంలో ప్రచురించుటకు పురికొల్పిన శ్రీ తాడేపల్లి బసవయ్య దంపతులకు, తదితర బాబా ప్రేమికులకు నా ప్రత్యేక కృతజ్ఞతాభి వందనము లర్పిస్తున్నాను,

అవతార్ మెహెర్‌బాబా చల్లపల్లి సెంటరు వారు 24-7-83 న నిర్వహిస్తున్న బాబా ప్రేమిక సహవాస కార్యక్రమంలో యీ సంకలనాన్ని ఆవిష్కరించాలనే తలంపుతో త్వరితంగా అచ్చొత్తించాలని ప్రయత్నించగా మచిలీపట్నం, స్పందన ప్రింటర్సు వారు ఎన్ని వత్తిడి పనులున్నా అనతి కాలంలో దీనిని గ్రంథ రూపంలో అందించినందుకు వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

ముఖ్యంగా, యీ ప్రచురణను వెంటనే వెలికి తేవాలన్న ఆకాంక్షతో ప్రోత్సహించి, చేయూత నిచ్చిన మిత్రులు శ్రీ పెమ్మరాజు కృష్ణారావు గారికి నా ప్రత్యేక అభివాదములు.

సహృదయులైన ప్రేమిక లోకం, నా యింతకు ముందు రచనల వలెనే, ఈ "నవజీవనం" సంకలనాన్ని కూడ స్వీకరించి, అవతారుని ప్రేమకు పాత్రులు కాగోరుచున్నాను.

విజయవాడ — బాబా సేవలో

24 - 7 - 83 — జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

జై బాబా !

# అవతరణ

" యదా యదాహి ధర్మశ్యగ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మశ్య, తదాత్మానం సృజామ్యహం "
" పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చదుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. "

సమస్త చరాచర ప్రపంచమందు స్వార్థపరులయొక్క, హింసాత్మకుల యొక్క సంఖ్య మితిమీరినప్పుడు ధర్మచ్యుతి కలిగి, ప్రపంచమందల్ల కల్లోలము పుట్టి ప్రజావాహిని నుండి హాహాకారములు పెల్లుబుకును. మానవాళియందు పశు ప్రవృత్తి కలిగి, నిజ ధర్మములు విడనాడి, కల్మషము కపట బుద్ధి, స్వార్థపరత్వము ప్రబలినప్పుడు, భగవంతుడు ప్రకృతిమాత రూపంలో ప్రళయ తాండవము చేయును. భూకంపములు, ఉప్పెనలు, వరదలు, అగ్ని భయములు, తుఫానులు, అతివృష్టి, అనావృష్టి, కరువు కాటకములు, హత్యలు, యుద్ధములు మున్నగు భయంకర పరిస్థితులు కలిపించబడును. తద్వారా ప్రజా జీవితము స్తంభింపచేసి, వారి మనస్సులను పరిస్థితుల ప్రభావము వలన, భగవత్ చింతన వైపు మరల్చి తనకు అత్యంత సన్నిహితులుగా చేసుకొనును. అందుకే భగవంతుడు మానవ రూపధారియై అవతరించును.

ప్రతి యుగమందు అవతార పురుషుడు విభిన్న రూపాలతో, భిన్న భిన్న నామములతో యీ విశాల విశ్వమందలి ఆ యా ప్రాంతము లందు అవతరించుచుండును. మానవ దేహధారియై అవతరించిన భగవంతుడు తత్కాలాను సరణముగా, ఒక బాహ్య రూపము ధరించి, నవీన మత ధర్మము స్థాపించుటచేత, అవన్నీ భిన్నమగు రూపములు వహించియున్నవి. కానీ తాత్వికంగా పరిశీలించినచో, ఒకే దైవం, ఆ యా కాలములందు, అనాటి కాలమాన పరిస్థితుల ననుసరించి, యీ జగత్తులో అవతరణ గావించి, మరల మరల బోధించియున్న ఒకే జీవితాదర్శమునకు సంబంధించిన బోధలే అగుచున్నవి.

ఈ సకల చరాచర సృష్టికి మూలకారణమైన అనంత శక్తి, జ్ఞానానంద స్వరూపుడైన భగవంతునియొక్క ప్రభావము, అయిదుగురు సద్గురువుల ఆధ్యాత్మిక శక్తి ద్వారా యీ విశాల విశ్వమును పరిపాలింప చేయును. ప్రతి 700 సంవత్సరముల కొకసారి, భగవంతుడే స్వయంగా అవతారము దాల్చి వచ్చినప్పుడు, యీ పంచ సద్గురువులు, తమకు సంక్రమించిన అధికారమును, తిరిగి ఆ భగవదవతార పురుషునకే వప్పగింతురు. అవతారుడు తన కార్యమును ముగించి, అవతార పరిసమాప్తి చేసిన తరువాత తిరిగి అధికారము చేపట్టెదరు.

ఇట్టి భగవదవతరణ పరంపరలో యీ యుగమందు బాబా జాన్, షిర్డీ సాయిబాబా, ఉపాశినీ మహారాజ్, నారాయణ మహరాజ్, తాజుద్దిన్ బాబా లను పంచ సద్గురువులు అవతార్ మెహెర్‌బాబావారిని అవతార పురుషుడుగా అవతరింప చేసిరి.

మెహెర్‌బాబాకు తల్లిదండ్రులు పెట్టిన పేరు మేర్వాన్ షెరియార్జీ ఇరాని. ఈయన షెరియార్జీ ముండేగర్ ఇరానీ, షిరీన్‌మాయి లను పుణ్యదంపతులకు 1894 ఫిబ్రవరి 25 వ తేదీ గురువారం, ఉదయం 5

గంటలకు రెండవ సంతానంగా పూనా నగరం ససూన్ ఆసుపత్రిలో జనమందెను.

తన 17 వ ఏట, దక్కన్ కళాశాలలో చదువుతున్న రోజులలో, 127 సంవత్సరముల వయో వృద్ధురాలు హజరత్ బాబా జాన్ అనే సద్గుర్విణి సమాగమ ప్రాప్తితో శ్రీవారి ఆత్మోపలబ్ధికి, చైతన్య వికాసానికి, దివ్యానుభూతికి నాంది పల్కింది. సద్గురువు తన నొసట ముద్దిడి, కల్గించిన స్పర్శతో మానవ చైతన్యం కోల్పోయి, దివ్య ప్రేమాంబుధిలో మునిగిపోయెను.

ఆ పిదప, షిర్డీలోని సాయిబాబాను, సాకోరిలోని ఉపాశినీ మహారాజును, ఖేడ్‌గాంలోని నారాయణ మహరాజ్‌ను, నాగపూర్‌లోని తాజుద్దిన్ బాబాను దర్శించి ఆధ్యాత్మిక పరిపూర్ణత్వం పొందెను. తన 28 వ ఏట సర్వ స్వతంత్ర ఆధ్యాత్మిక గురువుగా పనిచేయుట ఆరంభించెను.

## ఆధ్యాత్మిక శిక్షణలో పరంజాలు

అనేకమంది శిష్యు లాయన చుట్టూ పరివేష్టించి, మండలిగా వ్యవహరించిరి. మండలిలో ఒక రాయనను బాబా అని ప్రథమంగా సంబోధించగా అప్పటినుండి మేర్వాన్ మెహెర్ బాబాగా ప్రసిద్ధి గాంచెను. బాబా తన శిష్యులకు కఠోరమగు నియమాలతో కూడిన ఆధ్యాత్మిక శిక్షణ యిచ్చారు. భారతదేశం మొత్తం త్రిప్పారు. ప్రాక్పశ్చిమ దేశాలనేకం, పెక్కు పర్యాయాలు శిష్యులతో సందర్శించారు.

ప్రథమంలో పూనాలోని కస్బాపేఠిలో చిన్న "జోంపడి" ఏర్పరచి, కొద్దిమంది శిష్యులను చేరదీశారు. 1922 వ సంవత్సరంలో, బొంబాయిలోని దాదరులో ఒక అద్దెయింటి యందు మంజల్-ఇ-మీమ్ అనే పేరున మొదటి ఆశ్రమము ప్రారంభించి, తదుపరి అనేక ప్రదేశా

లలో, వివిధ నమ్మకములున్న భిన్న మతాలవారితో, దాదాపు 40 మంది శిష్య మండలితో ఆధ్యాత్మిక తర్ఫీదునిచ్చు ఆశ్రమాలు నడిపారు. తదుపరి శాశ్వత కేంద్రమును అరం గాం అనే చిన్న పల్లెటూరు సమీపంలో పూనాకు ఉత్తరంగా 90 మైళ్ళ దూరంలో అహ్మద్ నగరుకు 10 కిలో మీటర్ల దూరాన నెలకొలిపి, మెహెరాబాదు అని నామకరణం చేశారు. యిక్కడే అవతార్ మెహెర్‌బాబా దివ్య సమాధి వుండి పుణ్యక్షేత్ర మైనది. ఆ బాద్ అంటే వెలుగొందుట అని అర్థం.

ఎన్నో కష్టాలు, యిడుములు మధ్య, బాబా తన ఆంతరంగిక కార్య విధాన సరళిలో దాదాపు ఎక్కువ సమయం ఏకాంతవాసం, కఠిన ఉపవాసములకై వెచ్చించారు. కొన్ని అనూహ్య కారణములుచేత, బాబా 10-7-1925 వ తేదీ నుండి భౌతిక మౌనం పాటించారు. అఖండమైన యీ మౌనం, 1969 జనవరి 31 వ తేదీన తన పాంచ భౌతిక శరీర త్యాగం చేయువరకు నిరాఘాటంగా కొనసాగింది.

మౌనంతోనే దాదాపు 13 సార్లు 1931-'58 సంవత్సరముల మధ్య అనేక ప్రపంచ పర్యాటనలు జరిపి, ఎన్నో దేశాలలో ఎందరెందరో ప్రేమికులను ఆకర్షించి, వారిని అంతర్గతప్రేరణ ద్వారా ఆధ్యాత్మిక వుత్తేజితులుగా మేల్కొలుపుట జరిగినది. అనుక్షణం అనేకానేక సంఘటనలతో వారిలో చైతన్యతను ద్విగుణీకృత పరిచేవారు.

ఒకసారి బాబా శిష్యులతో ప్యారిస్‌లో మకాంచేసి వున్నారు. లండన్ మీదుగా జూరిచ్ పయనమైనారు. అక్కడ బాబా 10 రోజులు పాటు, ఒక పర్వత శిఖరాగ్రాన ఏకాంతవాసం గడిపారు. ఆయనను గమనిస్తూ తక్కిన శిష్యులంతా సమీపంలోని వేరొక పర్వతంపై వేచి వున్నారు. అంతలో హఠాత్తుగా గాలివాన వచ్చింది. శిష్యులంతా వానలో తడిసిపోయారు. అయితే అదే సమయాన, బాబా ఎలా వున్నారో

అని బాబా వున్న పర్వతంవైపు చూచేసరికి, బాబా బంగారు కాంతులతో వెలుగొందుతూ సాక్షాత్కరించారు. ఆయన సమీప పరిధిలో కనీసం వర్షఛాయలు కూడ లేవు. యిలాంటి ఎన్నెన్నో సంఘటనలు, శిష్యుల కిచ్చే ఆధ్యాత్మిక తర్ఫీదులో వుపకరించాయి.

మెహెరాబాదులో సామూహిక కార్యకలాపాలనేక సంవత్సరాలు జరిపారు. తరువాత వాటన్నిటిని తొలగించి, మెహెరాశ్రమం అను పేర ఒక బాలుర పాఠశాలను నెలకొల్పారు. అందులో అన్ని కులాలు, మతాలు, జాతుల వారికి ప్రవేశార్హత కల్పించారు. అందలి బాలురకు, వారి సాధారణ సంక్షేమంతో బాటు, ఆధ్యాత్మిక వున్నతిపై బాబా కేంద్రీకరించారు. కొన్నాళ్ళ కిది ప్రేమాశ్రమంగా విభజించబడినది. దీనితోపాటు వైద్య చికిత్సా కేంద్రం, డిస్పెన్సరీ, పేదలకు, కుష్టు రోగులకు ఆరామాలు కూడ నిర్వహించబడ్డాయి.

తాను నిర్వహించవలసిన కార్య విధానములో యివన్నీ భాగములైనప్పటికీ, బాబా అట్టి చర్యల ద్వారా తన శిష్యులకు ఆధ్యాత్మిక శిక్షణ గఱపుటకే, వినియోగించారు. ముఖ్యంగా 1940 తరువాత ఆయన అసాధారణ చర్య లనేకము తీసుకున్నారు. పేదలను, అంధులను, వికలాంగులను, స్వయంగా కలుసుకొని వారికి తగు ఆర్థిక సహాయ మొనర్చు కార్యక్రమం చేపట్టారు.

ప్రధానంగా కుష్టు రోగులను, (వీరినే బాబా అంద వికార పంజరంలోవుండే అందమైన పక్షులనేవారు) కలుసుకొని, వారిని స్నానం చేయించుట, పాదాభివందనం, వస్త్రదానం, ఆర్థిక సహాయం, చిన్న చిన్న బహుమతు లందించుట వంటివి చేసేవారు. దీనితోపాటు, మానసికంగా బాగా దెబ్బతిన్నవారిపై ఎక్కువ శ్రద్ధ తీసుకునేవారు. వీరి కోసరం ప్రత్యేకంగా మస్తు ఆశ్రమ మొకటి నడిపారు.

మస్తు కార్యక్రమం యొక్క ప్రధాన ఉద్దేశ్యం మానసిక పరమైన ఆధ్యాత్మిక తపనచెందే మస్తులనే ప్రేమోన్మత్తులను కలుసుకొని, వారిలో ఆధ్యాత్మికాభివృద్ధి కావించుటకై నిర్దేశించబడింది. ప్రచ్ఛన్నంగా బాబా దాదాపు 75,000 మైళ్ళు కాలి నడకన, కార్లు, బస్సులు, రైళ్ళేకాక, గుర్రాలు, బళ్ళు తుదకు గాడిదలు సైతం వుపయోగిస్తూ, ప్రయాణంచేసి ఎందరో మస్తులను కలిశారు. యీ మస్తు కార్యక్రమం బాహ్యంగా అర్థరహితంగా వున్నప్పటికీ, అందు నిగూఢంగావుండే ప్రత్యేకత వున్నది.

దీనినే బాబా ఒకసారి యిలా సూచనగా తెలిపారు. "మస్తులు మాత్రమే, వారు నన్నెలా ప్రేమిస్తున్నారో ఎరుగుదురు. మరి వారిని నేనెలా ప్రేమిస్తున్నానో నాకు మాత్రమే తెలుసును. నేను మస్తుల కొరకు పనిచేస్తున్నాను. మస్తులుకూడ వారికి తెలిసో, తెలియకో నన్ను ప్రేమిస్తున్నారు." అని చెప్పారు.

## మేల్కొలుపు

దైవము చేసే ముఖ్య కార్యక్రమం, మాటి మాటికి, మానవుల మధ్య మానవుడై అవతరించి, మానవులలో మానవుడుగా మారి, మానవ స్వభావము నాపాదించుకొనుట. మానవాళి యొక్క బాధలను, తాను పంచుకొని, తనపై వేసుకుంటేనే తప్ప, వారి బాధలను తాను పంచుకొను అవకాశము రాదు. అందుకే, బాబా సాంగత్యంలో అనేక చిన్న చిన్న సంఘటనలెన్నో మనము గమనించవచ్చును. తప్పులుగానీ, ఒప్పులుగానీ, అవి మానవునిగా చేసినప్పుడు, అవి భగవంతునిగా చేసినవి కావనీ, కేవలం ఒక మానవుడు చేసిన తప్పేనని మనము గ్రహించునట్లుచేసి, తద్వారా అది వొక దివ్య సందేశమై మనలో నొక మేల్కొలుపుగా భాసిల్లినవి.

ఆచరణ బద్ధములైన నియమాలెన్నో శిష్యుల కలవర్చారు. విధేయత, కోపతాపాల నదుపులో వుంచుకొనుట, సత్ప్రవర్తన వంటి

నడవడికలలవడుటకై తాననుభవించి, మనకు మార్గదర్శకులైనారు. దైవ మానవుని అనంత ప్రేమరీత్యా, తన అపార కరుణను మనపై కురిపించి, యితరుల తప్పులన్నీ తన తప్పులుగానే భావించి, అట్టి కార్య ఫలితాన్ని తనపైనే అనుభవించునట్లు చేసుకొనేవారు. ఇదే మనందరిలో కలిగే అంతరంగిక మేల్కొలుపు.

మెహెర్‌బాబా జీవితంలో ప్రధాన ఘట్టాలు నాలుగు. అనేక ఆశ్రమాలు స్థాపించి, తానీ ప్రపంచమంతటికీ ఆధ్యాత్మిక సముత్తేజం కలిగించుటకై చేసే కృషిలో తోడ్పడుటకుగాను, తన శిష్యులను, నిస్వార్థ సేవకులుగాను, తనకు ఉపకరణములుగా మలుచుటకై జరిపిన, నియమ బద్ధమగు కఠిన శిక్షణా కార్యక్రమమంతా ప్రథమ భాగం.

దేశ దేశాలలో, తనయందు సర్వ సమర్పణా భావముగల శిష్యులను చేకూర్చుకొనుటకు, తన ఆధ్యాత్మిక కృషికి తోడ్పడుచున్న పాశ్చాత్యు లనేకులను కలుసుకొని, ప్రపంచం నలుమూలలా తన ఆధ్యాత్మిక ప్రచారం విశిష్ట విధంగా జరుగుటకై, పాశ్చాత్య దేశాల్లో దర్శన కార్యక్రమాలు నిర్వహించుట రెండవ ఘట్టం.

యిహపోతే మూడవ ఘట్టం. భగవత్ప్రేమోన్మత్తులను కలసి, వారిని వున్నత జ్ఞాన భూమికలకు చేర్చుట. అట్టివారికి ప్రపంచ స్మృతి కలిగించి, వారిని సిద్ధ పురుషులుగా తీర్చిదిద్ది, తద్వారా మానవకోటికి తరుణోపాయం కలిగించారు. యిది మూడవ ఘట్టం. యీ మూడు ఘట్టాలు కూడ బాబా జీవితంలో పూర్వ జీవనం అగుచున్నవి. యివి భగవంతుడుగా తన ఐశ్వర్య ప్రకాశానికి సంబంధించినవి. అంటే ఈశ్వర స్వభావానికి సంబంధించినవి.

అయితే ఆయనలోని మానవ స్వభావానికి సంబంధించిన భాగము నాల్గవ ఘట్టం. ఇదే నవజీవనం. పూర్వజీవనంలో స్త్రీ పురుష లెందరో

ఆయనకు శిష్యులైనారు. వారంతా బాబాయే తమకు సర్వస్వమని నమ్మి కొని, సర్వమూ త్యజించి ఆయనను ఆశ్రయించారు. వారందరికి ఎట్టి లోటు రానీయక భోగమయ వాతావరణం కలిపించారు. వారి ఆశాపరిపూర్తి కొరకు వారికి సర్వమూ సమకూర్చారు.

## గీతా జీవనం

భోగమయ వస్తువుల నడుమ నున్నప్పుడే, శిష్యులకు త్యాగబుద్ధి కలుగవలెనని, ఆశాపరిపూర్తి కొరకు, కొరత లేకుండినప్పుడే, నిరాశా స్థితి కలుగవలెనని, తద్వారా వారు నిత్యతృప్తులు, నిరాశాపరులు, నిస్పృహాయులు కాగలిగి గీతాజీవనమునకు సమర్థులై యుండవలయునని బాబా అభిలషించారు. అయితే శిష్యులు మాత్రం, కఠిన నియమాలతో క్రమశిక్షణ పొంది, బాబా ఎడల భక్తి విశ్వాసాలు పెంచుకున్నారేకాని, బాబా ఆశించిన నిరాశామయ, నిస్పృహాయ జీవనం అలవడలేదు.

అందువలన వారికి భోగమయ వాతావరణం వదిలించి, సర్వసంగ రాహిత్యం కలుగుటకై, కఠోరమగు తపస్వి జీవనం, సమకూర్చుటకు సంకల్పించారు బాబా. ఇట్టి జీవనాన్ని ఆచరణ రూపంలో శిష్యుల కలవాటుచేయు నుద్దేశంతో బాబా తన ఈశ్వరావ స్థానంనుండి మానవావ స్థానానికి దిగిరావలసి వచ్చినది.

సాధారణ మానవలీల నెఱపుతూ బాబా తన శిష్యులతో గడిపిన జీవనమే నవజీవనం. ఈశ్వరలీల నెఱపుతూ, తన శిష్యులకు ఆధ్యాత్మిక శిక్షణ గఱపిన జీవనము పూర్వజీవనమగు చున్నది. పూర్వజీవనమందు బాబా తన భగవదవ స్థానమందుండి, పరిపూర్ణ దైవత్వం కలిగి వుండెను. కాగా నవజీవనమందు ఆయనలోని పరిపూర్ణ దైవత్వం అవిహితమై పరిపూర్ణ అనీశ స్థితి ప్రకటితమైనది.

మెహెర్‌బాబా జీవితంలోని ముఖ్యమైన సంఘటనలు, ఆయన ప్రపంచాని కిచ్చిన సందేశాలు, ఆధ్యాత్మిక మార్గంలో ఆయన చెప్పిన సత్యాలు, చివరకు ఆత్మ పొందే సాక్షాత్కారం, సంపూర్ణత్వం, భగవత్ చైతన్యం యొక్క వివిధ స్థాయిలు, యివన్నీ, యిదివరకటి సద్గురువులు, పూర్వ అవతారులు తెలుపనివేమీ కావు. కానీ, బాబా అపురూపమైన ఈ ఆధ్యాత్మిక సత్యాల్ని చిన్మయ చేష్టలద్వారా సరళమైన భావాలతో సులభ శైలిలో, ఆచరణ రూపంలో మనకందించారు.

## నవజీవన ప్రాశస్త్యం

బాబా జీవితంలో అత్యంత ప్రధాన ఘట్టం నవజీవనం. ఈ జీవితం క్రొత్తదైనా జీవుడు మాత్రం పాతవాడే. నవజీవనంలో పాల్గొన్న వారందరికి వారి పాత జీవితపు శారీరక, మానసిక, యిష్టాభిప్రాయాలన్నీ బాగా చలించిపోయాయి. అట్టి చలనం వలన, ఆ తీవ్ర ప్రకంపనం వలన, మూలమే చెల్లాచెదరై పోయి, నవజీవనంలో పాల్గొన్నవారు అసలు జీవితం, జీవించవలసిన ప్రయోజనం, నిరాశా, నిస్సహాయత, నిష్కామ మని గ్రహించ గలిగారు. అవతార్ మెహెర్‌బాబా అత్యంత సామర్థ్యంతో, వ్యక్తిగత అలవాట్లు, ఆవేశాలు, ఆసక్తులు, ఆశలు, కోరికలు, వాంఛలు, వీటన్నింటిని, నిర్మూలింప చేశారు. వీటినుండి విమోచన కలిగించి, వాటి రూపంలో వున్న అడ్డుగోడల్ని పడగొట్టారు.

నవజీవన కాలంలో బాబా తన సహచరులకు గురు శిష్య సంబంధం మరచిపోయేలా చేశారు. యిట్టి జీవనంలో జీవించడానికి సాహసించిన వారికీ, బాబాకి మధ్య వున్న గురు శిష్య సంబంధం ఒక సాంకేతిక పరమైన పదమే అయినప్పటికీ ఆ సమయంలో వారా భావాన్ని పూర్తిగా మరచునట్లు చేశారు.

ఈ నవజీవనం శరీరం కంటే మనస్సుకు ఒక పెద్ద పరీక్ష వంటిది. అయితే శరీరానికి కూడ కష్టం కలిగించు పని కలిపించక పోలేదు. ఒక్కొక్కపుడు నవజీవనం గడిపే సహచరుల శరీరాలకు, వారు చనిపోదురేమో నన్నంత నీరసం కలిగేది. అంతేకాదు, వారికి నవజీవన మంటే భయం లేనందున, చావు కూడ దరిచేరలేక పోయింది. భోగమయం, సుఖ సంతోషాలు, శాంతి సౌభాగ్యాలు, వీటి గురించిన ఆలోచనలు పోయి, సహచరుల నవజీవన ప్రకాశంలో చావు వెలవెల పోయి శక్తిహీనమైనది.

అందుకే బాబా అన్నారు—నవజీవనం గడుపుటకు ఎవరూ లేకున్ననూ, దానికదే నిరంతరాయంగా సాగుతుందని. మెహెర్ బాబా క్రింద శిక్షణ అంటే అది ఎంతో తియ్యని బాధ. మానసికము, శారీరకము అయిన బాధ యొక్క అన్ని పరిస్థితులలోనూ ప్రేమ పొంగివచ్చేదని శిష్యులకు అనుభవం అయింది. బాబా ప్రారంభించిన యీ శిక్షణ నవజీవనంతో తారస్థాయి చేరుకున్నది. మండలి అంతా కూడ, నవజీవనం లాంటిది మరొకటి లేదని. అటువంటి శ్రమ పడవలసి రావడం, అంతటి కఠినమైన శిక్షణతో కూడిన జీవితం గడపడం, అనాసక్తికరంగా నిస్సహాయ స్థితిలో వుండడం, నిద్రాహారాలు గురించిన కష్టాలు, చలిగాలులు వీస్తున్నప్పటికీ, ఎట్టి ఆచ్ఛాదన లేక రాత్రింబగళ్ళు వారు కాలి నడకన ప్రయాణం చేయటం, బాబా తాను స్వయంగా అట్టి కష్టాలన్నీ అనుభవిస్తూ. తన శిష్యులకు అలవడునట్లు చేయడం వలన, మండలి, యీ నవజీవనం దానికదే సాటి అని భావించారు.

## ఏకాగ్రతకు తర్ఫీదు

సాధారణంగా మన పురాణాలు చదివితే, వాటి సారం మనలో జీర్ణించుకొని హత్తుకుపోవుటకు, నిత్యం మన జీవితంలో చవిచూచే

సంఘటనలతో ఉదాహరణాత్మకంగా వ్యాఖ్యానించబడి, నిరూపణ గావించుట మనం గమనించవచ్చును. అట్లే ఆధ్యాత్మిక ప్రవచనాలు చేసేవారు కూడా వ్యావహారిక వ్యాపకాలలో జరిగే ఎన్నెన్నో సంఘటనలను తమ బోధలతో పొంతనచేసి పదే పదే చెప్పటం మనం సర్వ సాధారణంగా వింటూనే వుంటాము. ఇది యుగ యుగాలుగా, అవతారుల వలన, సద్గురువులు ద్వారా జరుగుతున్న నిత్య సత్యం.

కానీ యీ యుగమం దవతరించిన ప్రేమావతారుడు, అవతార్ మెహెర్‌బాబా "అనాదిగా ఎన్నో బోధలు చేసి, చేసి, విసుగుచెంది యున్నాను. నేనీ అవతారములో క్రొత్త మతమును స్థాపించుటకుగానీ, క్రొత్త తరహా బోధలు చేయుటకుగానీ మానవుడుగా మీ మధ్యకు రాలేదు. మీరు దేనిని తెలుసుకొనాలని నేను కోరుచున్నానో దాని నంతనూ ఒక్కసారే మీరు అవగాహన చేసుకొనగలరని నేను భావించుటలేదు. యుగ యుగాలుగా అనేక మారులు నేను మిమ్ములను మేలుకొలుపుచూ మీ మనస్సులలో నేను జ్ఞాన బీజాన్ని నాటుతూనే వున్నాను."

"మీ శ్రద్ధా భక్తుల ననుసరించి, అది కాలక్రమంలో మొలకలెత్తి మొక్కయై, మహావృక్షముగా పెరిగి, శాఖోపశాఖలై మీరు పొందవలసిన జ్ఞాన ఫలమును ప్రసాదించుచున్నది. యిది నా అవతార ప్రయోజనం. ఈ అవతార కాలంలో మౌనంలోనే వుండి, మీలో ప్రేమబీజాన్ని నాటి, నా చేతలద్వారా మీలో, నవచైతన్యాన్ని రేకెత్తించి, మేల్కొలిపి, మీ గమ్యాన్ని చేర్చుటకు సంకల్పించితిని. అందువలన మనస్ఫూర్తిగా, నా పాదములచెంత ధూళియైపోయి, గాఢంగా నన్ను ప్రేమించండి. చిట్ట చివర వరకు నా కొంగు జారవిడువక గట్టిగా పట్టుకొనండి" అంటూ బాబా మనకు అభయహస్త మిచ్చారు.

దీనినిబట్టి మనకు అవగాహన కలిగేదేమంటే, బాబా యుగావతారుడుగా, కటిక నిజాల్ని బోధల రూపంలో కాక, ఆచరణ రూపంలో ఆచరించి చూపి, సర్వమానవాళికి మేల్కొలుపు గావించి, ముక్తిప్రదాత అయినారు. శిష్యగణాన్ని ఉపకరణలుగా వాడుకొని, ఎన్నెన్నో అనుభవ పూర్వక సంఘటనలతో కూడిన తర్ఫీదు నొసగి తద్వారా గురువు ఎడల శిష్యుని కుండవలసిన ఏకాగ్రతను అలవర్చారు.

# బ్లూ బస్సు

1949 వ సంవత్సరం జూన్ నెలాంతంలో భారతావనంతా శిష్యులతో పయనించిన బ్లూ బస్సును ప్రత్యేక క్యాబిన్‌గా మెహెరాబాద్‌లో ఏర్పాటు చేయించి అందు నలుబది రోజులుపాటు బాబా ఏకాంతవాసం గడిపారు. 1938 లో యీ బ్లూ బస్‌ను బొంబాయిలో చెవర్లెట్ మోడల్ ఛాసిస్, 29.5 H. P. యింజనుతో అమర్చి ప్రత్యేకంగా తయారు చేయించారు. ప్రాక్పశ్చిమ శిష్యులు, సుఖంగా ప్రయాణం చేయుటకు వీలుగా దీని నిర్మాణం జరిగింది. డ్రైవరుకు వెనుక భాగంలో, కఠిన ఏకాంతవాసం జరిపిన స్త్రీ మండలి, పురుషుల దృష్టిగాని, శబ్దంగాని పడుట కవకాశం లేనట్లుగా ఒక ప్రత్యేక కంపార్టుమెంటు ఏర్పాటు చేయబడింది. బస్సంతా ముదురు నీలంరంగు వేయబడింది. ప్రక్కల ప్రేలాడే తెరలు కూడ నీలిరంగులోనే వుండేవి. అందుకే దీనిని "బ్లూ బస్సు" అనేవారు.

సామానులతో నిండిన సంచులు, పక్కచుట్టలు, బెడ్డింగులు. పెట్టెలు వగైరాలన్నీ బస్సు పైభాగాన వేసుకొని, బాబా మండలితో పయనిస్తుంటే, యీ బ్లూ బస్సు ఒక చిన్న పర్వతంవలె కనపడేది. మొదటగా యీ బస్సు, భరత ఖండ పయనంలో 8-12-1938 న మెహెరాబాదు వదలింది. దానిపై వేసిన బరువు, దాని నిర్మాణం చూసి, యింత బరువుతో యిది నడవగలదా

అని శిష్యులంతా సంశయించారు. అది కనీసం, తన ప్రథమ మజిలీ అయిన హైదరాబాదన్నా చేరలేదని అనుకున్నారు. అయితే ఆ బస్సు, యావత్భారతదేశం ఎట్టి అవాంతరం లేక నడిచింది. ఎలిజబెత్తు పాటర్ సన్, డా. డాన్కిన్, యీరుచ్ లు దానిని నడిపారు. బ్లూ బస్సుతో జరిపిన ప్రయాణంలో ఎన్నెన్నో మరుపురాని ఘటనలు జరిగాయి.

పర్యటనా నంతరం, కొంతకాలం జరిగిం తర్వాత బాబా బ్లూ బస్సును అమ్మేద్దామనుకున్నారు. లాటరీవేసి అమ్మితే బాగుంటుందని ఒకరు సలహా యిచ్చారు. ఉల్లాసంతోవున్న బాబా అందుకు అంగీకరించారు. ఒక్కొక్కటి వంద రూపాయలుండే టిక్కెట్లు దగ్గరున్న బాబా ప్రేమికు లందరికీ అమ్మారు. ఢిల్లీనుంచి వచ్చిన ఒక బాబా ప్రేమికుని లాటరీ వరించింది. అతడు కొన్న టిక్కెట్టుపై బ్లూ బస్సును పొందాడు. అయితే ఆ ప్రేమికుడు అత్యంత వినయంతో. ఆ బ్లూ బస్సును, భారతదేశ యాత్రా విశేష జ్ఞాపక చిహ్నంగా, మరపురాని అద్వితీయ వస్తువుగా తన సన్నిధిలోనే వుంచుట కనుమతించమని బాబాను ప్రాధేయపడ్డాడు.

ప్రేమమయుడు మెహెర్‌బాబా అతని కోరిక మన్నించారు. బస్సును స్వీకరించారు. అహ్మదు నగరంలో ఆటోమొబైలు దుకాణం వున్న సరోష్ యిరానీ అనే తన శిష్యునికా బస్సు వప్పగించారు. సరోష్ దానిని ఓవర్ ఆయిలింగు చేయించి, సిటీబస్సుగా కొంతకాలం వాడాడు. తరువాత రిపేర్లు ఎక్కువగుటతో దానిని గ్యారేజిలో ఒక మూల వుంచారు.

1949 మార్చిలో బాబా మౌంటు ఆబూ వెళుతూ, సరోష్‌ను పిలిచి, బ్లూ బస్సు యింజను, చక్రాలు ఊడదీసి వాటిని తానుంచుకొని, తక్కిన బస్సు బాడీని మెహెరాబాద్ చేర్పించి, అందు తాను ఏకాంతవాసం జరుపుట కనువుగా చక్కని గదిగా మార్పించమని కోరారు. లోపల సీట్లన్నీ

కూడ, యింజను, చక్రాలతోపాటు తొలగించబడ్డాయి. యిటుకలతో దిమ్మలుకట్టి వాటిమీద బస్సు బాడీని నిలిపారు. మే నెలలో బాబా మౌంటు ఆబూ నుండి తిరిగివచ్చేసరికి పాత బస్సు రూపంపోయి, క్రొత్త రంగులతో అందంగా సరిక్రొత్త గదిలా మార్పు చెందింది. మెహెరాబాద్‌లో, మండలి హాలు ప్రక్కగా యీ బ్లూ బస్సు యీ నాటికి చక్కని కాంతులతో అందంగా అలంకరించబడి దర్శనమిస్తుంది.

బస్సు మూడు వైపులా ప్రక్కనున్న గదుల గోడలున్నాయి. నాలుగోవైపు మేదరతడిక అడ్డంగా కట్టారు. దాని ప్రక్కనే యిరుకు సందొకటి వున్నది. ఆ సందులోనే వేప చెట్టొకటి విప్పారిన కొమ్మలతో బస్సును తాకుతూ వుంది. యీ బస్సులోనే బాబా ఏకాంతవాసం జరిపారు.

## ఏకాంతవాసం

1949 జూలై మాసమంతా మౌనం పాటించమని మండలి వారందరికి సర్క్యులరు పంపబడింది. అహ్మదు నగరులోను, మెహెరాబాదులోను వున్న పురుష మండలి శిష్యులందరని మెహెరాబాదు రావలసినదిగా జూన్ 22 నే కబురుపెట్ట బడింది. ఆనాడే బాబా ఏకాంతవాసమున కుపక్రమించే దినం. అందుచేత, మెహెరాబాద్ ఆశ్రమ మేనేజరు, కాకా బారియా బస్సు క్యాబిన్ను అందంగా పుష్పాలతో అలంకరించి ఆనాడొక పండుగగా భాసిల్లునట్లు ఏర్పాట్లు చేశాడు: తడికపై రంగులతోవున్న బాబా ఫొటో నొకదానిని తగిలించారు. ప్రక్కనే సప్తవర్ణ పతాకం ఎగురవేయబడింది.

శిష్యులంతా మెహెరాబాద్ చేరింతర్వాత, పవిత్ర గ్రంథ పఠనం చేయబడింది. మధ్య మధ్య బాబా చదువుతున్న ప్రవచనములలోని ప్రాధాన్యతను వివరించారు. కాలేమామా అనే వృద్ధ శిష్యుడు, భగవద్గీతలోని 9 వ అధ్యాయం చదివాడు. కాక్ సాహెబ్ ఖొరాన్‌లోని ప్రథమ

ద్వాదశ ఆయతనములు పఠించాడు. ఖొరాన్ పఠనం జరుగుతున్నప్పుడు బాబా "మహ్మద్ ప్రవక్త బోధలు కృష్ణుని బోధలకు భిన్నమైనవికాదు. అయితే ఆయన ఆనాటి అవసరముల కనుగుణ్యంగా తన బోధలు కావించాడు" అన్నారు. డా, డాన్‌కిన్ న్యూటెస్టుమెంటులోని క్రీస్తుప్రభు ఇచ్చిన ధర్మోపదేశం చదివాడు, కైకొబాద్ ఆవెస్తా గ్రంథం పఠించాడు. డా. డాన్‌కిన్, కాక్‌సాహెబ్, కైకోబాద్, కాలేమామా, యీ నలుగురూ బాబా మండలిలో "ముల్లా" అని పిలువబడేవారు.

అంతంలో బాబా యీ గ్రంథాలన్నీ సత్యాన్నిచేరుట కుపయోగపడే భిన్న మార్గాలని ప్రభోదించారు. ఏ మార్గం నుండి అయినప్పటికినీ, నిజాయితీగా, ప్రేమతో అనుసరించినప్పుడే భగవంతుని చేరగలరు అని చెప్పారు. ఆనాటి సమావేశాన్ని ముగిస్తూ "యిప్పుడు నే నాచరించమున్న యీ నా ఏకాంతవాసం, తపస్సుగానీ, మితోప భోగంకానీ కాదు. ఏకాంత వాసం గడుపుటకు నా స్వంత కారణాలున్నవి. మీ రూహించలేరు." అని చెప్పి, డా. దేశ్‌ముఖ్ చేత స్వామి శంకరాచార్య జీవితం ప్రతిఫలించే కీర్తన గానం చేయించారు. కార్యక్రమం జరుగుతున్నంతసేపూ బాబా దివ్య తేజస్సుతో, వెలుగొందుతూ భాసిల్లారు. హారతి అయిన పిదప, అందరికి బాబా ప్రసాదం పంచారు. ఆనాటి కార్యక్రమం అంతటితో సమాప్తమైంది.

## సామూహిక పహౌనం

ఈ విధంగా ప్రారంభించిన ఏకాంతవాసంలో బాబా అధిక కాలం కఠిన ఉపవాసా లుండేవారు. కేవలం ద్రవ పదార్థాలు మాత్రమే కొన్నాళ్ళు తీసుకున్నారు. ఏకాంతవాసంలో అనూహ్యమైన విశ్వ కార్యక్రమాలేవో బాబా జరిపారు. జూలై 31 వ తేదీతో యీ ఏకాంతవాస దీక్ష సమాప్త

మైనది. మెహెరాబాద్‌లోవున్న సేవకులు సైతం నెలనుండి మౌనం పాటిస్తూ శిష్యులతోపాటు ఆనాడు మౌనం పాటించాలని ఆదేశించబడ్డారు. అహ్మద్‌నగరు నుండి, మెహెరాబాదు నుండి శిష్యులందరూ మెహెరాబాదుకు ఆగష్టు 1 న పిలువబడ్డారు. ఉదయం 7 గంటలకే పరగడపునే, టీ అన్నా సేవించకుండా రావాలని ఆదేశం జారీ అయింది. వచ్చిం తర్వాత, బాబాకు వారెట్టి ప్రణామము లాచరించరాదని, నమస్కరించరాదని ప్రత్యేక ఆజ్ఞలు యివ్వబడినవి.

సరిగా ఏడు గంటలకు బాబా తడిక తలుపు తెరచుకొని తన క్యాబిను నుండి వెలుపలకు వచ్చారు. నలుబది రోజులు ఏకాంతవాసం గడిపినా, బాబా సరదా ట్రిప్పులో పాల్గొని వచ్చినట్లు ఉల్లాసంగా కనిపించారు. జూన్ 22 న వివిధ పవిత్ర గ్రంథ పఠనం చేసిన వారితోనే, తిరిగి ఆగష్టు 1 వ తేదీన బాబా సందేశాన్ని చదివించారు. అంతంలో పవిత్ర పదములు "ఓం", "అమెన్", "అమిన్", "తత్సత్" అనునవి వుచ్చరించబడినవి. యీ సందేశాన్ని నాలుగు భాషలలో పఠించిన తర్వాత పై పవిత్ర పదాలు పలుకుతూ, శిష్యులంతా తమ మౌనాన్ని విరమించారు. రవ్వ కేసరి ప్రసాదంగా అందరికీ బాబా పంచిపెట్టారు.

బాబా చేసే ప్రతి ఏకాంతవాస కార్యక్రమంలోనూ అనూహ్యమగు రహస్యమేదో తప్పనిసరిగా దాగి వుంటుంది. యిప్పటి ఏకాంతవాసం అత్యంత ప్రధానమైనది. మానవాళి అభ్యున్నతికి, భావితరాల వారితో సంబంధం సంతరించుకొని, అనూహ్యమగు నూతన ఘట్టమేదో దైవ కార్యక్రమంలో భాగంగా జరుపబడిందనేది నిర్వివాదాంశము.

ఈ ఏకాంతవాసం పరిసమాప్తమైనప్పటి నుండీ బాబా తరుచూ నవజీవన గురించి సూచించుట ఆరంభించారు. తరువాత ఒకసారి బాబా అన్నారు—"నేను మెహెరాబాద్‌లో చేసిన కార్యక్రమం, ప్రపంచంలోని

ఏ భాగంలో కూడ యింతవరకూ చేసి యుండలేదు." అని. అందుకే నాకు బాబా పూర్వ జీవనానికి, నవజీవనానికి, యీ బ్లూ బస్సు ఒక బంధం వంటిదని అనిపిస్తుంది. ఆ కారణం చేతనే బ్లూ బస్సు గురించి వివరంగా ముచ్చటించాను.

## తెర తొలగింపు

ఎప్పుడు ఏకాంతవాసం జరిపినా అది బాబా యొక్క కార్యక్రమాల్లో ఒక మార్పును సూచించే నూతన ఘట్టము అనే అభిప్రాయం శిష్యులందరికీ వుండేది. ఏకాంతవాసం చేసిన ప్రతిసారీ బాబా కార్యక్రమ సరళిలో నూతన శకం ఆరంభమయ్యేది. అందుకే యీ నలుబది రోజుల ఏకాంత వాసం పూర్తయిన తరువాత, నూతన ఘట్టమేదో బాబా ప్రకటిస్తారని శిష్యులు తలచారు. పురుష మండలి మౌన విరమణానంతరం, ప్రసాదం పంచింతర్వాత, బాబా స్త్రీ మండలి సన్నిధికి వెళ్ళారు. అంతవరకూ వాళ్ళూ మౌనంతోనే వున్నారు.

స్త్రీ మండలిచేత, బాబా ఓం, అమెన్, అమిన్, తత్సత్ అను పవిత్ర పదాలను వుచ్చరించునట్లుచేసి వారి మౌన విరమణ గావించునట్లు చేశారు. తదుపరి వారికి ప్రసాదం పంచబడింది. ఏకాంతంలో అలసివున్న బాబాకు విశ్రాంతితో వినోదం కలిగించాలని, మెహెరా, మణీ యిరువురూ కలసి, బొమ్మలతో చక్కని వినోదాత్మక దృశ్యాన్ని ప్రదర్శింప చేశారు. సంభాషణలు వారే స్వయంగా వ్రాసి వుచ్చరిస్తుంటే ప్రియతముడు ఆనందంతో సరదాగా వినోదించారు.

అంతట బాబా క్లుప్తంగా యిలా వివరించారు. "నే నీ ఏకాంతవాస కాలంలో ఒక క్రొత్త ఘట్టం ఆరంభించాలని నిర్ణయించుకున్నాను. దాని ఫలితంగా, యీ ఆశ్రమాలన్నీ ఎత్తివేయదలచాను. యావద్భారతావనిలోను

వున్న ఆశ్రమ ఆస్తులన్నీ అమ్మివేయ సంకల్పించాను. నన్నంటిపెట్టుకొని వున్న శిష్యు లనేకమందిని, ప్రపంచం నలుమూలలా పనిచేయుటకు పంప దలచాను. బహు కొద్దిమందిని మాత్రమే నా వెంట తీసుకుంటాను" అన్నారు.

## తుది సమావేశం

1949 ఆగష్టు 31 అత్యంత ప్రధానమైనరోజు. ఆ రోజు ఉదయం సరిగా 8-00 గంటలకు మెహెరాబాదు హాలులో అతి ముఖ్యమైన సమావేశం జరుగును కనుక ఆహ్వానితులైన మండలి అంతా శుచిగా స్నానంచేసి, ఉతికిన దుస్తులు ధరించి, విధిగా ప్రకటించిన సమయానికి, హాలులో సమావేశం కావాలని ఆదేశాలు పంపారు. హాలు కూడ శుభ్రంగా ఉదయానే కడిగించారు. నియమిత సమయానికి ముందు ఎవ్వరూ హాలు లోనికి పోరాదని శాసించారు.

ఆహూతులు స్నానాదికాలు నిర్వర్తించుట కన్ని ఏర్పాట్లు ముందుగానే చేశారు. అయితే అప్సరీ ఒక్కడే బొంబాయినుండి రైలులో బయలుదేరి ఆరోజు ఉదయానికే వచ్చుటచేత, అతడు వచ్చుటకు ఆలశ్యం కాకుండా వుండుటకు బాబా అహ్మద్‌నగర్ స్టేషనుకు కారు పంపారు. సరాసరి స్నానాలగదికి వెళ్ళి స్నానంచేసి, నియమిత కాలానికే హాలులోనికి చేరాడు.

8 గంటలైన తరువాత లోనికి ఎవరినీ రానీయవద్దని బాబా శాసించారు. బాబా సోదరుడు బెహ్రామ్ కొంచం ఆలశ్యంగా పూనానుండి రాగా, అతడిని లోనికి పోనీయక బయటే ఆపివేశారు.

ఎనిమిది గంటలు కాగానే హాలులోనికి ముందుగా బాబా ప్రవేశించి తమకు ఏర్పాటుచేసిన ఆసనానికి అభిముఖంగా నిలబడ్డారు. ఆ తరువాత

తక్కిన మండలిని లోనికి రమ్మన్నారు. కొద్ది నిమిషాలైన తరువాత పాద్రిని పిలిచి, తమకు ఎదురువచ్చి, హాలులో అడ్డంగా అటు యిటూ నడువమన్నారు. అప్పుడు బాబా అన్నారు "నాకు పిల్లి ఎదురొచ్చినా ఫరవాలేదుకానీ, మనిషంటూ తన దారి కెదురువచ్చుట కొప్పుకోనన్నా"రు. ఆ తదుపరి ఆ సమావేశంయొక్క ప్రాధాన్యత వివరించేముందు మండలిలోని నల్గురు ముల్లాలతో పవిత్ర గ్రంథ పఠనం చేయించారు.

## నియమాల ప్రకటన

అవెస్తా, బైబిలు, ఖురాన్, భగవద్గీతల నుండి కొన్ని శ్లోకాలు పఠించిన తరువాత బాబా పిడుగులాంటి వార్త ప్రకటించారు. 1949 అక్టోబరు 16 వ తేదీ నుండి నవజీవనం ప్రారంభించబడునని దాని సారాంశం. "యిప్పటికి షుమారు 28 సంవత్సరముల నుండి, మీరంతా నా దగ్గర వుండి, సకల భోగములు అనుభవించారు. మరి నేనిక నుండి, నిరాశ్రయుడనై, త్యాగమయ జీవనం గడుపదలచాను. కనుక, మన ఆశ్రమమునకు సంబంధించిన యావదాస్తులు విక్రయించి, పేద సాదలకు పంచిపెట్టి పరివ్రాజక జీవనం గడుపదలచితిని."

"నే ననుభవింపదలచిన జీవనం, కంటక భూయిష్టమై దుస్సాధ్యముగా వుండును. అందువలన యికపై మీరు నాతో వుండుట కష్టతరము కాగలదు. మీరు నాతో వుండుటకు యిష్టపడుదురేని, మీరు కూడ నా వలెనే సర్వసంగ పరిత్యాగం చేసి, పరివ్రాజకులు కావలయును. మైళ్ళ కొలది కాలినడకన పయనించవలసి వచ్చును. ఆరుబయట కటిక నేలపై పరుండ బెట్టుదును."

"సన్యాసులవలె, కౌపీనధారణ చేసి బిచ్చమెత్త వలయును. మీరు తెచ్చే భిక్షాన్నం ముందుగా నాకు సమర్పించి, అది మరల నేను నా చేతులతో

మీకు యిచ్చినప్పుడే భుజింపవలయును. ఏ కారణము చేతనైనా, నా చేతులు స్వాధీనం తప్పి, మీకు భిక్షాన్నం పెట్టజాలకున్నప్పుడు మీరు కేవలం జలం మాత్రం త్రాగి జీవించాలి."

"మీరు రోగ గ్రస్తులైనచో నా అనుమతి లేనిదే వైద్యుని సహాయం కోరుటగానీ, రోగ నివారణ ప్రయత్నం చేయుటగాని చేయరాదు. మీరు యితరులచే గౌరవింపబడుటగానీ, మన్ననలు పొందుటగానీ చేయరాదు. నేను మిమ్ములను నాపై వుమియమన్ననూ, కాలితో తన్నమన్ననూ, వెనుకాడక అట్లు చేయవలయును."

"మీ పాదములపై నేను వ్రాలి, నమస్కరించదలచి నప్పుడు, ఎట్టి జంకూ, కొంకూ లేక అట్లే నిలబడాలి. మీరు మీ యోగక్షేమములు గూర్చి గానీ, యితరుల యోగక్షేమములు గూర్చి గానీ, ఆలోచించరాదు. ప్రపంచమునందు మీరు నిస్సహాయులుగానూ, మృతప్రాయులుగానూ వ్యవహరించాలి. నాయందు సంపూర్ణ విశ్వాసం కలిగి, నా ఆజ్ఞలయందు ఎట్టి విమర్శకు తావీయక వాటిని ఎల్లప్పుడు పాటించాలి. మరి యిట్టి నియమాలన్నీ పాటిస్తూ నన్ననుసరించదలచిన వారెవ్వరో తమ అంగీకారం తెలుపమ"ని ప్రకటించారు.

స్త్రీ స్పర్శ నిషిద్ధం. ధనాన్ని ముట్టరాదు. రాజకీయ చర్చ పనికిరాదు, అబద్ధమాడరాదు. ఎట్టి పరిస్థితులలోనూ వీడ్కోలు సమావేశములు వంటివి కల్పించరాదు, యీ అన్ని నిబంధనలు తన ననుసరించు ప్రతివారు విధిగా పాటించాలి.

యీ నిబంధన లన్నింటిలోనూ అత్యంత ప్రధానమైనది, తన ననుసరించే వారెవ్వరూ, ఏవిధమగు ఆధ్యాత్మిక పరమైన. లేదా భౌతిక పరమైన ప్రతిఫలాన్ని ఆశించరాదు. ఇదే నవజీవనం. యీ కాలంలో వారు కేవలం సహచరులుగా మాత్రమే అనుసరించాలి. ఆయన కూడ

వారికి సహచరుడే కానీ, గురువు కూడ కారు. అట్టి జీవితం, అసహాయతతో, నిరాశాయుతమై భుక్తి కొరకు యాచక వృత్తి నెఱపవలసి వున్నది. తమ జీవితం కేవలం వర్తమానమునకే పరిమితం.

నిన్న గడిచిపోయింది ఎలాగో, నేడు కూడ గడిచిపోయింది అది గడుచు రీతితో. మరి రేపు గురించిన చింత ఎవరికి ? రేపు కూడ గడిచి పోతుందిలే ! అనే భావంతో గడిపే నిస్సహాయ, నిరాశామయ జీవనం యీ నవజీవనం. బాబా సహచరులతో, యీ కాలంలో, వారి సహచరుడుగా కలసి జీవిస్తూ, వారి మనస్సులను ఆయన యందే లగ్నమై యుండునట్లు చేయ సంకల్పించారు. తాను మిత్రులకు సహచరుడే అయినప్పటికీ, అది మంచిగానీ, చెడుగానీ, బాబా యిచ్చే ప్రతి ఆజ్ఞను, విధేయతతో సహచరులు పాటించి తీరాలనేది నియమం.

## సహచరుల ఎంపిక

యిలా ఎన్నెన్నో నియమాలను బాబా శిష్యుల ముందుంచి, వాటన్నిటినీ నియమ బద్ధంగా పాటించ కలవారు తన వెంట వుండుటకు అంగీకారం తెలుపమని ఆదేశించారు. అఖరులో బాబా మరో మాట ప్రకటించారు. " మీరంతా బాగా ఆలోచించుకొని, నా నియమాలకు కట్టుబడి నాతో నవజీవనంలో అనుసరించుటకు ఎందరు రాదలుచుకున్నారో వారు కేవలం, " అవును " లేక " కాదు " అని మాత్రం చెప్పమన్నారు.

చాల కొద్దిమంది మాత్రం తమ వునికితో బాబాకు మరింత బరువు భారాన్ని కలిగించుటకు యిచ్ఛగించక బాబాతో నవజీవన కాలంలో సంచరించ లేకపోతున్నామని, అశ్రు నయనాలతో విన్నవించుకున్నారు. అయితే దాదాపు 1200 మంది సంపూర్ణ బుదితో ఆయన సేవలో ఆయన వెంట

కొద్దిమందిని మాత్రం, బాబా కడు చాకచక్యంతో, తక్కినవారి మనస్సుల కేవిధమైన వ్యథ కలుగనీయక తన ననుసరించుటకు ఎంపిక చేశారు. 25 సంవత్సరములు పైబడి 60 సంవత్సరములు దాటని వారిని 26 మందిని అందులో 22 పురుషులు నలుగురు మహిళలను ఎంపిక చేశారు. నవజీవనంలో బాబాను అనుసరించుటకు బాబాచే ఎంపిక చేయబడిన శిష్యుల పేర్లు—

1) ఆది. కె. ఇరానీ 2) డా. దౌలత్‌సింగ్ 3) అన్నాజాకార్ 104 4) ఆలీ అక్బర్ షాపూర్ జమాన్ (అలోబా) 5) మినూ (కరాస్) 6) బాబుదాస్ 7) పంనోబా (దేశ్‌ముఖ్) 8) కిషన్‌సింగ్ 9) బాలనాటు 10) డా. అబ్దుల్ ఘనీ 11) పెండూ 12) విష్ణునారాయణ్ డియోరుక్కర్ 13) యీరూచ్ 14) డా. నీలకాంత్ గాడ్సే (నీలూ) 15) డా. విలియమ్ డాన్‌కిన్ 16) కాకా ఎస్ బారియా 17) బైదుల్ (రుస్తుమ్ జఫ్రాబాదియిరానీ) 18) గుస్తాద్‌జీ నస్సర్‌వాన్‌జీ హన్సోటియా 19) మురళి 20) మానెక్ (మెహెతా) 21) సదాశివ పాటిల్ 22) చగ్గన్ 23) మెహెరా 24) మణి 25) మెహెందూ 26) డా. గోహెర్.

## స్త్రీ మండలి సమావేశం

మొదటి రోజున పురుష మండలిని, రెండవ రోజున స్త్రీ మండలిని విడివిడిగా సమావేశపరచి నవజీవన నిర్ణయం ప్రకటించారు. మొదటిరోజు పురుష మండలితో చర్చించుట పూర్తయిన తర్వాత, మరుసటి రోజున, మెహెరాబాదు కొండపై స్త్రీ మండలిని సమావేశపర్చారు. ముందుగా అందరి కొరకు గంట మ్రోగింపబడింది. కొండపైన తూర్పు భాగంలో వున్న గదిలో స్త్రీ మండలి సమావేశమైనది. బాబా మెహెరా మంచంపై కూర్చున్నారు. గదిలోకి వస్తున్న ఆశ్రమవాసు లందరిని పరికించి చూస్తున్నారు. మెహెరాబాద్‌లో వుండే స్త్రీలంతా ఆనాడు బాబాతో

అలా ఆనాడు స్త్రీ మండలి అంతా ఆ గదిలో జరిగే సమావేశానికి వస్తున్నప్పుడు బాబా ప్రతివారిని చిరునవ్వులతో ఆహ్వానించారు. అయితే ఆయన ముఖ కవళికలబట్టి, భావప్రకటనలో కొంత తీవ్రత ప్రస్ఫుటమైనది. అందరిని కూర్చోమని సౌంజ్ఞ చేశారు. ప్రతివారు తలా ఒక స్టూలు వేసుకొని, ఎవరికి వారు బాబాను కన్నులారా చూడాలనే తలంపుతో కూర్చున్నారు. మెహెరా ఆయనకు సమీపంలో కూర్చుంది. గంభీర వాతావరణంలో ప్రియతముడు తన ప్రకటనను అక్షర ఫలకంపై ప్రారంభించారు. బాబా సౌంజ్ఞలను సోదరి మణి చదువుతోంది.

స్త్రీ మండలి ఎలాంటి అమూల్య వ్యక్తులో, యిన్ని సంవత్సరాలుగా వారంతా వినయంతో బాబా ఎడల విధేయులై యున్నారో, తన ఆశ్రమంతో తనతో యిట్టి సన్నిహిత సాంగత్యం గడుపు అవకాశం పొందిన వారంతా ఎంతటి అదృష్టవంతులో వరుసగా బాబా వివరిస్తున్నారు. అలా చెపుతూనే తానిప్పుడు కూడ వారినుండి విధేయతను ఆశిస్తున్నా నన్నారు. సమావేశమైన స్త్రీ మండలి అంతా ఒక్కొక్కరే వరుసలో తన ముందు కువచ్చి, తన ఎడల విధేయులమై వుంటామని, బాబా తమను ఎక్కడకు వెళ్ళమని నిర్ణయిస్తే అక్కడకు వెళ్ళగలమని హామీ యివ్వమని కోరారు.

ఈ సమావేశం మెహెరాబాదు కొండపై జరిగింది. కేవలం మహిళలు మాత్రమే పాల్గొన్నారు. బాబా స్త్రీలలో కొందరిని మెహెరా బాదులో వుండమని కోరగలనని, మరి కొందరిని బొంబాయి లేదా పూనా గాని మరెక్కడికైనా గానీ, వెళ్ళివుండమని లేదా వివాహం చేసుకొనమనియో కోరగలనని వారంతా అలా నడచుకొనవలయునని హెచ్చరించారు.

అయితే తాను అహ్మద్‌నగరు వదలి, కొద్దిమంది పురుషులు, మరి కొద్దిమంది స్త్రీ మండలిని వెంట పెట్టుకొని, వెళ్ళదలచా నన్నారు.

యీ విషయంలో తన నిర్ణయాన్ని త్వరలో ప్రకటిస్తానని చెప్పారు. యిప్పుడు స్త్రీ మండలిపై తాము బాబాతో చేరి, ఆయన సూచించే నిర్ణయ మెట్టిదైనా, ఆయనకు విధేయులై వుండుటో, లేదో చెప్పుటయే మిగిలిందని అన్నారు. తనతో అనుసరించి వుండుట లేక తనను వదలి దూరంగా వుండుట యీ రెండింటిలో ఏదో ఒకటి నిర్ణయించుకొని, క్లుప్తంగా "అవును" లేక "కాదు" అని చెప్పమన్నారు బాబా.

కొందరు ఎట్టి సంకోచం లేకుండా "అవును" అన్నారు. కొంత ఆలోచనా నంతరం మరికొందరు "సరే" అన్నారు. వాతావరణం చాలా గంభీరంగా వుంది. అందరూ మొత్తంమీద అనుకూలమైన జవాబే యిచ్చారు. బాబా చివరకు ఆనందంతో సంబరపడిపోయి, తన కెంతో సంతోషంగా వుందన్నారు.

చివరకు బాబా స్వయంగా, తనతో నవజీవనంలో అనుసరించుటకు నలుగురు స్త్రీలను అనుమతించారు. వారు 1) మెహెరా 2) మణి 3) మెహెరూ 4) డా. గోహెర్. అప్పటివరకు, చాలమంది స్త్రీ మండలి మెహెరాబాద్, మెహెరాజాద్‌లలో వుండే ఏర్పాటు వుండేది. అయితే యిప్పుడు నవజీవనం ప్రారంభం కానున్నందున, మెహెరాజాద్, మెహెరాబాదులలోని ఆశ్రమాలను ఎత్తివేయ సంకల్పించారు.

## వేర్పాటుకు ఏర్పాటు

నవజీవనం ప్రారంభించుటకు ముందు చేయవలసిన ఏర్పాట్ల విషయంలో బాబా, తన మండలితో హడావిడిగా వున్నారు. తండ్రులో, పిల్లలో, బాబా కొరకు పనిచేస్తున్న కుటుంబాలెన్నో ఆయనపై అధారపడి వున్నవి. అందుచేత అట్టివారిని, ఏ ఆధారంలేని ఏకాకులుగా చేయక,

తగు ఏర్పాట్లు చేయవలసిన అవసరం బాబాకు కలిగింది. అట్టి కుటుంబ సభ్యులకు ఏవో వృత్తులు, వ్యాపకాలు కలిపించవలసి వచ్చింది.

తగు బాధ్యతను వప్పగించి, పనిచేయ నియమించిన వారిని " ఏర్పాటు వాలా " లన్నారు. మరి యిట్టి ఏర్పాటు వాలాలకు అవుసర మగు పైకం సమకూర్చవలసి వచ్చింది. బాబాయే స్వయంగా నిర్ణయాలు చేయవలసిన పను లింకెన్నో వున్నయి. యీ విధంగా వీటన్నిటినీ చక్కపరచుటకు ఆయనపైన, తన కార్యక్రమం కొనసాగించే వారిపైన ఎనలేని భారం పడింది.

చివరకు బాబా తన నిర్ణయం ప్రకటించారు. యిరువది యిద్దరు పురుష మండలితోపాటు, నలుగురు స్త్రీ మండలి నవజీవన కాలంలో తనతోపాటు అనుసరించవలెనని చెప్పారు. నవజీవన కాలంలో ఏదో ఒకరోజున, రానో, కిట్టీ, నజాలను వచ్చి నవజీవనంలో తనతో కలవమని పిలిస్తే రమ్మనమని ఆజ్ఞాపించారు. అంతవరకూ వారిని బొంబాయి వెళ్ళి నారిమన్ గారింట్లో వుండి ఉద్యోగ ప్రయత్నం చేయమన్నారు. మరి కొందరిని పూనా వెళ్ళి యీరుచ్ తల్లి గైమాయి వద్ద వుండమన్నారు. జేరామాయిని తన కుటుంబంతో మెహెరాబాద్‌లో వుండమన్నారు. మన్సారీని బొంబాయిలోని ఆమె సోదరుని యింటికి గానీ నవసారీకి గానీ వెళ్ళమంటే ఆమె జేరామయితోబాటు మెహెరాబాద్‌లో వుండుట కనుమతించమని ప్రాధేయపడగా, అయిష్టంగానే బాబా కొంత ఆలోచించి, తుదకు అంగీకరించారు.

## జాక్‌పాట్

అయితే యీ విధమైన ఏర్పాట్లు పూర్తిచేయుటకు చాలా పైకం అవుసరమైంది. దాంతో, ఆశ్రమంలో వాడకుండా వుంచిన వస్తువులన్నీ

అమ్మివేయ సంకల్పించారు. బాబా స్వయంగా వాడని వస్తువు లనేకం, రేకుల షెడ్డులోని ఒక సామాను గదిలో వుండేవి. యిత్తడి బిందెలు, కాగులు, కళాయిలు, దేగిశాలు, కెటిళ్ళు, టీపాయిసెట్లు, చాకులు, స్పూన్లు, ఫోర్కులు, గాజు సామాన్లు, పింగాణీ సామాన్లు, తివాచీలు, కార్పెట్లు, ఎందరో పాశ్చాత్యులు, ప్రాక్పశ్చిమ ప్రేమికులు బాబాకు తెచ్చి సమర్పించు కున్న అనేకానేక వస్తు సముచ్ఛయ సంపద, వీటన్నిటినీ బయటకు తీశారు. ఇవి కాక, ఎంబ్రాయిడరీ చేసిన దిళ్ళు, పరుపులు. చేతిపని చేసిన వస్త్రాలు, తివాచీలు, జంపుఖానాలు, ఎన్నెన్నో యిందులో వున్నాయి. అసలు వాడని వస్తువులెన్నో వున్నయి. అవన్నీ లారీనిండా వేసి, వేలంలో అమ్ముటకు బొంబాయి పంపారు.

మెహెరాబాద్, మెహెరాజాద్ ఆశ్రమాలు రెండూ ఎత్తివేసి అమ్మకానికి పెట్టారు. మెహెరాబాద్ ఆశ్రమాన్ని మెహెర్జీ కార్కారియా, మెహెరాజాద్ ఆశ్రమాన్ని నారిమన్‌దాదా చానీలు కొనుగోలుచేసి వాటి యజమానులైనారు. వీరిరువురూ బాబా శిష్యులే. బాబా ఎడల వారికున్న ప్రేమను పురస్కరించుకొని, వారిరువురు తమకు చెందిన యీ ఆస్తులను, బాబాకు మరియు ఆయన మండలి యధేచ్ఛగా వినియోగించుటకు వీలుగా బాబా ఆధీనంలో వుంచారు. కొన్ని సంవత్సరాలు గడిచాక 1968 లో మెహెర్జీ అహ్మద్‌నగర్ అవతార్ మెహెర్‌బాబా ట్రష్టు పేర, మెహెరాబాద్ దాన పత్రాన్ని వ్రాసి యిచ్చాడు. మెహెరాబాద్ అంటే, మెహెర్ రిట్రీటు, బాబా సమాధి వగైరాలున్న కొండ పైభాగం, ఆశ్రమం, ధునీ, మున్నగునవి రోడ్డు ప్రక్కనేవున్న క్రింది మెహెరాబాద్ కలసి, మెహెరాబాద్ అనబడుతుంది.

మెహెరాజాద్ యీ నాటికీ నారిమన్ భార్య ఆర్నవాజ్ పేరనే వున్నది. నారిమన్ 2-7-1974 న బాబాలో లీనమైనాడు. అతని పేర

వున్న ఆస్తి భార్య నారిమన్ పేర సంక్రమించిన ఫలితంగా, మెహెరాజాద్ ఆమె పేర వున్నది. కాగా మెహెరాబాద్ పబ్లిక్ ఆస్థి అయింది. మెహెరాజాద్ ప్రయివేటు ఆస్తిగా మిగిలింది.

## బాబా నిర్ణయం

బాబా నిర్ణయించిన లిస్టు ప్రకారం, శిష్యులందరికీ, సర్క్యులరు పంచబడింది. సర్క్యులరులో పొందుపరచిన నియమ నిబంధనలన్నీ క్షుణ్ణంగా, కడు జాగ్రత్తతో ప్రతిమాట విధిగా చదివి గ్రహించమని ప్రత్యేకంగా హెచ్చరిక యివ్వబడింది. ప్రతివారు తమ యిష్టాన్ని కేవలం "అవును" లేదా "కాదు" అని మాత్రం ఒక కాగితంపై వ్రాసి తమ సంతకం చేసి, దాన్ని స్వయంగా బాబాకు సమర్పించుకోమని తెలియపరచ బడింది.

సర్క్యులరు కాపీలు పంచుట పూర్తికాగానే, సమావేశపు హాలు తలుపులన్నీ తెరువబడ్డాయి. తేనీటి సేవనానికి విరామాన్ని ప్రకటించారు. విరామానంతరం మళ్ళీ అంతా హాల్లో సమావేశమైనారు. అందరూ తమ తమ అభిప్రాయాల్ని తెలుపుతూ వ్రాసి బాబాకు సమర్పించుకున్నారు. అప్పుడు బాబా వారిని మూడు బృందాలుగా కూర్చోపెట్టారు. అవునన్నవారి బృందం ఒకటి ఏర్పాటు వాల్లాల బృంద మొకటి. కాదన్నవారి బృందం ఒకటి.

సరోష్ యిరానీ, మెహెర్జి కార్కారియా, నారిమన్ దాదాచాన్జీ రష్మూలు ఏర్పాటు వాల్లాలు. బాబా ఆమోదించిన ఏర్పాట్లు పూర్తిచేయుట వారి విధి. వీరిది మొదటి బృందం. రెండవ బృందం: కాదన్నవారి బృందం. వారి కిచ్చిన సర్క్యులరుపై, "కాదు" అని వ్రాసిచ్చినవారు వీరంతా. పాద్రి, దేశ్‌ముఖ్, గాడేకర్ తదితరులు యీ బృందంలోవున్నా

ప్రముఖులు. బహుకాలం నుండి తనకు సన్నిహితంగా మెలగిన మండలి సభ్యుడు పాద్రి. కాదన్న బృందంలో వుండుట బాబాకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

అయినప్పటికీ అతని నిర్ణయాన్ని బాబా యిలా సమర్థించారు. " పెండూ, పాద్రి, ఆది, విష్ణూ యీ నలుగురూ మెహెరాబాద్ కు నాలుగు స్థంభాలవంటి వారు. అందులో ముగ్గురు నాతో నవజీవనం గడుపుటకు నిశ్చయించారు. ఒకవేళ యీ ముగ్గురుకూ అనుకోని ఆపద తటస్థపడితే కనీసం ఒక స్థంభమన్నా సురక్షితంగా వుంటుంది " అన్నారు.

వార్ధక్య కారణంతో బాబాను అనుసరించలేక, కాదన్నందుకు దుఃఖిస్తూ వ్యధ చెందుతున్న గాడేకర్, దేశ్ముఖ్ తదితరులను చూచి, " వారిని భగవంతు డెల్లప్పుడూ నా హృదయ మందుంచు గాక ! వారు నాకు సన్నిహితంగా వుంటూ నా ప్రేమికులగు గాక ! " అని ఆశీర్వదిస్తూ, కలతచెంద వద్దని ధైర్యం చెప్పారు.

అవునన్న బృందంలో జాల్ కేరావాలా ఒకరు. యీయన విషయంలో ఒక ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. బాబా యొక్క ప్రధమ ఆజ్ఞ ప్రకారం యీయన ఏర్పాటువాలాగా నిర్ణయించబడ్డాడు. అయితే అందుకు భిన్నంగా యితనిని అవునన్న బృందంలో చేర్చి, తన ఉన్నత ప్రభుత్వ పదవిని వెంటనే త్యజించి, ప్రాపంచక బంధాలన్నిటినీ వదలివేసి, తన ననుసరించుటకు రమ్మనమని ఆజ్ఞాపించబడగా ఏమాత్రం సంకోచించక, అలాగే నడుచుకున్న త్యాగశీలి. అతని ధైర్యానికి, విధేయతకు బాబా ఎంతగానో మెచ్చుకున్నారు. అతనికున్న ప్రేమ ఫలితంగా, అతని విషయంలో ప్రత్యేక సదుపాయంగా తన నిర్ణయాన్ని విరమించుకో మన్నారు. తిరిగి తన ఉద్యోగాన్ని స్వీకరించి, ఏర్పాటు వాలాలకు సహాయ పడమని అనుమతిచ్చారు. జాల్ కేరా వాలాను తప్పిస్తే యిరువది యిద్దరు

అవునన్నవారు మిగిలారు. చివరకు యీ 22 మందిలోను ఆరుగురు మళ్ళీ విరమించబడ్డారు. పోతే 16 మంది మిగిలారు. వీరంతా బాబాతో నవజీవనం సాగించారు.

కరాచీ నుండి వచ్చిన మినూకరాస్, అహ్మద్‌నగర్ వాస్తవ్యుడు పండోబా అనే దేశ్‌ముఖ్, ఢిల్లీ నివాసి కంట్రోలర్ ఆఫ్ అకౌంట్స్ ఉద్యోగి కిషన్‌సింగ్, బొంబాయిలోని మెహెర్ మండల్ అధిపతి మానెక్ మెహెతా, బాబా పాత శిష్యులలో ఒకడైన చగ్గన్, కుర్ద్వాడి నివాసి బాలనాటు, యీ ఆరుగురు బాబా నవజీవనంలో అవునన్న బృందంవారైనప్పటికీ, చివరి క్షణంలో వదలివేయబడ్డారు.

## మినూకరాస్

నవజీవన ఆరంభంలో మినూకరాస్ బాబా నుండి అంతకముందెన్నడూ పొందని అతికష్టమైన ఆజ్ఞను అనుభవించవలసి వచ్చింది. మినూ బాబాతో నవజీవనం గడుపుటకు అనుమతించబడిన 22 లో ఒకడు. అయితే బాబా యిచ్చిన ఆజ్ఞ ఏమంటే. యీ నవజీవన కాలంలో మినూ బాబాను కన్నెత్తి చూడరాదు. ఒకవేళ అలా ఎక్కడైనా, ఎప్పుడైనా సరే బాబాను కన్నెత్తి చూచుట తటస్థపడితే, అతడు ఏవిధంగాను తన గురువు ఎడల అవిధేయుడైనట్లే నన్నారు. యింకే మన్నారు ? అతడు తన నామాన్ని వుచ్ఛరించరాదు. ఆయనతో మాట్లాడరాదు. కనీసం ఆయనవైపు కూడ చూడరాదు. ఎప్పుడైనా బాబా సమక్షంలో వుండుట తటస్థపడితే అతడు తక్షణమే ఆ స్థలం వదలి వెళ్ళాలి.

ఆజ్ఞ విన్న మినూ చలించిపోయాడు. యీ ఆజ్ఞను జవదాటక పరిపాలించగలనన్న నమ్మకం తనకు లేదని మొరపెట్టుకున్నాడు. ససేమిరా పాటించి తీరాలన్నారు బాబా. ఫలితంగా మినూ, ఆ ఆజ్ఞను ఉల్లంఘించక

పాటించినందున ఆ కాలంలో తనకు కలిగిన అనుభవాలు రెండింటిని యీా విధంగా చెప్పాడు.

అవునన్న బృందం నుండి విరమించబడిన వారిలో మినూ కరాస్ ఒకరు. తక్కిన 16 మందితో బాబా నవజీవనం గడుపుటకు ఆరంభించ బోతున్నారు. అంతకుముందు రోజున మినూ బాబాను అనుసరించే మిత్రులలో ఒకరైన డా. అబ్దుల్ ఘనీకి తన తాలూకు చొక్కా, బనీను, ఒక లాటీకర్ర వప్పగించి, తనవద్ద వుంచుకొనమని రహస్యంగా బ్రతిమలాడు కున్నాడు. తన వస్తువులు బాబా ననుసరించువారి వద్దవుంటే, తాను నవజీవన కాలంలో బాబాతో వున్నట్లుగా భావించుకోవచ్చునని అతని నమ్మిక.

మరునటిరోజు బాబా తనతో నవజీవనంలో అనుసరించుటకు అవునన్న శిష్యులందరిని చేర బిలిచి, అనుమతించబడిన మిత్రులకు కఠిన మైన ఆజ్ఞ నొకటి విశదీకరించారు. ఎట్టి పరిస్థితులలోను, అనుమతించ బడిన శిష్యులు, అనుమతించబడనివారి నుండి, ఏవిధమైన చొక్కాలు, టోపీలు, బనీనులు, చెప్పులువంటి వస్తువులు తీసుకురారాదని హెచ్చరించారు. బాబా హెచ్చరికలో చేతికర్ర లేనందున మినూ కొంత ఆనందపడ్డాడు.

అందుచేత మినూ డా. ఘనీ కిచ్చిన చొక్కా, బనీనులు తీసుకొని, బాబా నిషేధించిన వాటిలొ చేతికర్ర లేనందున కనీసం ఆ కర్రను మోయకలిగితే తనవెంట వుంచుకోమని బ్రతిమలాడాడు. డా. ఘనీ అందు కంగీకరించి, కొంతకాలంపాటు తనతోనే వుంచుకున్నాడు.

నవజీవనం కొంతకాలం గడిచింతర్వాత బాబా, బెల్గాంనుండి, బెనారస్ వెళుతూ బొంబాయిలో రైల్వేస్టేషన్ ప్లాటుఫారంపై అవునన్న బృందం వారిని కొందరిని తనను చూచుటకు అనుమతించారు. అయితే ఆ అవకాశం

మినూ కరాస్‌కు రాలేదు. యీ సందర్భంలోనే డా. ఘనీ తనవద్ద వున్న మినూ చేతికర్రను బాబాను చూడవచ్చిన అవునన్న బృందంలోని ఒకరికి యిచ్చివేశాడు. రైలు బయలుదేరే సమయమైంది. బాబా అందరికీ వీడ్కోలు చెప్పారు. గార్డు విజిలు వూదాడు. రైలు కదలుట మొదలిడింది. అంతలో హఠాత్తుగా బాబా కదులుతున్న రైలునుండి గభాల్న క్రిందికి దిగి, మినూ చేతికర్రను, ప్లాటుఫారంపై వున్న ప్రేమికుని నుండి వూడపెరికి, తీసుకొని, తృటిలో మళ్ళీ కదిలే రైలు నందుకున్నారు. నవజీవనం పూర్తగువరకు బాబా మరో చేతికర్ర వాడక, దీనినే విడవకండా వాడారు. బాబా తన ప్రేమికుల ఎడల ప్రదర్శించే ఆత్మీయతకు, హార్దిక దయా గుణానికి, యిది ఒక మచ్చు తునక.

రెండవ కథ విధేయతకు సంబంధించినది. చాలా నెలలు గడిచాయి నవజీవనం ప్రారంభించి. చాలామందిలాగే మినూ కూడ బాబా యొక్క సుందర రూపాన్ని ఒక్క క్షణమన్నా చూడలేనందుకు పరితపిస్తున్నాడు. బాబాతో వేరుపడి రెండో సంవత్సరం వచ్చింది. ఆనాడు మినూ ఏదో పనిమీద బొంబాయి వెళ్ళాడు. రైలుస్టేషను ప్రైపు వెళుతుండగా ప్లాటుఫారం మీద, ఒక మూల పురుష మండలితో బాబా సాక్షాత్కరించారు. మరుక్షణం లోనే బాబా ఆజ్ఞ జ్ఞాపకం వచ్చింది. వెంటనే దృష్టి మరల్చుకున్నాడు. తక్షణం ఆ చోటు వదలి దూరంగా వెళ్ళిపోయాడు. ఆ క్షణంలో అతని హృదయంలో చెలరేగిన జ్వాల ఏమని వర్ణించగలం ? అతడనుభవించిన వ్యథ ఊహాతీతం.

పట్టణంలో అతని పని పూర్తికానందున ఆ రాత్రికి వుండిపోవలసి వచ్చింది. తనకు తెలిసిన ఒక హోటలులో బసచేశాడు. హృదయంలో చెలరేగుతున్న దుఃఖాన్ని అదుపులో వుంచుకొని, బాబా నామాన్నిగానీ, రూపాన్నిగానీ తెలుపడు నవకాశం రానీయక, పెందరాళే పడుకున్నాడు.

అంతలో ఎవరో తన గది తలుపు తట్టి, " మెహెర్బాబా ఎక్కడ వున్నారో మీకు తెలుసా ? " అంటూ అడిగారు. " బాబా బొంబాయి వచ్చారని తనకు తెలిసిందని, ఆయన దర్శనం చేసుకోదలచినందున, ఎక్కడ వున్నారో చెప్పమని " అడిగాడు.

ఆయన ఎక్కడ వున్నదీ తనకు తెలియదని మినూ జవాబిచ్చాడు. ఆగంతుకుని పంపిన తదుపరి, మినూ పక్కపై పరుండి, నిద్ర కుపక్రమించినప్పటికీ నిద్ర రాకపోగా దుఃఖం పెల్లుబికింది. తెల్లవార్లూ ఏడ్చాడు. మరునాడు తన పని పూర్తగునంత వరకూ, ఆ దుఃఖాన్ని మరువలేకపోయాడు.

కొన్నాళ్ళయింతర్వాత ఆ రాత్రి జరిగిన అసలు విషయం శిష్యుల ద్వారా మినూ తెలుసుకున్నాడు. తానున్న హోటలు గది ప్రక్కనేవున్న వేరే గదిలో బాబా విడిది చేశారట. తెల్లవార్లూ తాను బాబా ప్రేమలో విలపించిన ఆ రాత్రి వారిరువురి గదులను వేరుచేసే గోడ మాత్రం అడ్డున్నది. బాబా ఏ కారణంచేత తా నా రాత్రి వుండుటకు మినూ వున్న హోటలునే ఎన్నుకున్నారో అతని గది ప్రక్కగదిలోనే విశ్రమించారో అనూహ్యం. మినూ విలపించిన సమయంలో బాబా ప్రక్కనేవున్న గదిలోనే వున్నారు. విశ్వాసానికి, విధేయతకు, ప్రేమకు యీ వుదంతం మరో ఉదాహరణ.

మినూ దీనిని గురించి యిలా చెప్పాడు. నవజీవనా నంతరం ప్రియతమ బాబా మినూను రమ్మని కబురంపారుట. మినూ వచ్చేసరికి బాబా వంటరిగా వున్నారు. మినూ వంక తీక్షణంగా చూచి, ఒక కాలును యూడించి విదిలించారు. మినూ వంకసౌంజ్ఞచేస్తూ మళ్ళీ రెండో కాలు కూడ యూడించారు. ఆ తరువాత " మినూ ! నేను నిన్ను వదిలించుకుండా

మనుకున్నాను. నేను నిన్ను తన్నేయాలని రెండుసార్లు ప్రయత్నించాను. నిన్ను కుదపాలని నిజంగా ప్రయత్నించాను. కానీ నిన్ను కుదపలేక పోయాను. ఎందుకో తెలుసునా ? మినూ ! నీవు భగవంతుని ఎడల అంత ప్రేమతో విధేయుడవై యున్నావు సుమా ! " అన్నారు.

అలా చెప్పుచూ, మినూను గాఢంగా కౌగలించుకొని ముద్దిడారు. తనకు వప్పగించిన పనిని నూటికి నూరుపాళ్ళు సకాలంలో సంతృప్తిగా నెరవేర్చినందుకు, మిక్కుటముగా సంతోషించిన బాబా, మినూకరాస్‌ను, నవజీవనంలో అనుసరించు అవుసరం లేకుండానే, అవునన్నవారి బృందంలో వుండిపోవునట్లు అనుమతించారు.

## పండోబా

అహ్మద్‌నగర్ నివాసి పండోబా అనే దేశ్‌ముఖ్ బాబా మండలితో మెహెరాబాద్ ఆశ్రమంలో 1926-27 ప్రాంతంలో వుండేవాడు. యితడు ముందుగా అవునని వ్రాసి యిచ్చినా, తరువాత బాబా చెంతకు వెళ్ళి కాదన్న వాళ్ళ లిష్టులో తన పేరు చేర్చుమని, తన వార్ధక్య కారణంచేత నవజీవనము యొక్క శ్రమకు తన శరీరం తట్టుకొన లేదేమోనని భయం వ్యక్తపరస్తూ ప్రాధేయపడ్డాడు.

ఇతని వయస్సును దృష్టిలో పెట్టుకొని, బాబా అతని కోరికను మన్నించారు. అయితే కొన్ని ప్రత్యేక ఆజ్ఞలు యిచ్చి, వాటిని యింటి వద్దనే వుండి పాటించమని బాబా ఆజ్ఞాపించారు. అతడు సంతోషంతో వాటిని పాటించుటకు అంగీకరించాడు.

## కిషన్ సింగ్

ఢిల్లీలో కంట్రోలర్ ఆఫ్ అక్కౌంట్సు కార్యాలయంలో ఉన్నతాధి కారిగా పనిచేసేవాడు కిషన్‌సింగ్. ఆయన చాలకాలం నుండి, శాశ్వతంగా

ఉద్యోగ విరమణతోపాటు సర్వమూ త్యజించి, బాబా చెంత వుండిపోవుటకు అనుమతి కోరుతూ వుండేవాడు. తన ఉద్యోగాన్ని, కుటుంబాన్ని సైతం త్యజించి, బాబా చెంతకు వచ్చుటకు ఆయన అనుమతి కొరకు నిరీక్షిస్తూ వుండేవాడు.

విషయం తెలిసిన ఆదిజీ 1949 జూన్‌లో కిషన్‌సింగ్‌కు ఒక జాబు వ్రాస్తూ, మెహెర్‌బాబా నుండి, ఖచ్చితమైన ఆజ్ఞలు వుంటేనే తప్ప, తన మాట ముల్లెతో మెహెరాబాద్ రావద్దని వ్రాశాడు. ఆగష్టు 31 న జరిగిన సమావేశానికి యితడు ఆహ్వానించబడ్డాడు. అందరూ యితడు నవజీవనంలో బాబాను అనుసరించుటకు అనుమతింపబడతా డనుకున్నారు. అయితే దైవం మరో విధంగా నిర్ణయించాడు.

అవునని వ్రాసిచ్చి, తర్వాత ఢిల్లీ తిరిగి వెళ్ళాడు. తనకు రావలసిన పెన్షన్ వగైరా లావాదేవీలు సక్రమంగా సకాలంలో పూర్తి చేయకపోతే దరిమిలా తన కుటుంబం ఇబ్బందులకు గురికావచ్చని, కంట్రోలర్ ఆఫ్ అకౌంట్స్‌తో తన కాగితములు వేగిరంగా పరిశీలించమని వత్తిడి చేశాడు.

అంతలో పై అధికారులు అతనిపై కొన్ని తప్పుడు కేసులు బనాయించి, విచారణ ప్రారంభించారు. ఖిన్నుడైన కిషన్‌సింగ్, వివరంతో బాబాకు వ్రాసుకున్నాడు. విషయం తెలిసిన బాబా ఆదితో కిషన్‌సింగ్‌కు తంతి పంపించారు. ప్రస్తుత పరిస్థితులలో నిన్ను నేను క్షమిస్తున్నాను. అవునన్న నీ వాగ్దానం నుండి నిన్ను విముక్తుడ్ని చేస్తున్నాను. నీవు ఖచ్చితంగా నీ యింటివద్దనే ఎప్పటివలె వుండిపొమ్మని కోరుతున్నాను. నాతో నీకున్న ఆధ్యాత్మిక సంబంధం యధాతధంగా యింతకుముందు వలెనే కొనసాగుతుంది" అని తెలియపరచారు.

బాబాతో నవజీవనం సాగించాలని ఉత్సాహపడ్డ కిషన్‌సింగ్‌కు యీ తంతి నిరుత్సాహం కలిగించింది. మరలా, ఆదికి తన గోడంతా

వ్రాసుకుంటే, అదీ ఓదారుస్తూ, "నిరుత్సాహపడకు-బాబా ఆజ్ఞ జవదాటనిది. అయితే నీ కోరికను ప్రియతముడు ఎప్పుడో ఒకప్పుడు తప్పక నెరవేరుస్తాడు" అని జాబు వ్రాశాడు. అలాగే 1953 లో డెహ్రాడూన్‌లో బాబా మండలితో కలసి సహజీవనం గడిపే అదృష్టం పొందాడు.

## మానెక్ మెహతా

మానెక్ మెహతా బాబా శిష్యులలో ఒకరు. యీయన బొంబాయిలో మెహెర్ మండల్ అనే ఒక సంస్థను నడుపుతూ వుండేవాడు. ఆ మండలి కాతడు అధిపతి. అతనికున్న కష్టాన్ని గుర్తించిన బాబా, మండల్‌తో తనకున్న వ్యక్తిగత కార్యకలాపాలన్నిటినీ వదులుకోమని సలహా చెప్పారు. తనతో నవజీవనంలో పాల్గొనాలంటే యిది చాల అవసరమని నొక్కి చెప్పారు.

అయితే దురదృష్టవశాత్తు మానెక్ మెహతా బాబా యిచ్చ ప్రకారం నడుచుకోలేకపోయాడు. మండల్‌తో తెగతెంపులు చేసుకోలేకపోయాడు. గురువు ప్రతిపాదిస్తే శిష్యుడు త్రోసిపుచ్చాడు. ఫలితంగా అవునన్న బృందం నుండి విరమించబడ్డాడు.

## చగన్

చగన్ బాబా పాత శిష్యులలో ఒకడు. యితడు ముందుగా అవునని వ్రాసి యిచ్చాడు. తరువాత బాబా చెంతకు వెళ్ళి ప్రస్తుతం తను వున్న పరిస్థితులబట్టి, తాను బాబాతో నవజీవనం గడుపుట సమంజసమేనా ? అని అడిగాడు. మరి బాబా ముందుగా యిచ్చిన సర్క్యులరు ప్రకారం అలా తమ నిర్ణయంపై పునరాలోచనచేసి, బాబానే సలహా అడుగుట నియమ విరుద్ధం కాగలదు.

చగన్ కోరిక విన్న బాబా చాల బాధపడ్డారు. అయితే దయగల తండ్రి కనుక అక్టోబరు 16 నుండి తన ననుసరించ నవుసరం లేదంటూ మరో మూడు ఆజ్ఞలు యిచ్చి పాటించమన్నారు. మొదటిది తనవద్ద వున్న సర్వాభరణములు అమ్మివేయాలి. అలా అమ్మగా వచ్చిన పైకాన్ని ఆశ్రమంలోవున్న మహ్మద్ మస్తును పోషించుటకు వినియోగించాలి. అతనికయ్యే అన్ని ఖర్చులు తానే భరించాలి.

రెండవ షరతు, తానెక్కడైనా సరే ఏదైనా ఉద్యోగం చూచుకొని, తన భుక్తికి సరిపడా సంపాదించాలి. అయితే అట్టి ఉద్యోగం తన ఊళ్ళోనో, అహ్మద్‌నగర్‌లోనో చేయాలి. అతనిది " ఖీ నగర్ " అని అహ్మద్‌నగర్‌కు 3 కిలోమీటర్ల దూరంలో వుంటుంది.

మూడవది 1949 డిసెంబరు 15 వ తేదీ నుండి ఒక సంవత్సరం పాటు, తనకు సరిపడిన ఆహారాన్ని యాచక వృత్తితో ముష్టెత్తి సంపాదించాలి,

ఈ పై మూడు షరతులు వినేసరికి పాపం చగన్, తానేల మనస్సు మార్చుకున్నానా అని చింతించాడు. అయితే ఏం లాభం ? బాణం విల్లంబు నుండి దూసుకుపోయింది. అంతా అయిపోయింది. యిప్పుడు ఆలోచించి మాత్రం ఏం లాభం ? బాబా ఆజ్ఞలను విధేయతతో పాటించుటే అతని విధి. తు. చ. తప్పక వాటిని పాటించాడు.

మూడవ ఆజ్ఞ అతని పాలిట యథార్థమగు అగ్నిపరీక్ష అయి కూర్చుంది. పువ్వులమ్మినచోట కట్టెలమ్మవలసి వచ్చినట్లు, స్వంత ఊళ్ళో, యిల్లు పొలం వుండి పరువు ప్రతిష్టలుండి, బాగా బ్రతికిన తాను, ఆ ఊళ్ళోనే భిక్షాటన చేయుట, నిజంగా అతనికి అగ్నిపరీక్షే. అహంకార నాశానికి దోహదంచేసే యీ కఠిన పరీక్షలో చగన్ నిలబడి నెగ్గాడు.

భిక్షాటనకై ముందుగానే బాబా నిర్ణయించిన తేదీ, తీరా ఆచరించ వలసి వచ్చేసరికి అది సరిగా అతని తండ్రి మరణించిన మరుసటి దినమైంది. ఆనాడు చుట్టాలు, పక్కాలు ఎందరో తన తండ్రి మరణించి నందున వచ్చి యింటినిండా వున్నారు. ఉదయాన్నే తండ్రి శవానికి అంత్యక్రియలు జరిపి, మరుభూమి నుండి తిరిగి యింటికొచ్చాడు చగన్. అప్పటికి భోజనం వేళయింది. బాబా ఆజ్ఞానుసారం ఆనాటినుండి తన ఆహారాన్ని బిచ్చమెత్తి సంపాదించాలి కనుక, జోలె చంకన వేసుకున్నాడు. అక్షయపాత్ర చేత ధరించాడు. భిక్షాటన గావించాడు.

హిందూ సాంప్రదాయం ప్రకారం, అంత్యక్రియలైంతర్వాత 14 రోజులు కర్మ కాండలు జరుపుతారు. ఆఖరి రెండు రోజులు, బంధు మిత్రులకు విందు భోజనం ఏర్పాటు చేస్తారు. అలాగే చగన్ యింట్లో విందు ఏర్పాట్లు చేసినప్పటికీ అతడు మాత్రం అందు పాల్గొనక తన ఆహారాన్ని భిక్షాటనతోనే సంపాదించుకున్నాడు.

బాబా ఆజ్ఞ కొరకు రోజుకు అయిదు యిళ్ళు చొప్పున ముష్టెత్తి భిక్షగా వారేమి పెడితే అదే తిని సంతృప్తి చెందాడు. తండ్రి దిన వారాలకు వచ్చిన బంధు మిత్రులు, గ్రామస్తులు అంతా తలో విధంగా యితనిని విమర్శించినా, చలించక, బాబా ఆజ్ఞను పాటించిన ధన్యజీవి. దరిమిలా, యీ విపరీత పరిస్థితులలో చగన్ చూపిన విధేయత గురించి విని, బాబా ఎంతో సంతోషించారు.

## బాలనాటు

ఆ ఏకైకునితో అనుసరించుటకు సర్వము పరిత్యజించిన వినయశీలి బాలనాటు. యీయన కుర్ద్వాడిలో ఒక పాఠశాలోపాధ్యాయుడు. బాబా ఆజ్ఞ మేరకు తన ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు. అప్పటికి ఒక

నెల రోజులుగా బాబా ఆజ్ఞతో మౌనాన్ని పాటిస్తున్నాడు. ఉద్యోగ విరమణకు కారణమేమిటో యిదమిద్ధంగా చెప్పలేదు. ప్రధానోపాధ్యాయుడు తన నిర్ణయాలను మరొక్కసారి పునరాలోచన చేసుకొనమని బలవంతం చేశాడు. త్వరపడి ఒక నిర్ణయానికి రావద్దన్నాడు.

అయితే తాను మరెట్టి తలంపుకు అవకాశ మీయని దృఢ నిర్ణయం పూనియున్నందువలన, ఎవరెన్ని చెప్పినా పెడచెవిని పెట్టాడు. ఎవరి మాటలు లెక్కచేయలేదు. మరి బాబా ననుసరించదలిచాననే నిర్ణయం కూడ ఎవరికి బహిర్గతపరచలేదు. కుటుంబంలోని ఏ ఒక్కరికైనా తన నిర్ణయం గురించి వెలువరించవచ్చుని బాబా ఆజ్ఞ వున్నప్పటికీ, తాను బ్రహ్మచారి అయినందువలన. తన కనిష్ట సోదరుడు ప్రభాకరుకు మాత్రం తన నిర్ణయాన్ని వెలువరించదలచాడు.

అతనితో కూడ, యీ విషయాన్ని అక్టోబరు 16 వ తేదీ లోపల ఎవరికి చెప్పనని మాట తీసుకున్న తర్వాత, మెహెరాబాదులో జరిగిన సమావేశం గురించి, తాను నిర్ణయించిన విషయం గురించి క్లుప్తంగా వివరించాడు. ముందుగా ప్రభాకర్ ఆశ్చర్య చకితుడైనప్పటికీ కుటుంబ బాధ్యతను పూర్తిగా వహించుటకు సంసిద్ధత తెలిపాడు. కురుద్వాడి సమీపంలోని చిన్న కుగ్రామంలో బాలనాటికో యిల్లు, కొద్ది పొలం వున్నాయి. షుగరు ఫ్యాక్టరీలో కొన్ని షేర్లున్నాయి. వాటన్నిటినీ చట్టం ప్రకారం సోదరుని పేర బదలాయిస్తూ దఖలు వ్రాసి యిచ్చాడు. తానేమి చేసినా భగవన్నిర్ణయంగా ఆయనపై అచంచల విశ్వాసంతో ఆయన యిచ్చు ప్రకారం చేస్తున్నట్లు భావించాడు.

ఏదో ఓ కంబళి మాత్రం తీసుకొని మెహెరాబాదు పయనమై రమ్మంటారని బాబా పిలుపు కొరకు ఎదురు చూస్తున్నాడు. అలాగే సెప్టెంబరు రెండవ వారంలో ఫలానా సామాన్లతో వెంటనే బయలుదేరి

రమ్మనమని బాబా నుండి జాబు రానే వచ్చింది. అందులో తను తెచ్చుకో వలసివున్న దుస్తుల రంగులు కూడ తెలుపబడ్డాయి. టూత్‌పేస్టు, షేవింగు సెట్టు, బూట్లు, చెప్పులు వగైరాలతోపాటు తెచ్చుకునే ట్రంకుపెట్టె సైజు గూడ నిర్దేశించబడింది. అక్టోబరు 5 నాటికి అహ్మద్‌నగర్ చేరవలసి వుంది. అయిదవ తేదీ ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాడు. బాబా ఆజ్ఞ ప్రకారం ఆనాడు మెహెరాబాదు చేరుకున్నాడు.

పైసా లేకుండా తన దగ్గరకు రావాలనేది బాబా ఆజ్ఞ. ఆ మేరకా అన్నట్లు, స్టేషను నుండి మెహెరాబాద్ ఆశ్రమానికి టాంగాపై వెళ్ళి జేబులోవున్న డబ్బంతా యిచ్చివేస్తే అది యివ్వవలసిన దానికి రెట్టింపు వున్నది. అంత పైకం చూచి టాంగావాలా కూడా ఆశ్చర్యపోయాడు. అయితే, బాబా యిచ్ఛ ప్రకారం బాలనాటు మాత్రం నిర్ధనుడై పోయాడు.

అవును గాళ్ళంతా సమావేశమైనారు. బాబా మరో ఆజ్ఞ ప్రకటించారు. "తన మరణానంతరం శరీరాన్ని మెహెరాబాద్ కొండపైకి తెచ్చి సమాధి చేయాలి. మెహెరా శరీర త్యాగానంతరం ఆ శరీరాన్ని మెహెరాబాద్ కొండపైకి తెచ్చి తన సమాధి ప్రక్కనే సమాధి చేయాలి. అవును గాళ్ళకు నిర్దేశించబడిన బాధ్యతలు, ఏమరుపాటుతో విధేయులై పాటించాలి" అని వివరించారు.

మరునాడు బాబా కాక్‌సాహెబ్‌తో కొన్ని గజల్స్ పాడించుకొని ఆనందించారు. తరువాత మండలి వారితో ఫ్రెంచి టెన్నిస్ గేము ఆడారు. బాలనాటు ప్రతిభతో ఆడాడు. బంతి విసరగానే బ్యాట్సుమన్ దానిని గురిచూసి కొట్టాలి. ఒక వర్గం బంతి ఆడితే రెండవ వర్గంవారు బ్యాటింగు చేస్తారు. బ్యాటింగు చేసేవాడు నిలబడిన చోటున కదలకండా బ్యాటును ఎటువైపుగానైనా త్రిప్పుతూ బంతిని తిప్పికొట్టాలి. బంతిని కొట్టలేనప్పుడు అది వచ్చి బ్యాట్సుమన్ మోకాళ్ళక్రింద ఎక్కడ తగిలినా

అవుటయినట్లే. బాబా యిలా ఎన్నో రకాల క్రొత్త తరహా గేములు ఆడించేవారు. ఆనాటి గేములో బాలనాటు చాకచక్యంతో ఆడి బంతిని త్రిప్పికొడుతూ బాగా ఆడాడు.

ఆట పూర్తయింతర్వాత బాబా బాలనాటును ప్రశంశిస్తూ, " నీ వీనాడు చాల బాగా ఆడావు. నీకు క్రికెట్టు ఆట వచ్చా ? " అన్నారు. హైస్కూలులో చదివే రోజులలో ఆడేవాడిని. కానీ దరిమిలా మానివేశానన్నాడు. ఎందువలన మానావన్నారు. కాలేజీలో చదివే రోజులలో క్షయ వ్యాధి అంకురించి, ఊపిరితిత్తులు దెబ్బతిన్నవని అందువలన అలసటచెందే ఆటలన్నీ మానివేశానని చెప్పాడు.

తరవాత బాబా మళ్ళీ బాలనాటుని అడిగారు. " అయితే నీవు రోజుకు 15, 20 మైళ్ళు దూరం నడవగలవా ? ". " నా శాయశక్తులా ప్రయత్నిస్తాను ". బాబా అప్పుడు " అక్టోబరు 8 న మెహెరాజాద్ రా. పేదల కానాడు అన్నదానం, వస్త్రదానంచేసే కార్యక్రమం వున్నది. నీ కే పని వప్పగించబడినా హృదయ పూర్తిగా ఆచరించుము. అప్పుడు నీకు నేనో విషయం చెప్పదలచాను " అన్నారు.

బాబా ఆజ్ఞ మేరకు బాలనాటు మెహెరాజాదు వెళ్ళాడు. పొరుగు గ్రామాలనుండి అసంఖ్యాకంగా ఎందరో పేదలు వచ్చి బారులు తీరారు. బాలనాటు బాబా ఆజ్ఞ మేరకు బారులు తీరిన పేదలను ఒక్కొక్కరినే బాబా చెంతకు పంపుటకు మండలికి సహాయపడుతున్నాడు. ప్రతివారికి బాబా కాళ్ళు కడిగి, కొంత పైకం, అన్నంమూట యిస్తున్నారు. అందరూ అయిపోయింతర్వాత, బాలనాటు బాబా గదిలోకి ఆహ్వానింపబడ్డాడు. ఆ సమయంలో బాబా చెంత డా. డాన్‌కిన్, డా. నీలూలు నిలబడి వున్నారు.

బాలనాటు లోనికి పోగానే చిక్కినట్లున్న యీయనను, చెంతనున్న యిద్దరు డాక్టర్లకు చూపించి, యితడు నవజీవనంలో ఎదుర్కొనే కష్టాలను

భరించగలదేమో పరీక్షించి చెప్పమన్నాడు బాబా. ప్రక్క ఎముకలను, గుండెను యింకా అనేక శరీర భాగాల్ని యిరువురు డాక్టర్లు క్షుణ్ణంగా పరీక్షించారు. వైద్యశాస్త్ర పరమైన భాషలో యిద్దరు దీర్ఘంగా చర్చించుకొని, బాబాకు ఏదో చెప్పారు. వెంటనే బాబా బయట నిరీక్షిస్తున్న సావన్ కొత్వాల్ అనే ఆయనను పిలచి, బాలనాటును తన జీపులో ఎక్కించుకొని, అహ్మద్‌నగర్‌లోని ఆదీగారి ఆఫీసులో దింపమన్నారు. మరునాటి ఉదయం 9 గంటలకు ఆదీగారి ఆఫీసులో వుండమని, తాను స్వయంగా వచ్చి అక్కడ కలుస్తానని చెప్పి పంపించారు.

ఆదీగారి ఆఫీసులో రంజూ వెంటరాగా బాబా సరిగా 9 గంటలకు చేరారు. బాలనాటును ఏమీ అడగకుండానే, నవజీవన నియమాలున్న సర్క్యులరు కాపీ బాలనాటుకు రంజూ ద్వారా చూపించి యిలా సౌంజ్ఞలు చేశారు. " బాలనాటు నాతో నవజీవనము ఆసాంతం వుంటాడు. అయితే అతని వలన ఏలాంటి తప్పు లేకండానే, నా యిచ్ఛ ప్రకారం, నా యొక్క నవజీవన కాలంలో నాతో భౌతికంగా వుండనవుసరం లేకండా విముక్తి పరుస్తున్నాను. కనుక యిప్పుడు మీ ఊరు తిరిగి వెళ్ళుము. యింతకు ముందు నీవు గడిపిన రీతిలోనే నీ జీవితము కొనసాగించుము. నీవు నీ ఉద్యోగం వదులుకున్నావని నాకు తెలుసుమ. కనుక, నీ కవుసరమైన పైకం నేను సమకూరుస్తాను. " అన్నారు.

వెంటనే బాలనాటు, " బాబా ! నీ కృప వుంటే నే నెవరి సహాయం అర్థించకండా. జీవితం కొనసాగించగలను " అన్నాడు. అందుకు బాబా సంతోషించి మరో ఆదేశం జారీ చేశారు. " ఎట్టి పరిస్థితులలోను కామవాంఛతో స్త్రీ స్పర్శ చేయరాదు " అన్నారు. అత్యంత వినయంతో వినమ్రుడై " సరే " అన్నాడు. బాబా అప్పుడు బాలనాటుకు పది రూపాయలు యిప్పించి, టాంగా చేసుకొని మెహెరాబాద్ వెళ్ళి భోజనం

చేసి, వెంటనే రైల్వేస్టేషనుకు చేరి రైలెక్కమన్నారు. ఆ విధంగా అవునుగాళ్ళ లిష్టునుండి బాలనాటు ఆరవవాడుగా విడువబడినాడు.

ఈ నవజీవన నిర్ణయం బాబా హఠాత్తుగా తీసుకున్నట్లు కనిపించినా, 1949 జనవరి తరువాత అనేక విధాలా బాబా చేసిన ప్రకటనలు గమనిస్తే, ఆయన ముందునుండే ఒక ఆలోచన కలిగివున్నట్లు విశదపడుతుంది.

1. 1949 అక్టోబరు నుండి నా జీవితం, నా ప్రేమికుల జీవితంలో ఒక క్రొత్త ఘట్టం ఆరంభం కానున్నది. అది నాకు " వనవాసం " వంటిది, నన్ననుసరించువారికి సన్యాసం కాగా తక్కినవారికి సత్యనాశం కాగలదు.

2. నాకు సంబంధించినదంటూ ఏదైనా సరే వుంటుందా ? పోతుందా ? అని ఆలోచించను.

3. 1949 లో రేపటి గురించి శ్రద్ధ వహించను.

4. యికనుండి ఏబది శాతం అన్ని ఖర్చులు తగ్గిస్తాను.

5. రానున్న నెలలో నూటికి తొంబదిమంది మండలి నన్ను వదల నున్నారు. పది శాతం మాత్రమే నాతో వుంటారు.

6. 1949 లో నాదంటూ ఏమి ఆస్థి మిగలదు.

7. మెహెరాబాదు కొండపైవున్న నా భావి సమాధి మాత్రమే నాకు సంబంధించింది.

యిలా ఎన్నో సూచనలు ముందుగా చేసినా నవజీవన ప్రకటన చేసిన తదుపరిగాని పై సూచనలను శిష్యులు గ్రహించలేకపోయారు. ఉన్న ఆస్థిపాస్తులన్నీ అమ్మేసి తనపై ఆధారపడినవారి సంక్షేమంకోసం వినియోగించాలన్న బాబా నిర్ణయం తెలిసి, బొంబాయి తదితరచోట్ల వున్న

బాబా ప్రేమికు లనేకులు, కటిక పేదలు సైతం, తమకున్న సర్వాభరణాలు, ఆఖరికి వారి ఆస్తులు సైతం అమ్మేసి. కొన్ని వేల రూపాయలు రొక్కం రూపంలో బాబాకు సమర్పించుకున్నారు. వారు ప్రేమతో సమర్పించుకొన్న ప్రతిదీ బాబా ముందు స్వీకరించి. తరువాత తన ప్రసాదంగా మరల ఎవరిది వారికి తిరిగి యిచ్చివేశారు.

తన ననుసరించే వారికి ముఖ్యంగా ఒక సూచన చేశారు. వారు మృతప్రాయులుగా మారాలన్నారు. మరణించినవారికి, భౌతిక బంధా లుండవు. ఎవరితోను, దేనితోను సంబంధం వుండదు. కోరికలసలే వుండవు. వారడిగే దుండదు, కోరే దుండదు. అలా వుండగలిగే వారే తనతో రావచ్చన్నారు.

## సేవా ధర్మ ప్రజ్ఞ

నవజీవనంలో జీవించుట అంటే, యీ ప్రపంచాన్ని విడనాడి, కాషాయవస్త్రాలు ధరించి, భిక్షుక వృత్తితో జీవించుట కానేకాదు. అతి సహజమైన జీవితం గడుపుటయే నవజీవనం. " మీరంతా ఎంతో సహజంగా వుండండి " అనేవారు శిష్యులతో బాబా. సహజమైన జీవనం నిష్కపటానికి పరిణామం. నిశ్చలత్వం, ప్రేమ దయలకు ప్రేరణ. మోసానికి, అహంకారానికి ఆ జీవనంలో చోటులేదు.

అందుకే బాబా స్వేచ్ఛను, ఆచరణలో యితరులపై బలవంతంగా రుద్దక, తాను గడపదలచిన జీవితంలో ఆదర్శప్రాయంగా ముందు తా నాచరించి, సహచరులు ఆచరించునట్లు అలవర్చారు. తాను కేవలం వారి మిత్రునివలె మాత్రమే మెలిగారు.

నవజీవనం అంటే, ప్రాపంచక వ్యవహారాలలో, తన విద్యుక్త ధర్మాల్ని విడనాడి, బాధ్యతలు విస్మరించుట కాదు. అది ఒక క్రమశిక్షణతో

కూడిన జీవితం. నిష్కపటమైన లక్షణం, ప్రేమ, విధేయతలు, నవజీవనానికి ముఖ్య లక్ష్యాలు. యివి తప్పక ఆచరించువారే ఆయన యిచ్ఛకు పాత్రులు కాగలరు.

ఇట్టి జీవనం గడుపుట అంటే, అట్టివారు బాబా ముందు ఎట్టి ఆలోచన చేయుటకు వెనుకాడరో అట్టి ఆలోచనలు కలిగి వున్నారన్న మాట. ఆయన సమక్షంలో ఏవైతే పలుకుటకు, ఆచరించుటకు వెనుకాడరో అట్టి పలుకులు, ఆచరణలు, ఆచరించువారు గడిపే జీవనం, ఆయనను ఆనందపరచును.

మనకు బాబా తన నవజీవనాని కనువగు శిక్షణ అందించారు. ఇప్పుడు బాబా తన శరీరాన్ని త్యజించినా ఆయన ఆయనగానే మిగిలారు. మనందరినీ ఆయన ప్రక్కనే వుంచి వెళ్ళారు. తన శరీరాన్ని వదిలి వెళ్ళేముందు ఆయన మన వైపునే వున్నారు. శరీరత్యాగం తదుపరి కూడ ఆయన మన ప్రక్కనే వున్నారు. అయితే యిప్పుడు ఆయన ప్రక్కన వుండుట మన వంతైనది. ఆయన పరోక్షంలో, ఆయన యొక్క సమక్షం మన చుట్టూ పరివేష్టించి వున్నదని, బాబా నవజీవన సంఘటనలు ఆసాంతం గ్రహించిన తరువాత మనం గుర్తుంచుకోవాలి.

ఒకసారి బాబాతో ముగ్గురు వ్యక్తులున్నారు. అందులో విష్ణు మాష్టరు ఒకరు. బాబా ఆ ముగ్గురిలో ప్రతి ఒక్కరినీ "వారికి సన్నిహితులైనవారి మరణవార్త తెలిస్తే మదన పడెదరా?" అని అడిగారు. అలా అడిగిన వారిలో విష్ణు మూడవవారు.

అందుకు విష్ణు "లేదు బాబా! నేనేమి బాధ చెందను" అన్నాడు. తరువాత, సంభాషణలో మెల్లగా విష్ణు తల్లి మరణించినట్లు తెలిపారు. అదీ బాబా విధానం. జీవితంలో ఎదురయ్యే విషాద సంఘటనలు ఎదుర్కొన

వలసి వచ్చినప్పుడు, అలా ఊరట కలిగించే విధానంలో బాబా అతి నేర్పుగా ప్రవర్తించేవారు.

ముఖ్యంగా నవజీవనంలో యిచ్చిన శిక్షణా విధానమదే. బెత్తం పుచ్చుకొని పాఠాలు నేర్పినట్లు కాక, సౌమ్యంగా, ఎంతో సరళ భావంతో, ప్రేమ మార్గంలో సత్యాన్ని ఎరుక పరచుట, నవజీవనంలో ప్రధానం. మనస్సుకు బోధలుచేసి నేర్పుట కాదు. నిర్మొహమాటంగా అభిప్రాయాలను వ్యక్తపరచుట అసలే కాదు.

ఆయన ఎప్పుడూ హృదయంతోనే పనిచేసేవారు. మన హృదయాల ద్వారానే మనలను చేరేవారు. యీ సందర్భంలో నాకో చక్కని సంఘటన జ్ఞప్తికి వచ్చింది.

బాబా భక్తుడొక రుండేవారు. ఆయన కుమారుడో రేడియో ఇంజనీరు. ఓడలపై ఉద్యోగం చేస్తున్నాడు. అతడికి, మూడేళ్ళకోసారి మాత్రం, ఇంటికి వచ్చి వెళ్ళేందుకు సెలవు దొరికేది. అలా కొన్ని సంవత్సరాలు కాలగర్భంలో కలిసిపోతున్నాయి. అయితే అతని తల్లి మాత్రం, కొడుకు గురించి ఎప్పుడూ ఆందోళన పడేది. ఒకవేళ ఓడ కేదైనా ప్రమాదంవస్తే తన కుమారునికి ప్రాణాపాయం రావచ్చని ఆమె భయం.

ఒకరోజున బాబా, తన చుట్టూ శిష్యులు, ప్రేమికులు పరివేష్టించి వుండగా వారిలో యితని తల్లి కూడా వున్నది. వారి నుద్దేశించి, బాబా " ఈ జీవిత మెటువంటి ఆట వంటిది ? మనమంతా పుడుతూ వుంటాం. మరణిస్తూ వుంటాం. అయినప్పటికీ మరణ ఘడియలు తెలియనంత వరకూ మనము దానిని గురించి ఆలోచించం. అయితే మనకు కావలసిన వారెవరైనా మరణించినట్లు వార్త విన్నప్పుడే, మనం దాని ప్రభావంలో పడుతున్నాం. "

అని యిలా చెపుతూ రేడియో యింజనీరు తల్లివైపు చూపుడువ్రేలు చూపుతూ " నీ కుమారు డిప్పుడు సముద్రంపై ఓడలో యింజనీరుగా పనిచేస్తున్నాడు గదా! అయితే సర్వజ్ఞుడనైన నేను, నీ కుమారుడు మరణించెనని తెలుసుకుంటి ననుకొనుము. అతడు మరణించెనని కాదు. యదార్థమున కాతడు సజీవుడే! ( ఆత్మకు మరణము లేదు కదా! యదార్థ మరణము దైవంలో లీనమైనప్పుడే! ) "

" కానీ, ఒకవేళ మరణించినచో " అంటూ బాబా, ఆమెకు చెప్పబోవు సన్నివేశము విని ఆ తల్లి తల్లడిల్లిపోకుండా, గుండె నిబ్బరం చేయుటకు తయారు చేస్తున్నారు. మళ్ళీ చెబుతున్నారు.

" ఒకవేళ సర్వజ్ఞుడనైన నేను, నీ కుమారుడిక లేడని తెలుసుకొంటే, నీ కా విషయం చెప్పినప్పుడు, నీవు దానిని గురించి ఏమీ ఆలోచించక, ఊరుకోవాలి. ఇక్కడ సర్వమూ ఆనందదాయకమైనదే! నీవు సౌఖ్యము కొరకై యిక్కడకు వచ్చితివి. కనుక నీ కుమారుడు బాగుగనే వున్నట్లు చెప్పెదను. అప్పుడేమి జరుగును? ".

" ఇంతకు ముందు వలెనే నీవు యీ విశాల విశ్వంలో మామూలు జీవితం గడుపుట కొనసాగిస్తూ సినిమా హాళ్ళకు వెళ్ళి సినిమా చూచి ఆనందిస్తావు. ఆనందంగా రోజులు గడుపుతావు. నీవు నవ్వుతూ, యితరులను నవ్విస్తూ, ఆనంద పరుస్తావు. ఎందుచేత? నిజానికి నీ కుమారుడు మరణించినా, ఆ విషయం నీకు తెలియదు కనుక నీవు అలా సంచరిస్తావు. "

" అయితే ఆరునెలలు గడిచిన తర్వాత, నీ కుమారుడు మరణించినట్లు, అసలు వార్త తెలుసుకొంటి వనుకొనుము. అతడి మిత్రుడెవరో వచ్చి, నీ కుమారుని మరణవార్త నీ కెరిగించె ననుకొనుము. నిజానికి

ఆరునెలల క్రితమే, అతడు మరణించినప్పటికి, ఆ వార్త వినగానే, అప్పుడే మరణించినట్లు హృదయ విదారకంగా విచారిస్తావు. శోకంతో అశ్రుధారలు కారుస్తావు."

"అదంతా కేవలం మనస్సు యొక్క ఆట. మనస్సుకు ఎరుక పరచనంత వరకూ నీకు నీవు ఆనందంగా గడుపుతావు. ఏ విషయమూ పట్టించుకొనవు. అతడు మరణించెనో, జీవించియుండెనో నీవు పట్టించు కొనవు. అదే మాదిరి యీ జీవిత క్రీడ అంతా మాయ, మిధ్య, క్షణికం, అశాశ్వతం."

"కానీ దాని ప్రభావం వలన నీవు రోజు రోజుకు నీ మనస్సు చెప్పే దానిపై ఆధారపడి పోయెదవు." అంటూ ఆమెకు ఊరట కలిగించి, గుండె దిటవుచేసిన తరువాత అసలు విషయం మెల్లగా చెప్పారు. ప్రమాదవశాత్తు తన కుమారుడు మరణించెనని తెలిపారు.

మనం కేవలం మానవులం కావున అవతారుని లీలలు మనకు సుబోధకములు కావు. భోగమయ వాతావరణమున కలవాటు పడిన తన శిష్యులకు, సర్వసంగ రాహిత్యం కలిగించుటకై వారికి కఠోరమగు తపస్వి జీవనము అలవర్చుటకై బాబా నవజీవనం ఎంచుకున్నారు.

అది ఆచరణ రూపంలో తన శిష్యులకు అలవాటు చేయుటకై తన అద్వితీయ ఈశ్వరావస్థానం నుండి క్రింది స్థాయికి దిగి, మానవావ స్థానము నకు వచ్చి, భగవదన్వేషిగా, సఖునిగా వ్యవహరించెను. శిష్యులు యంత్రాలవలె తు. చ. తప్పక గుర్వాజ్ఞ పాలిస్తున్నప్పటికీ, తా నాశించిన, నిస్సహాయ, నిరాశామయ జీవన మలవడనందున, నవజీవన కాలంలో తా నాచరించి, మనకు చూపే కార్య విధానం స్వీకరించి, తద్వారా నియమబద్ధ జీవితమున కలవడునట్లు మేల్కొలుపు గావించారు. యిదే నవజీవనం.

# నియమోల్లంఘనకు శిక్ష

దైవం చేసే ముఖ్య కార్యక్రమం—నాటి నాటికి మానవుల మధ్య మానవుడుగా అవతరించి, మానవులలో మానవుడై కలసిపోవును. తాను మానవుడుగా మారినందున, మానవ స్వభావము ఆపాదించుకొనును. మానవాళి యొక్క బాధలు తాను పంచుకొని, తనపై పెంచుకొనిననే తప్ప, వారి బాధలను, పంచుకొనుటకు ఆయనకు అవకాశ ముండదు. అందు వలననే బాబా సాంగత్యంలో అనేక సంఘటనలు జరిగి, అవి మనలోని చైతన్యాన్ని మేల్కొలప కలిగాయి.

అది బాబా నవజీవన ఘట్టంలో ఆఖరి మజలీ. ఆఖరిరోజు కూడ. నవజీవన కాలంలో అనేక ప్రదేశాలు తిరిగి, తన అంతరంగిక శిష్యులతో బాబా మెహెరాబాద్ తిరిగి వస్తున్నారు. మెహెరాబాద్ ఇంకా 15 మైళ్ళ దూరం వున్నది. మార్గ మధ్యంలో బాబా యధావిధిగా ప్రజా దర్శన కార్యక్రమములు, మస్తులు, పిచ్చివారు, పేదవారు, కుష్టురోగులు, మున్నగు వివిధ తరగతుల ప్రజలను కలుసుకొనుటచేత ఆ రోజెంతో అలసినట్లున్నారు. సాయం సమయమైనది.

పొద్దుగ్రుంకుటచేత, ఎక్కడైనా విశ్రాంతి తీసుకున్న బాగుంటుందని అనుకున్నారు. యింతలో రాత్రి గం. 8-30 ని॥లకు యిమామ్‌పూర్ అనే ఊరు వచ్చినది. బాబా యీరుచ్‌ని పిలిచి, "దూరాన, ఏదో ఇల్లు కనపడుతున్నది. మనమీ రాత్రికి, అందు విశ్రమింతమని" చెప్పిరి.

శిష్యులు దానిని, సమీపించుసరికి, అది పూర్వ కాలంలో బ్రిటిషు ప్రభుత్వ పాలనా సమయంలో అధికారుల విశ్రాంతి మందిరమని గుర్తించారు. ఈరుచ్ దానిని గురించి వాకబు చేశాడు.

స్వాతంత్ర్యానంతరం, ఆ పరిసర మహమ్మదీయులు ఈ విశ్రాంతి గృహమును, తమకు మసీదుగా వాడుకొనుటకు యివ్వమని కోరగా, ప్రభుత్వమందు కంగీకరించి, వారికి వప్పగించెను. అయితే వారు సరియగు పరిశుభ్రత పాటించక దానిని, సక్రమ స్థితిలో వుంచలేదు. ధూళి దూసరితమై వున్నది.

ఆనాడు బాబా తన మండలితో ఆ మసీదునందు ప్రవేశించుసరికి, అది దుమ్ముతో నిండి వున్నది. ఈరుచ్ అంతర్భాగాన్ని ఊడ్చి, శుభ్ర పరచి, బాబా విశ్రాంతి తీసుకొనుటకై వాసయోగ్యము చేసెను. అలవాటు ప్రకారం బాబాకు భోజనపు ఏర్పాట్లు చేయబడెను. బాబా ఆహారం సేవించిన తరువాత, శిష్యులను చేరబిలిచి, వంతులవారీ కార్యక్రమం వివరించి, తక్కిన వారిని దూరంగా పోయి ఆరుబయట విశ్రాంతి తీసుకొన మని ఆజ్ఞాపించిరి.

బాబా విశ్రాంతికై, మసీదు అంతర్భాగంలో వుండిపోయారు. ఆ వెంటనే ఈరుచ్ తలుపులువేసి, వాకెటిముందు కావలి వుండెను. తక్కిన శిష్యులు, మసీదు వెలుపలి భాగంలో విశ్రమించారు. కొంత రాత్రి గడిచింది.

ఇంతలో బాబా చప్పట్లు చరిచారు. ఆ శబ్దం విన్నవెంటనే ఈరుచ్ తలుపులు తీసుకొని, లోనికి వెళ్ళి బాబాతో ఎందుకు పిలిచారని అడిగెను. అది నిశిరాత్రి. లైట్లు లేవు. గాఢాంధకారంగా వున్నది. టార్చిలైటన్నా లేదు. అందువలన బాబా సౌంజ్ఞలు గుర్తించుటకు వీలుగా, తనవద్దనున్న అగ్గిపెట్టె తీసి, పుల్ల వెలిగించి, సౌంజ్ఞలలో బాబా యిచ్చు ఆజ్ఞలకై అతను ఎదురు చూచెను.

అంతట బాబా " నా ఏకాంతానికి భంగం కలిగిస్తూ, ఎవరో ఏదో శబ్దం చేస్తున్నారు. మండలివారు సమీపంలో పడుకున్నారా ? వారెవరైనా

గురకపెడుతున్నారేమో ? వెంటనే వాళ్ళను లేపి, దూరంగా పోయి పడుకోమని చెప్పు"మన్నారు.

వెంటనే ఈరుచ్, అలసటతో సొమ్మసిల్లి గాఢ నిద్రలో మునిగివున్న మండలి సభ్యుల్ని నిద్రలేపి, బాబా ఆజ్ఞ ఎరిగించి, బాబా గదికి దూరంగా పోయి నిదురించమని చెప్పి పంపి వైచెను. వంతులువారీ కాపలాకు, బైదుల్ గుస్తాద్‌జీ, పెండూలను నిర్ణయించినా వారి వంతు వచ్చువరకు వారిని కూడ దూరంగా పోయి వుండమన్నాడు. వారి వంతు సమయం కాగానే రమ్మన్నాడు. ఈరుచ్ మాత్రం బాబా గదివద్ద కావలి వున్నాడు.

మరికొంత సేపటికి, బాబా తిరిగి చప్పట్లు చరిచారు. ఈరుచ్ అగ్గిపుల్ల గీచి, బాబా గదిలోనికి వెళ్ళగా, గదిలో యింకా ఏదో రణగొణ ధ్వని వినపడుతున్నది చూడమన్నారు. సమీపంలో ఎవరూ లేరు. కానీ బాబా ధ్వనులు వినపడుతున్న వంటున్నారు. ఈరుచ్‌కి ఆశ్చర్యంగా వున్నది. కొంత తడవు గదిలోనే వుండి ఆ ధ్వని ఏమిటో గమనించ మన్నారు.

కొలది సేపట్లో ఏదో పక్షి రెక్కలు విసురుతున్న శబ్దం ఈరుచ్ చెవులలో పడింది. అదే విషయం బాబాతో చెప్పెను. " బాబా ఈ గదిలో ఏదో పక్షి గూడు వున్నట్లున్నది. అది పక్షి రెక్కల చప్పుడే. ఆ గూడు ఎక్కడ వున్నదో వెదకెదను. " అన్నాడు.

ఆ సమయంలో బాబా ఒక గొంగళీ నేలమీద పరచుకొని, మరొక గొంగళీ కప్పుకొని పడుకొని వున్నారు. నవజీవన కాలంలో, మిత్రు లందరికీ ఒక్కొక్కరికీ, ఒక్కో గొంగళీ ఇవ్వబడింది. బాబా తాను కూడా ఓ గొంగళీ వుంచుకున్నారు. బాబా తన గొంగళీ కప్పుకుంటారు గనుక, ఆయన పడుకునేందుకు అనువుగా, తన గొంగళీని పక్కగా వేశాడు ఈరుచ్.

ఆయన నేలపై పరుండుటవలన, తిరిగి ఏమి ఆజ్ఞలు జారీ చేస్తారో నని ఆయన సౌంజ్ఞల కొరకు ఈరుచ్ అగ్గిపుల్ల గీచాడు. అనవసర శబ్దాన్ని చేస్తూ, తనకు ఏకాంత భంగాన్ని కలుగజేసే ఆ పక్షిని పట్టి, బయట పారవేయమని బాబా ఆజ్ఞాపించారు.

వెంటనే మారు ఆలోచన చేయక, యీరుచ్, కారుచీకట్లలో తడుముకుంటూ, వెతుకుతూ గూటిని సమీపించి, పక్షిని పట్టి తీసి బయట పారవేయ బోతున్నాడు. సరిగా అదే సమయంలో, హఠాత్తుగా బాబా చప్పట్లు చరిచారు. బాబా చప్పట్లు వివిధ రకాలుగా వుంటయి. మామూలుగా రమ్మన్నప్పుడు ఒక రకంగా వుంటుంది. వెంటనే వున్నపళాన రమ్మన్నప్పుడు వేరే రకంగా వుంటుంది. క్షమించాల్లే పో అన్నప్పుడు మరో రకంగా వుంటుంది. యిలా అవుసరాన్నిబట్టి రకరకాల చప్పట్లు చేస్తారు.

ఇప్పుడు చేసిన శబ్దం, వున్నది వున్నట్లు వదలి వెంటనే రమ్మనమని ఆజ్ఞ. ఈరుచ్ ఆ సౌంజ్ఞ విని, పక్షిని గూట్లోనే వదలి, బాబా ఆజ్ఞలకై ఆయన చెంతకు వచ్చి నిలబడ్డాడు. అప్పుడు బాబా సౌంజ్ఞల ద్వారా చెప్తున్నారు—" ఆ పక్షిని దాని గూటిలోనే వదలుము. మన మిప్పుడు మహా ఘోరమగు తప్పిదము చేశాము. ఇటువంటి ఆజ్ఞ జారీచేయుట తన కెంత మాత్రం న్యాయ సమ్మతము కాదు " అన్నారు.

నవజీవనం ప్రారంభించుటకు ముందు యిచ్చిన నియమములలో, అతి ముఖ్య నియమము, " యితరులకు బాధలు కలుగచేయరాదు. " కోపము, దుష్ట స్వభావము కలిగిన ఆజ్ఞలు యిచ్చినప్పుడు, మండలివారు, బాబాకు నవజీవన నియమాలు జ్ఞప్తి చేయాలి. మరి యిప్పుడు బాబా అందుకు భిన్నమైన ఆజ్ఞ యిచ్చినప్పుడు, ఈరుచ్ ఎదుటనేవుండి కూడ, బాబాకు నియమోల్లంఘనము గూర్చి గుర్తుచేయలేదు.

ముఖ్యంగా అలా బాబాకు గుర్తుచేయవలసిన బాధ్యత, ఈరుచ్ పైన వుంచారు. కానీ, ఈరుచ్ తనకు పప్పగించిన బాధ్యతను మరచిపోయి, వుల్లంఘించెను. అదే విషయాన్ని బాబా ఈరుచ్‌కి గుర్తుచేశారు. బాబా నియమోల్లంఘనతో క్రూరమైన ఆజ్ఞలు యిచ్చినప్పుడు, అది పొరపాటని ఆయనకు గుర్తుచేయుట మరచి, ఈరుచ్ ఘోరమగు తప్పిదం చేశాడు.

ఈ సంఘటనంతా నిశరాత్రి జరిగింది. అప్పుడు బాబా ఈరుచ్‌తో " నవజీవన సమయంలో యిప్పుడు మనము ఘోరమగు తప్పిదం చేశాము. అందుకు తగు ప్రాయశ్చిత్తము జరగాలి. అందువలన రేపు ఉదయం యీ విషయమై నాకు గుర్తుచేయమ"ని చెప్పి, విశ్రాంతిలో వుండిపోయారు.

ఉషోదయమైంది. మండలి అంతా మేల్కొన్నారు. ఆరోజే వారంతా నవజీవన కాలం పూర్తిచేసుకొని, మెహెరాజాద్ చేరుకోవాలి. బాబా తన గదినుండి బయటకు వచ్చుసరికి, మండలి అంతా తయారై, బాబా సేవలో పాలుపంచుకొనుటకు సిద్ధంగా వుండాలి. ఇది నిత్యం జరిగే అలవాటు. రాత్రంతా ఆయన కావలిలో నిమగ్నమైనవారు కూడ, ఎట్టి వివక్షతలేక అందరితోపాటు తయారుగా వుండవలసిందే!

ఆరోజు ఉదయం, ఇమాంపూరులో ఉదయాన్నే శిష్యులంతా మేల్కొంచి, చన్నీరు స్నానమాచరించి, అగ్రజుని దర్శన భాగ్యమునకై ఎదురు చూస్తున్నారు. బాబా సేవ అంటే కొంచెము వివరణ యిస్తాను.

మామూలుగా తనను సేవించుకొనే అవకాశం ప్రతి శిష్యునికి కల్పిస్తారు. ముఖ ప్రక్షాళన, అభ్యంగనము మున్నగు వాటిలో సహాయ పడుటలో శిష్యులకు అవకాశమిచ్చేవారు. వారు తమ చేతులలో నీరు పోస్తే ఆయన ముఖం కడుగుకుంటారు. తదుపరి సబ్బు సిద్ధంగా వుంచుకొని, శిష్యులు తమ చేతులనిండా నురగతీసి ఆయన ముఖంపై

రుద్దాలి. తిరిగి ఆయన చేతులలో నీరు పోస్తే తన ముఖం నీటితో శుభ్రపరచుకొనేవారు. తరువాత టవలుతో ముఖం అద్దాలి.

ఇవన్నీ చూచుటకు చాల స్వల్పవిషయాలే ! ఆయన అట్టి పనిని తానే స్వయంగా చేసుకొనగలిగి వున్నప్పటికీ, కావాలనే, తనను సేవించుకొనే అవకాశాన్ని యీ రూపంలో యితరులకు యిచ్చేవారు. న్యాయానికి యింత స్వల్ప విషయాలు యితరులచేత చేయించుకొనుట ఆయనకు కూడ బాధాకరమే కదా !

అయిననూ ఆయన అనంతమైన ప్రియతముడు కావున, వాటన్నిటినీ తాను భరించి, తన సేవా కార్యములో ఇతరులకు అవకాశము కల్పించేవారు. తనకు సహాయపడునట్లు ఇతరులకు అవకాశము కల్పించి, ఆ పని చేయుటలో, మనము అవతారునికి సేవ చేయుచున్నాము అనే భావన కలిగించేవారు.

మరి ఆనాటి ఉదయం బాబా తన గదినుండి బయటకు రాగానే ఈరుచ్ బాబాకు ముఖ ప్రక్షాళన సేవ చేశాడు. అది కాగానే, ఆనాటి రాత్రి తన కావలిలోవున్న తక్కిన ముగ్గురిని పిలవమన్నారు.

బాబా ఆజ్ఞ మేరకు, తక్కిన ముగ్గురు, బైదుల్, పెండూ, గుస్తాద్‌జీలను పిలుచుకు వచ్చాడు. వారు రాగానే బాబా రాత్రి జరిగిన కథంతా వారితో ఈరుచ్‌ని చెప్పమన్నారు. జరిగిన విషయమంతా ఈరుచ్ యధాతధంగా వారితో చెప్పాడు.

అంత బాబా కల్పించుకొని " ఇదంతా ఈరుచ్ చేసిన ఘోరమైన తప్పు " అని సౌంజ్ఞ చేశారు. ఇతరులకు హాని కలిగించే ఏ ఆజ్ఞ యిచ్చినా, ఆ విషయం బాబాకు గుర్తుచేయవలసిన బాధ్యత ఈరుచ్‌ది.

పాప మా పక్షి రాత్రివేళ తన చిన్నారి పిల్లలతో తన గూటిలో విశ్రమించియున్నది. అది కొంత ధ్వని చేసినది. అంతమాత్రం చేత దాని తప్పేమిటి ? అంత చిన్న తప్పుకే బాబా ఆ నోరులేని పక్షి ఎడల అంత క్రూరంగా ఎందుకు ప్రవర్తించారు ? ముఖ్యంగా యీ విషయాన్ని ఈరుచ్ అప్పుడే గుర్తుచేసి వుండవలసింది. కానీ అతడు నియమాన్ని మరచాడు. ఫలితంగా, బాబా ఆ పక్షిని లాగి, బయట పారవేయమన్నారు. నవజీవన కాలంలో యిది ఘోరమగు అపరాధ సంఘటన.

యిప్పుడు బాబా తక్కిన శిష్యులతో యిలా చెప్పారు. " సమయానికి నేను కల్పించుకొని, ఆ పక్షిని పారవేయక వున్నపళాన వదలి రమ్మనమని పిలిచాను. అందుకు కారణం, అతడు అసలు నియమాన్ని మరచెనని నాకు తెలుసును. దీని కంతకూ మూలకారణం నేనే ! ఈ తప్పుకు తగిన శిక్ష జరగాలి. దీని కంతకూ నేనే కారకుడను గావున, మీ నలుగురూ మీ కాలి చెప్పులు తీసి, వాటితో బలం కొలదీ నా వీపుపై బాదుడు " అని ఆజ్ఞాపించెను.

చెప్పులతో బాదమని ఆయన ఆజ్ఞ. కానీ వారు, సున్నితంగా, తమ చెప్పులు ఆయన వీపుపై ఆనించారు. అది ఆయన ఆజ్ఞ కావున పాటించాలి. కానీ శరీరం తాకునట్లు ఆనించి తీసినందున, ఉగ్రులై " నా ఆజ్ఞను తు. చ. తప్పక అతి సహజంగా పాటించి తీరాలని " మందలించారు.

ఆయనకు నటన పనికిరాదు. బిడియ మసలే లేదు. తనను కొట్టమనినప్పుడు ఎలా కొట్టవలయునో మరల వివరించారు. " నీకు కోపం వచ్చినప్పుడు, ఎదుటివారిని నీ బూటికాలితో ఎంత బలంగా తన్నెదవో, అంత బలంగా తమ చెప్పులతో బాదమ"ని ఆదేశించారు.

గత్యంతరములేక, నిజమైన శిష్యులుగా గుర్వాజ్ఞను పాటించి, నలుగురు శిష్యులూ, ఆయన వీపుపై దబదబా బాదారు. మరి అంతటితో

ఆగలేదు. తిరిగి ఆ నలుగురిని, తనపై కాండ్రించి వుమ్మియమని ఆదేశించారు. వారంతా అలా చేసిన తరువాత, అంతటితో ప్రాయశ్చిత్త కార్యక్రమం సమాప్తమైనది.

ఈ సంఘటన వెనుక దాగివున్న సత్యాన్ని గురించి ఈరుచ్ యీ విధంగా వివరించాడు. " ఇది పొరపాటు కాదు. ఒక అవకాశము మాత్రమే. బాబా తన శరీరంపై కల్పించుకొనే ప్రతి సంఘటనా, మానవాళికిచ్చే మహోపకారం. అది మన కొరకు అపూర్వ అవకాశం. ఈ పుడమిపై సంచరించే పిపీలకాది పర్యంతం ప్రతి జీవి, ఎలా సంచరించాలో నిరూపించే సంఘటన యిది " అంటాడు.

యిక్కడ ముఖ్యంగా గమనించవలసిన ప్రధాన అంశము, తన శిష్యులకు గీతాజీవన మలవడుటకుగాను, కఠోరమగు నవజీవనం దాదాపు రెండు సంవత్సరములపాటు కొనసాగించి, ఎన్నెన్నో అనుభవ పూర్వక సంఘటనలతో కూడిన తర్ఫీదు నిచ్చి, అంతములో, ఆఖరి రోజున, ఆయనతో కలిపించబడిన అపూర్వ అవకాశమిది.

అంటే అంతటి అనుభవాన్ని వారు సంపాదించినప్పటికీ, వారిలో యింకనూ, గురువు ఎడల శిష్యుల కుండవలసిన ఏకాగ్రతలో కొరత వున్నందున, దానిని కూడ రూపుమాపి, వారిని పరిపూర్ణులుగా తీర్చిదిద్దుటకే బాబా యీ సంఘటన కల్పించినట్లు ద్యోతకమగు చున్నది.

మరో విధంగా ఆలోచించినచో, ఈరుచ్ ముందుగానే నవజీవన నియమోల్లంఘన గురించి గుర్తుచేసి యున్నచో దైవమానవున కే విధమగు అపచారం జరిగివుండెడిది కాదు. కనుక యిది నిర్లక్ష్య భావానికి నిరూపణ. అయితే బాబాయే ఈరుచ్‌ని అలా మరచునట్లుచేసి యీ సంఘటన కల్పించి యుండునని తలచవచ్చును. అతడు మరచిపోవునట్లు చేసి, యీ సంఘటన కల్పించి యుండవచ్చును.

అంతేకాదు. అకుంఠిత దీక్షతో శుశ్రూషచేసి, తమ సర్వస్వం, త్యాగ భావంతో బాబాకు అర్పించుకొని, నిరాశామయ నిస్సహాయ జీవనమున కలవడినప్పటికి, ప్రకృతి సహజమైన మనోప్రవృత్తి ఎంత బలీయమైనదో, దాని నరికట్టుటకు, ఎటువంటి క్రమశిక్షణాయుత తర్ఫీదు అవుసరమో, యీ సంఘటన వలన మనకు తేట తెల్లము కాగలదు. అది తెలియ చెప్పుటకే, నవజీవన కాలం ఆసాంతంలో జరిగిన సంఘటన ముందుగానే తెలియ పరచితిని.

# ఆజ్ఞాపాలన

బాబా 1949 అక్టోబరు 16 న ప్రారంభించిన నవజీవనం రెండు సంవత్సరములపాటు నిరాఘాటంగా కొనసాగింది. ఆ తదుపరి మరో ఆరు నెలలపాటు మనోనాశ్ ( అమనస్క యోగము ) కార్యక్రమము నెఱపిరి.

మత పరమైన సాంప్రదాయాలను, కర్మకాండలను ఆహూతి కావించి, మనస్సనే దుష్ట ప్రభువును. తన పరివారమగు కామక్రోధాది అరిషడ్వర్గము లతో భగవత్ప్రేమాగ్నిలో భస్మీపటలం కావించి. మనస్సుకు, అవ్యయము, అవిభాజ్యమునగు జ్ఞానానుభవము కలిగించుట, యీ మనోనాశ కార్యక్రమ విధానము.

మనోనాశమంటే, మనస్సును నాశనము చేయుట. అనగా మనస్సును క్షీణనముచేసి ఆత్మకు పరిపూర్ణత్వం కలిగించుట కాగలదు. అయితే నవజీవనము గురించిన విషయములలో చివర భాగంలో జరిగిన సంఘటనను యిక్కడ సందర్భవశాత్తు తీసుకొని తెలిపియున్నాను.

మరి యిప్పుడు ప్రారంభ దశకు వద్దాము. నవజీవనం ప్రారంభించిన తరువాత, అది ఎన్నటికీ పరిసమాప్తి కాదని, అది శాశ్వతమనే అభిప్రాయాన్ని

శిష్యులలో బాబా కలుగజేశారు. అందువలన వారు తమకున్న సర్వస్వం, యిళ్ళు వాకిళ్ళు, బంధు మిత్రులు, తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు సమస్తం పరిత్యజించవలసి వచ్చినది.

తమతో అనుబంధమున్న ప్రతిదానినీ మరచిపోమని బాబా ఆజ్ఞ. అంతేకాదు, నవజీవనం గడిపే శిష్యులు పూర్వ జీవనంలోని సహాధ్యాయులను చూచుటకు కూడ వీలులేదు. ఒకవేళ వారు తారసపడినా వారిని కన్నెత్తి చూడరాదు. పలుకరించరాదు. పూర్వ జీవన సహాధ్యాయులంటే, వారి బంధువులు, స్నేహితులు, యితర బాబా ప్రేమికులు. వీరెవరితోను పరిచయ ముండరాదు. వీరు యీ ప్రపంచాన్నే మరచిపోవాలి. అలా మరచి, బాబా సాంగత్యంలో ఆయన నుండి, నిస్సహాయతత్వం, నిరాశా స్థితిని మాత్రమే అపేక్షించాలి. మృతప్రాయులుగా మారాలి.

నవజీవన కాలంలో, తోటి స్నేహితులేమి చేస్తే తానునూ అదే చేసెదనని బాబా అన్నారు. అంటే ఉదాహరణకు, ప్రయాణంలో రాత్రి కేదైనా బస ఏర్పాటు చేసుకొని విశ్రమించవలసి వచ్చినప్పుడు, అక్కడ వున్న చెత్తా చెదారం శుభ్రంగా తుడిచి, బాబాయే స్వయంగా ఆ ప్రదేశాన్ని శుభ్రపరచేవారు.

వారంతా భిక్షాటనకై వెళ్ళు సమయంలో భుజించు ప్రదేశాన్ని శుభ్రపరచుటతోపాటు, వంట పాత్రలు వగైరా బాబా స్వయంగా కడిగి శుభ్రపరచేవారు. తాను భుజించిన పళ్ళాన్ని తానే స్వయంగా కడిగేవారు.

సాధారణంగా శిష్యులు బాబాను ఏ పనీ చేయనిచ్చేవారు కారు. కరుణామయుడుగా, ఆయనే, తన సేవా కార్యక్రమంలో భాగం పంచుకొనే అవకాశాన్ని వారికి కలిపించేవారు. కానీ నవజీవనంలో మాత్రం ఆయనను సేవించుకొనే అవకాశం వారికి యివ్వలేదు. తానొక సామాన్య మానవుడుగా, శిష్యులలో తా నొకడుగా, వారి హితుడుగా వారితో మెలగాలని ఆయన ఇచ్ఛ.

ఒకవేళ ఎవరైనా, "ఆనాటి నవజీవన కాలం మీ పాలిటి నరకమై యుండును కదా!" అని శిష్యులను ప్రశ్నిస్తే వారిచ్చే జవాబు ఒక్కటే. "ఆ కాలంలో బాబా దైవ మానవునిగా, సద్గురువుగా, లేదా ఒక ఋషిగా కనిపించనప్పటికీ కేవలం ఒక స్నేహితునిగా మాత్రమే మెలగినప్పటికీ, మే మెన్నడూ అలా భావించలేదు" అంటారు.

ఆయన సన్నిధానం అంతటి శక్తివంతమైనది. వారి నెన్నడూ వంచించలేదు. నిజాని కది ఆనందమయ స్వాస్త్య జీవనం. తామెన్ని శారీరక యిడుముల మధ్య వున్నప్పటికీ, వాటిని కష్టములుగా భావించక, శిష్యులు అత్యంత సంతోషంతో స్వీకరించి ఆచరించేవారు. బాబా వునికి అట్టి కష్టములనుండి మరపించేది.

## మానశిక సంక్షోభం

బాహ్యంగా చూచేవారికి, శిష్యులు, అధికతర శారీరక కష్టములు, అనుభవించుచున్నట్లు కనపడేది. శారీరక కష్టములున్నమాట యదార్థమే. కానీ వాటన్నిటికీ మించినది మనస్సునుండి వెలువడే మానశిక సంక్షోభం భరించుట ప్రధానం. అటువంటి సంక్షోభం శిష్య లంతకు ముందెన్నడూ చవిచూడలేదు. వారు కేవలం ఆయన ఆజ్ఞలకు బద్ధులై సంచరించేవారు. అందువలన వారికి మరో ఆలోచన వచ్చేది కాదు.

బాబా యిచ్చిన ఆజ్ఞలలో ముఖ్యమైనది వారెన్నడూ, మనోభావాలను వ్యక్తీకరించరాదు. బాబా తర్ఫీదులో కొన్నాళ్ళు గడిచే సరికి, అసలు అలాంటి మనోభావాలు వారికి కలిగేవే కావు. అనుక్షణం ఏ యితర విషయములపైనా మనసు పోనీయక, కేవలం బాబాకు సంబంధించిన విషయములపైననే లగ్నముంచి, ఆయన యందే నిమగ్నమై వుండేవారు.

నిజానికి వారి ప్రపంచాన్ని పూర్తిగా మరచి, బంధ విముక్తులైనట్లు భావించేవారు. ఈనాడు తింటే రేపటికి తిరిగి భుక్తి దొరుకునో లేదో తెలిసేదికాదు. అయినప్పటికీ వారు దేనినీ ఖాతరు చేసేవారు కారు. ఎందువలన ? వారు నిస్సహాయ, నిరాశామయ జీవితాన్ని ప్రారంభించి యున్నారు. ఏది ఏమైనప్పటికీ వారట్టి జీవితాన్ని గడుపుటకే నిశ్చయించారు.

ఆచరణలో, ఎవరి మనోభావాల్ని బహిర్గత పరచరాదన్న బాబా ఆజ్ఞ అతి కష్టమైనది. ఒకరి మనస్సులోని భావాలను వ్యక్తపరచక అణచిపెట్టుట అంత సులభం కాదు. సాధారణంగా, మనోభావాలు బాహ్యా ప్రపంచపు మానసిక ఆందోళనలు, భేదాభిప్రాయాలు, తదితరములు వలన కలుగుచుండును. తమతో సన్నిహితంగా వుండే సహచరులతో, ఏదో ఒక సమయంలో ఏదేని విషయంపై భేదాభిప్రాయం రావచ్చును.

అందునా, శిష్యులు పెద్ద సంఖ్యలో వుండి. ఒకరి కొకరు కఠోర నియమాలు పాటిస్తూ సామూహిక జీవనం సాగిస్తున్నారు. అందువలన తప్పనిసరిగా, ఏదో ఒక సందర్భంలో, క్రోధమో, దుఃఖమో, కష్టమో అనుభవించి వుండాలి. అలా జరుగుటకు అవకాశము లేకపోలేదు.

కానీ బాబా ఆజ్ఞ ఏమంటే, ఒకవేళ తమలో ఎవరికైనా మరొకరిపై కోపం వచ్చినప్పటికీ, అట్టి కోపాన్ని బాబా ముందు ప్రదర్శించరాదు. కనుక ఏదేని సన్నివేశంలో మనోభావాలు మారినప్పటికీ, అవన్నీ ఆయన సమక్షంలో మరిచేవారు. అనగా తమలో అణచిపెట్టుకొనుట కాదు సుమా ! ఆయన రూప సందర్శనంతో అవి మటుమాయ మయ్యేవి. అయితే యీ సందర్భంలో శిష్యులు పడిన యాతనలు, వాటిని బాబా ఎలా సర్దుబాటు చేశారో తెలుసుకుందాం. అవన్నీ చాలా ఉత్సాహంగా వుంటయి.

# దౌలత్ సింగ్

బాబా ప్రేమికులలో వయోవృద్ధుడైన డాక్టరు ఒకరున్నారు. ఆయన పేరు డాక్టరు దౌలత్‌సింగ్. కాశ్మీరంలోని శ్రీనగరనే పట్టణంలో ఆయన చాలా పలుకుబడికల వ్యక్తి. ఆయన వైద్య వృత్తిలో ప్రవీణుడేకాక, శ్రీనగరు పట్టణ మేయరుగా కూడ పనిచేశాడు. స్వాతంత్ర్యానంతరము దేశ విభజన జరిగినది. అప్పుడాయన, సకుటుంబముగా కాశ్మీరం వదలి బెంగుళూరు చేరి శేషజీవితాన్ని గడిపాడు.

ఆయన బాబాకు అనుంగు శిష్యుడై ఆయన ఆజ్ఞలను శిరసావహించి పాటించిన త్యాగధనుడు. నవజీవనంలో బాబాను అనుసరించుటకు, నియమాలు పాటించుటకు అంగీకరించి అవునన్న వారిలో ఆయన కూడ ఒకరు.

అసలు యీ దౌలత్‌సింగు పూర్వ జీవనం గురించి, కొంత తెలుసుకుందాం. శ్రీనగరు నివాసి దౌలత్‌సింగు వైద్య విద్య నభ్యసించుటకై లండనువెళ్ళి చదువు పూర్తికాగానే, అక్కడే స్థిరపడి వైద్య వృత్తి ప్రారంభించాడు. అతనికి చిన్నతనం నుండి దైవ భక్తి మెండు.

ఒకరోజున, అతనికో కల వచ్చింది. అందు ఓ సాధు వేషధారి, తన గుమ్మం ముందు నిలిచి, భిక్ష నర్థించాడు. అంత దౌలత్‌సింగు ఆ సాధువుకు భిక్ష నొసగుటకు బయటకు రాగా, అతడొక చిత్తరువును ఆయన కందించి, "ఆ చిత్తరువులోని మూర్తి భారతదేశంలో వున్నాడు. నిన్నాయన చెంతకు రమ్మనమని ఆయన పిలుపు" అని చెప్పి అదృశ్యమైనాడు కల కరిగిపోయింది.

దౌలత్‌సింగ్ అయోమయంలో పడ్డాడు. చిత్తరువులోని వ్యక్తి ఎవరో, పేరేమిటో తెలియదు. ఎవరినైనా అడుగుటకు, అది కలలో

చూచిన చిత్తరువు. ఏమని అడుగ గలడు ? కర్తవ్యం బోధపడని దౌలత్‌సింగ్ మనస్సు చిత్తరువులోని మూర్తిపై నే లగ్నమైంది. ఫలితంగా. లండన్ నగరం వదలి, భారతదేశం చేరాడు. స్వంత యింట్లో వున్నా, వృత్తిమీద, కుటుంబ సభ్యులమీద మనస్సు పోవుటలేదు.

అతని ధ్యేయమంతా ఆ మూర్తి మేదనే ! తాను కలలో చూచిన చిత్తరువులోని వ్యక్తి దర్శనం పొందాలనే తపన వేధిస్తోంది. సాధు పురుషులు, యోగులు, స్వామిజీలువున్న ప్రతి ఆశ్రమం తిరిగి ఆ మూర్తిని కాంచుటకు ప్రయత్నించెను. భారతదేశమంతా నలుమూలలా గాలిస్తున్నాడు. పిచ్చివానివలె అదే ధ్యేయంతో ప్రయాణాలు కూడ చేశాడు.

అతని అదృష్టం కొన్నాళ్ళకు పండింది. ఒకరోజు బాబా శిష్యులు కొందరు, శ్రీనగరులో, బాబా సాహిత్యాన్ని, బాబా ఫొటోలను నలుగురకూ పంచుతూ ఒక బడ్డీకొట్టు వద్ద తారస పడ్డారు. హఠాత్తుగా దౌలత్‌సింగు దృష్టి ఆ బొమ్మపై పడింది.

ఆ ఫొటో చూడగానే, తాను కలలో కాంచిన సాధు విచ్చిన చిత్తరువులోని మూర్తి స్ఫురణకు రాగా రెండూ ఒకటేనని పోల్చుకున్నాడు. అమితానందంతో, ఆ ఫొటోలు పంచుతున్న వ్యక్తితో " అయ్యా ! యీ ఫొటోలోని వ్యక్తి ఎవరు ? ఆయన ఎక్కడ వుంటారు ? ఆయన గురించి వివరంగా చెప్పండి ! " అని అభ్యర్థించాడు.

అంత నాతడు తనకు తెలిసినంతవరకూ, బాబాను గురించిన విషయాలన్నీ వివరించాడు. " ఆయన యుగావతారుడు. అహ్మదునగరు సమీపంలోని మెహెరాబాదులో వుంటారు " అని తెలిపెను. విషయం విన్న దౌలత్‌సింగు యిన్నాళ్ళగా తాను దేనిని గురించి గాలిస్తున్నాడో. అది యిప్పటికి లభించినందున అమితానంద పడెను.

మనో వేగ, వాయు వేగాలతో, తాను ఆ మరుక్షణంలోనే, ఆ ప్రియతముని చేరాలని ఆరాట పడ్డాడు. తా నెంతటి అదృష్టవంతుడు కాకున్న, ఎక్కడో లండన్‌లోవున్న తనకు, కలలో కన్పించి, తన చెంతకు రమ్మని కబురంపుతారు? అందుచేత అందిన వాహన సాయంతో త్వరితంగా అహ్మదునగరు చేరాడు. దొరికిన బండెక్కి మెహెరాబాదు వెళ్ళాడు.

తీరా మెహెరాబాదు వెళ్ళేసరికి, బాబా ఏకాంతవాసంలో వున్నారని, యిప్పుడు ఎవరికీ దర్శన మిచ్చుటకు అనుమతించరని శిష్యుల ద్వారా తెలుసుకొని హతాశుడైనాడు. అయితే దౌలత్‌సింగ్ తనను గురించి తాను కలలో ఆయన రూపాన్ని చూచి, ఆయన ఆదేశం మేరకు, ఆయనను అన్వేషిస్తూ లండను నుండి బయలుదేరి భారతదేశ మంతా ఎలా వెదికాడో, తుదకాయన ఉనికిని గురించి ఎలా తెలుసుకో గలిగి యిక్కడకు రాగలిగాడో, అంతా సవిస్తరంగా శిష్యులకు వివరించాడు. ఎలాగైనా బాబాకు తన రాక నెరిగించి, ఆయన దర్శన భాగ్యం కలుగజేయమని ప్రాధేయ పడ్డాడు.

అయినప్పటికీ, ఆజ్ఞాబద్ధులైన శిష్యులు, బాబా దర్శనమున కవకాశము లేదని, నిష్కర్షగా చెప్పారు. దానితో పెర్రెక్కిన దౌలత్, బాబా దర్శనం అయ్యేవరకూ, తాను ఆహారం భుజించనని, నీరు ముట్టనని, నిద్రపోనని భీష్మించి, యిప్పుడు ధునీ వున్న చేరువలోనే ఒక వేపచెట్టు క్రింద భేటీ వేశాడు.

అలా వారం రోజులు గడిచింది. నిద్రాహారాలు లేని సింగ్ చిక్కి శల్యమైనాడు. ఎప్పటి కప్పుడు, శిష్యులు అతనికి నచ్చచెప్పి, వారింప చూచారు. అంతలో కరుణా సముద్రుడైన బాబా, శిష్యు లొకరిని పిలిచి, దౌలత్‌సింగు చెంతకు కబురంపిరి. తా నిప్పుడు కఠిన ఏకాంతవాసములో వుంటినని, తన దర్శన భాగ్యం పొందుటకు దౌలత్ కింకనూ సమయము రానందున, వెంటనే తన దీక్ష విరమించి, యింటికిపోయి డాక్టరు వృత్తి

కొనసాగించమని, రెండేళ్ళనంతరం, తాను లాహోరు వెళ్ళి " C " అను నామె యింట బసచేసి రెండు నెలలుందునని, ఆ సమయంలో తన దర్శన భాగ్యం పొందమని కబురంపారు.

తనను ముందుగానే లాహోరు వెళ్ళి, " C " అను నామెతో రెండేళ్ళనంతరం, బాబా ఆమె యింటికి రానున్నారని, అలా వచ్చినప్పుడు. తనకు తెలిపినచో ఆయన దర్శన భాగ్యం పొందెదనని కూడ చెప్పమన్నారు. శిష్యుని ద్వారా బాబా ఆదేశం విని, ' ఆహా ! అంతటి మహనీయుని దివ్య మంగళ రూపాన్ని యింతలో, కనులార చూడ కలిగే అదృష్టం తనకు లేకున్ననూ, కనీసం రెండు సంవత్సరములకైనా ఆ అదృష్టం కలుగ నున్నందు'న, ఆనంద పరవశుడై లేచి నృత్యం చేస్తూ శిష్యుల నందరినీ సంభ్రమాశ్చర్యములలో ముంచెత్తి లాహోరు బయలుదేరాడు.

లాహోరులో " C " ని కలిసి, బాబా చెప్పమన్న వార్త తెలిపి, బాబా రాగానే తనకు తప్పక జాబు వ్రాయమని మరీ మరీ చెప్పి గృహోన్ముఖుడైనాడు. ఆ రెండేళ్ళలో, ఎన్నోసార్లు, ఆమెతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. మళ్ళీ మళ్ళీ ఆమెకు జ్ఞాపకం చేస్తూ, బాబా రాగానే తనకు తెలియపర్చమని ప్రతి ఉత్తరంలోనూ వ్రాసేవాడు.

నిర్ణయం ప్రకారం, బాబా సరిగా రెండేళ్ళు కాగానే, కొద్దిమంది శిష్యులను వెంట పెట్టుకొని, మస్తు కార్యక్రమంలో లాహోరు వెళ్ళి " C " ఇంట విడిది చేశారు. అయితే " C " బాబా రాకను గురించి తెలుప గలనని యిచ్చిన వాగ్దానం మరిచింది. అప్పటివరకు కనీసం నెల కొక సారైనా జాబు వ్రాసే దౌలత్‌సింగ్ కూడ, " నెల నెలా ఉత్తరాలు వ్రాసి, ఆమెకు విసుగు ఏల కలిగించాలి ? బాబా వస్తే ఆమెయే వ్రాస్తుందిలే ! " అని సరిపెట్టుకొని, లాహోరులో బాబా వున్న నెల్లాళ్ళూ జాబు వ్రాయలేదు.

అయితే సర్వజ్ఞుడైన బాబా, తన వాగ్దానాన్ని వృధా కానీయ దలచలేదు. లాహోరులో ముందుగా నిర్ణయించిన, తన నెల రోజుల కార్యక్రమం పరిసమాప్తం కావచ్చింది. అంత బాబా " C " ని పిలిచి, " మీ యింట మా విడిదికాలము పరిసమాప్తమైనది. ఇప్పటి వరకూ, మా కార్యక్రమ మంతా మారువేషంలో జరిగినందున, ఆఖరి రోజున, నేను అందరికీ దర్శనం ఇవ్వదలచితిని. కావున, ఒకవేళ నీవు ముందుగా, ఎవరికైనా, నా దర్శన మిప్పింతునని మాట యిచ్చి యుండినచో, వారందరినీ వచ్చి దర్శనము చేసుకొనమని కబురంపుము. ఏ ఒక్కరినీ మరువక, వెంటనే రమ్మనమని గ్రామాంతరము నందున్నచో జాబు యీ రోజే వ్రాయుము " అని ఆదేశించారు.

అట్లేనని ఆమె బయటకు వచ్చి, గబ గబా తన వాళ్ళందరకూ జాబులు వ్రాసింది. కొంత తడవైన తదుపరి బాబా " C " ని పిలిచి, " అందరికీ జాబులు వ్రాసితివా ? " అని ప్రశ్నించారు. " వ్రాశాను " అన్నది. " ఏ ఒక్కరినీ వదలక, బాగా జ్ఞాపకం తెచ్చుకొని అందరికీ వ్రాశావా ? నీ వింతకుముందు నా రాకను గురించి తెలిపెదనని వాగ్దానము చేసివున్న అందరికీ కబురంపితివా ? " అని మరల హెచ్చరించారు.

" అవును బాబా ! ప్రతి ఒక్కరికీ కబురంపాను " అన్నది. " అయితే ఆ మూల గదిలో కళ్ళు మూసుకొని 15 నిమిషములు కూర్చొని, బాగా ఆలోచించుకొని, జ్ఞప్తికి తెచ్చుకొని, యింకా ఎవరినైనా వదలితివేమో గుర్తుచేసుకొన " మన్నారు.

ఆమె అటులనే 15 నిమిషములు ఆలోచించి, " లేదు బాబా ! నేను బాగా గుర్తు చేసుకున్నాను. ఇంక ఎవరూ మిగలలేదు. నేను వ్రాస్తానని చెప్పిన వారందరికీ జాబులు వ్రాసితిని " అని విన్నవించింది.

అంత బాబా "అయితే సరే! అట్టివారికి ఎప్పుడో! ఎక్కడో నేనే. స్వయంగా దర్శనమిచ్చెదను" అన్నారు. అలా అన్నప్పుడు కూడ ఆమెకు దౌలత్‌సింగుకు యిచ్చినమాట గుర్తుకురాలేదు. చూచితిరా! విధి ఎంత బలీయమైనదో. మానవ ప్రయత్నం ఎంతవున్నా, తగు సమయ మాసన్నమైతేగానీ, భగవంతుని కృప దొరకదు.

అనుకున్న ప్రకారం దర్శనకార్యక్రమం పూర్తయింది. బాబా తిరుగు ప్రయాణమై రైలుస్టేషను చేరారు. "C" ఆయన కూడా స్టేషను వరకు వెళ్లి రైలెక్కించి, బండి కదలగానే బయలుదేరి యింటికి చేరింది.

ఆమె యింటికి చేరేసరికి, చెదరిన జుట్టు, పీక్కుపోయిన ముఖంతో దౌలత్‌సింగు గుమ్మంలో సాక్షాత్కరించాడు. ఇంతకాలంగా ఆమెనుండి ఏ జాబు రానందున, విషయం స్వయంగా తెలుసుకోగోరి లాహోరు వచ్చాడు. అతడిని చూచేసరికి, "C" పై ప్రాణాలు పైనే పోయినయి. భ్రాన్తపడిపోయింది. బాబా అన్నిసార్లు ఎందుకు గుర్తుచేసుకోమని హెచ్చరించారో వూహించుకొని తల్లడిల్లిపోయింది. అతడిని చూచు సరికి ఆమెకు నోరాడలేదు ఇచ్చిన మాట నిలుపుకొన లేకపోతినని విచారించింది. ఎట్లాగో పెకలించుకొని బాబా వచ్చి వెళ్లిన వైనం, జరిగిన సంఘటన అంతా ఎరిగించి, అంతకు కొన్ని నిమిషాల క్రితమే బాబా వెళ్లిపోయినట్లు తెలిపింది. విషయం విన్న దౌలత్‌సింగు యింకనూ తనకు అవతారుని దర్శన భాగ్యం పొందే అదృష్టం దొరకనందుకు, నిర్విణ్ణుడై తన దురదృష్టాన్ని తలుచుకొని, రోదిస్తూ రోడ్డుమీదపడి దొర్లాడారు, ఎందరు ఓదార్చ ప్రయత్నించినా అతడిని శాంతపరచ శక్యంకాలేదు. ఏడ్చి ఏడ్చి, చివరకు విధిలేక ఇంటిముఖం పట్టాడు.

లాహోరులో బయలుదేరిన బాబా, ఢిల్లీ చేరగానే, పెండూనుపిలిచి' వెంటనే తపాలా ఆఫీసుకువెళ్లి, లాహోరులో తనకు దర్శనమిచ్చే

అవకాశం కలుగనందున, తానే స్వయముగా కాశ్మీరువచ్చి తన ఇంటనే దర్శన మివ్వనున్నట్లు, ఫలానా సమయానికి వస్తున్నట్లు, దౌలత్‌సింగు పేర తంతి యిచ్చిరమ్మనారు.

సరిగా దౌలత్‌సింగు, యింటికి చేరేసరికి, బాబా పంపిన తంతి అందినది. తనకు కలుగబోవు అదృష్టానికి ఆనందంతో గంతులువేశాడు. ఆ తరువాత బాబా స్వయంగా వచ్చి, దౌలత్‌సింగుకు, ఆలింగన, దర్శన భాగ్యము కలిగించి, అతడిని, తన శిష్యులలో ఒకటిగా చేర్చుకున్నారు.

బాబా ఎడల, అతి నిర్మలమైన విధేయతను, విశ్వాసాన్ని, దౌలత్‌సింగు జీవితాంతం కొనసాగించాడు. ఇప్పుడు అసలు కథకు వద్దాం. ఈ దౌలత్‌సింగును బాబాతో నవజీవనంలో అనుసరించుటకు అనుమతించారు. బాబా విధించిన నవజీవన నియమాలన్నిటినీ దౌలత్‌సింగు పాటిస్తానని హామీ యిచ్చాడు.

# నవజీవన శిక్షణా కేంద్రం, బెల్గాం

1949 అక్టోబరు 16 వ తేదీన 26 మంది శిష్యులతో బాబా నవజీవనం ప్రారంభించారు, గట్టిగా పదిరోజులు గడిచాయి. నవజీవనంలో ఎక్కువ కాలం గడుపుటకు, కర్నాటక రాష్ట్రంలోని బెల్గాం అనే పట్టణం చేరారు. ఈ బెల్గాంకు బాబా ఒక ముఖ్యమగు విశేషాన్ని అనుగ్రహించారు.

మొదట్లో కుల్దాబాద్‌ను తమ నవజీవనం ప్రథమ మజిలీగా తొలి శిక్షణా కేంద్రంగా ఎంపికచేశారు. అందుకు ప్రధానకారణం, షిరిడీ సాయిబాబా తన ఆధ్యాత్మిక జీవితాన్ని యీ కుల్దాబాద్‌లోనే ఆరంభించారు. అయితే బాబా చివరకు కుల్దాబాద్ బదులు బెల్గాంను ఎంచుకున్నారు.

ఇక్కడనే శిష్యులంతా నవజీవనంలో ఎలా నడుచుకొనాలో, ముందుగా తానాచరించి, చూపి, ఆ విధంగా శిష్యులంతా నడుచుకొనునట్లు చేయవలయునని భావించి, వారందరికి శిక్షణ యిచ్చేందుకై బెల్గాంలో ఒక శిక్షణాకేంద్రాన్ని ఏర్పాటుచేశారు. పట్టణ పొలిమేరల్లో గల తలక్‌వాడి అనే చోట, పొలాల్లో ఒక కుటీరం నిర్మించారు.

బాబా తన కుటీరాన్ని తానే స్వయంగా వూడ్చి శుభ్రపరచేవారు, తన గిన్నెలు, పాత్రలను స్వయంగా తోమి శుభ్రపరచేవారు. నీళ్ళ బకెట్లు మట్టి బొచ్చెలు తానుకూడ అందించేవారు. శిష్యులుండేందు కనువుగా, కుటీర నిర్మాణంలో అవుసరమయ్యే, ప్రతివస్తువు, బాబా స్వయంగా, అందించి సహాయపడేవారు.

అందరిలో ఈరుచ్ భలే అదృష్టవంతుడు. అతడు ఎప్పుడూ బాబాను అంటిపెట్టుకొని, ఆయనతో వుండుటే అతని పని. ఇది ఈరుచ్ కిచ్చిన ఆజ్ఞలలో ప్రథమం.

ఆరోజు రాత్రి బెల్గాం శిక్షణా కేంద్రంలో, అంతా ఆదమరిచి నిద్రలో వున్నారు, బాబా కూడ విశ్రాంతి తీసుకుంటున్నారు. ఈరుచ్ ఆయన ప్రక్కనే గుమ్మంలో కావలివున్నారు. వున్నట్లుండి బాబా, చప్పట్లతో ఈరుచ్‌ని పిలిచి, "ఒక పర్యాయము క్యాంపు చుట్టూ తిరిగి వద్దామని" తనవెంట రమ్మనమని సంజ్ఞ చేశారు.

నవజీవనంలో బాబాతోపాటు పదహారుమంది పురుషులు, నలుగురు స్త్రీలు వున్నారు. వీరంతా బాబా కుటీరానికి దరిదాపులుగా అక్కడక్కడా విశ్రమించి వున్నారు. నవజీవనంలో ఇది మొదటి మజలీ. పురుషులకు స్త్రీలకు వేర్వేరు విడుదులు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ విడిది ఏర్పాట్లన్నీ ఇక్కడ ప్రత్యేకంగా, శిక్షణా కార్యక్రమం కొరకు ఏర్పాటు చేయబడినాయి స్త్రీలకు, పురుషులకు మధ్య భాగంలో తన గదిని ఏర్పాటు చేసుకున్నారు.

అలా లేపిన ఈరుచ్‌ని, బాబా చీకటిలో వెంటబెట్టుకొని బయటకు తీసుకువెళ్లారు. ఈరుచ్ బాబా వెనుక అనుసరిస్తున్నాడు. శిష్యులున్న ప్రతి ప్రదేశాన్ని వారిరువురూ తిలకిస్తూ, గాఢనిద్రలో మునిగివున్న ప్రతి శిష్యుణ్ణి గమనిస్తూ వెళుతున్నారు.

చివరకు శిష్యులలో ఒకరు, అందరిలా పడుకొనక, కూర్చొని దుఃఖించుచుండుటను వారు గమనించారు. చాలా దుఃఖపూరిత వదనంతో, మానసిక ఆందోళనతో బాబా సమక్షంలో కనపడినందున, ఆరోజుతో అతడి నవజీవనం పరిసమాప్తమైంది.

ఆ వ్యక్తి ఎవరో కాదు. అతడే డా॥ దౌలత్‌సింగు. ప్రస్తుత మాయన జీవించిలేడు. ఆయన బాబాలో ఐక్యమైనాడు. కానీ బాబా సేవలో, తన జీవితంలో అనుభవించిన, అనేక కథలు మాత్రం, శాశ్వతంగా మన మధ్య వదలి వెళ్లాడు. అవి వినుటకు ఉత్సాహ పూరితమేకాక, నిజంగా వాటి ద్వారా ఆయన పొందిన అనిర్వచనీయమైన అనుభవాలు, మన కందరకూ నీతి బోధకాలు కాగలవు. ఆయన మన కందరకూ ఆదర్శప్రాయుడు. అందుకే యింత వివరంగా ఆయనను గురించి శోధించి మీ ముందుంచుతున్నాను.

వారిరువురూ సింగు చెంతకురాగానే, అతని వీపుపై, బాబా చిన్నగా చరిచి, సౌంజ్ఞలతో "డాక్టర్ ! ఇటు చూడు ! నీ విప్పుడు చేయునది ఏమిటి ?" అని ప్రశ్నించారు. బాబా సౌంజ్ఞలను, ఈరుచ్ తర్జుమా చేస్తున్నాడు. బాబా ప్రశ్న లన్నిటికీ సింగు స్థాయి పెంచి, బిగ్గరగా వెక్కి వెక్కి ఏడ్వ నారంభించెను.

మరి ఆ సమయంలో, బాబా సమక్షంలో దుఃఖ పూరిత వదనంతో వుండుట ఆయన ఆజ్ఞలను ధిక్కరించుటే కాగలదు. పాపం ! దౌలత్

సింగు ఆ విషయం మరచాడు. మళ్లీ బాబా "నీవు చేసేపని, నా ఆజ్ఞలను వుల్లంఘించుట అగు చున్నది. యింక నీ వెంతమాత్రం నా చెంత వుండలేవు. సరే ప్రస్తుతాని కా విషయం మరచిపో ! నిశ్చింతగా నిద్రపో. నీవు చేయవలసిన దాని గురించి రేపు వుదయం చెప్పెదను. నీ వేమీ ఆదుర్దాపడకుము. నే నెటువంటి ఆజ్ఞలు జారీచేయ బోవుచున్నానోనని ఆందోళన పడవద్దు. నే నివ్వబోవు ఆజ్ఞ నాకు ఆనందాన్నే కలిగించును" అని వూరట పరచారు.

నిజంగా కరుణా మయుడగు బాబా, నవజీవనంలో శిష్యులకు హితుడు. ఆయన ఎంతటి వుదార హృదయుడు ! దయా స్వభావుడు : షరతులు విధించినప్పటికీ వాటికి సవరణలు తానే స్వయంగా యీ మాదిరి యిస్తూ వుంటారు.

# విధి బలీయం

ఈ సంఘటన ద్వారా మనము ఎన్నో ! ఎన్నెన్నో ! అర్థాలు చెప్పుకొన వచ్చును. ఆయన ఇచ్చే ఆజ్ఞలు ఎంతో కఠిన మైనవి గానూ, ధృఢమైనవి గానూ వుండును. ఆయన కూడ తన షరతుల ఎడల ధృఢ వైఖరినే అవలంబించును. అయినప్పటికీ, అదే సమయంలో మనలను వూరట చెందించుటకు ఏదో ఒక చల్లని మాట అందిస్తూ వుంటారు.

దౌలత్ సింగును ఆ విధంగా వూరట చెందించి, తన గదికి వెళ్లారు. అప్పుడు ఆయన ముఖ కవళికలు గమనించిన ఈరుచ్ "ఆయన జరిగిన సంఘటనకు ప్రశాంతంగా వున్నట్లులేరు. ఆందోళనా పూరితంగా వున్నారు" అంటాడు.

శిష్యులంతా కూడ దౌలత్‌ను అమితంగా ప్రేమించేవారు. సాహవాస కార్యక్రమ సమయాలలో, ప్రేమికులు తిన్న ఎంగిలి విస్తళ్లు సింగు స్వయంగా ఎత్తేవాడు. అన్నీ ప్రోగుచేసి కట్టకట్టి నెత్తిన పెట్టుకొని దూరంగా పారవేసేవాడు. వళ్లంతా ఎంగిలి కారుతున్నా బిడియ పడే వాడు కాడు. ఆ చోటంతా తనే శుభ్రపరచేవాడు. ఆతడంతటి భక్తి శ్రద్ధలున్న స్నేహశీలి.

మరి, ఆతడు బాబాను ఎంతగా ప్రేమించే వాడంటే, అతని బాహ్య రూపం చూస్తేనే బాబాను సదా ధ్యానం చేస్తున్నట్లుండేది. విడువక బాబా నామం జపించే వాడు. ఈ లోకంలో బాబా తప్ప, దౌలత్‌సింగుకు మరో ధ్యాస వుండేది కాదు.

మరునాటి వుదయం, ఇతని విషయం గురించి బాబా విచారణ ప్రారంభించి శిష్యులతో సమావేశమైనారు. దౌలత్‌సింగు పిలువబడ్డాడు. రాత్రి జరిగినదంతా ముందుగా బాబాయే అతనికి గుర్తుచేశారు. తన ఆజ్ఞలను వుల్లంఘించి, ప్రవర్తించుటకు హేతువేమిటో చెప్పమన్నారు.

చిన్నపిల్లవాని వలె ఒక్కసారి దౌలత్ బావురు మన్నాడు. ఏడుస్తూనే తన దుఃఖ కారణం చెప్పాడు."బాబా ! ఈ దుఃఖానికి హేతువు నా చేతులలోలేదు. నా మనస్సు మాత్రమే అలా ఏడిపిస్తున్నది. దీనితో నా నవజీవనాని కేవిధమైన సంబంధంలేదు. నా మనస్సు నాకు దుఃఖ హేతువై పెడదారి పట్టించినది. ఇది నా మనస్సు మొక్క కలవరపాటు. నే నెంత ప్రయత్నించినా అది నా వశము తప్పినది. ఇది నాహృదయానికి మనస్సుకు మధ్య జరిగే సంక్షోభం మాత్రమే. అంతే ! "అన్నాడు.

"అయితే నీ కిప్పుడు వచ్చిన అంత కష్ట మేమిటి ? యిలా దుఃఖంతో నిట్టూర్చ వలసిన పరిస్థితి ఎందువలన కలిగినది ? " అని ప్రశ్నించారు బాబా.

"బాబా ! ఏమని చెప్పను ? ఆ రోజున శిష్యులందరినీ మెహెరాబాదు పిలిపించి, నిన్ననుసరించుటకు 'అవును' లేక "కాదు" అని చెప్పమంటివి కదా, అలా అవునన్న వారిలో నేనొకడిని. అయితే, అలా అవునని చెప్పిన నాటికి, అక్టోబరు 16 నవజీవవనం ప్రారంభించిన రోజుకు మధ్య కాలంలో, నేను మా యింటినుండి బయలుదేరి వచ్చేముందు, నా కుమార్తె వివాహము ఏర్పాట్లు జరిగినవి. అక్టోబరు 19న ఆమె వివాహం నిశ్చయమైనది."

"అందుచేత, అంతవరకు నన్ను యిల్లువదలి వెళ్లవలదని, నా కుమార్తె బ్రతిమలాడినది. బలవంతపెట్టినది. నేను నిస్సహాయుడనైనాను. అంతకు ముందే నిన్ననుసరించెదనని నీకు వాగ్దానము చేసియున్నందున, వాగ్దాన భంగము చేయుట కిచ్చగించక, మారు ఆలోచన చేయక, నా కుటుంబాన్ని తృణప్రాయంగా త్యజించి, నీతో వచ్చివేసితిని."

"అట్లు చేయుటలో నేనేమీ వ్యథచెందలేదు. ఏ బాధలు లేకుండా, నిన్ననుసరించ గలనని నే నెరుగుదును. కానీ అకస్మాత్తుగా, నాతో నాకుమార్తె అన్న ఆనాటి మాటలు గుర్తుకు వచ్చి రాత్రి దుఃఖము పెల్లుబికినది. దాని నదుపు చేయుట నా శక్యము కాలేదు." అని చెప్పగా, ఆమె అన్న మాటలేమిటో వివరంగా చెప్పమన్నారు బాబా.

అతడు ముందు కొంత తడబడినా, తదుపరి, గద్గద స్వరంతో "బాబా ! ఏమని చెప్పను ? మరి మూడు రోజులలో నా వివాహము జరుగ నున్నదని తెలిసీ, యిల్లువదలి, కుటుంబాన్ని త్యజించి, బాబా వద్దకు వెళుతున్నావు. అలాకాక, యీ మూడురోజులు, ఇంటివద్దవుండి, తన వివాహ క్రతువు పూర్తి చేయించి, ఆ పిమ్మట బాబాను కలువమని ప్రాధేయపడినది. కానీ, ఆమె ఎంత బ్రతిమలాడినా, ఎంత యాచించినా, నా నిర్ణయం మారలేదు. అందరినీ వదలి నీ చెంతకు చేరాను. అందుకు

ఆమె కుపితయై, వుద్వేగంతో, నే నామెకు తండ్రిని కాదన్నది. ఎన్నో దుర్భాషలాడినది. ఆ సమయంలో, ఆమె అన్న మాటలు పట్టించుకొనలేదు. కానీ, బాబా ! ఈరోజు రాత్రి ఏలనో హఠాత్తుగా ఆ సంఘటన నా మనస్సున ప్రతిఫలించినది. నన్నెంతో వేధించినది. నా హృదయాన్ని గాయపరచినది. దాని ప్రతిఫలమే నా యీ దుఃఖము" అని వివరించాడు.

అప్పుడు బాబా, "ఏది ఏమైనప్పటికీ, నీవు ఇప్పుడు నాతో ఉండుటకు ఎంత మాత్రము వీలులేదు. నవజీవన కాలంలో నీవు నాకెంత మాత్రము మిత్రుడవు కావు. నిన్నిపుడు నీ యింటికి తిరిగి వెళ్ళవలసినదిగా ఆదేశిస్తున్నాను. నీ కుమార్తె నిన్ను యింటివద్దనే వుండమని కోరినది కనుక, యింటికి తిరిగి వచ్చితినని, నీవారందరకు తెలియచేయుము. అయితే నీవు యింటికి వెళ్ళినప్పటికీ, నీవు మాత్రం నవజీవనం కొనసాగించ వలసినదే సుమా ! నవజీవన స్నేహితునిగా నా పరోక్షంలో నవజీవనం గడపాలి. నేను నిన్ను నా స్నేహితునిగానే కొనసాగించెదను. ఇది నా ఆజ్ఞ" అన్నారు.

## బాబా పరోక్షంలో నవజీవనం

ఇప్పుడు దౌలత్‌సింగుకు బాబా ఆదేశాన్ని పాటించుట తప్ప గత్యంతరంలేదు. ఆయన ఆజ్ఞ తిరుగులేనిది. అందువలన యింటికి తిరిగి వెళ్ళిపోయెను. అలా వెళ్ళినప్పుడు వయోవృద్ధుడైన తాను, తన సామానుల మూట నెత్తిన పెట్టుకొని వెళ్ళుట, చూచువారి కెంతో అబ్బురముగా కనపడినది.

అతడు తోటి స్నేహితులందరినీ వదలి పూర్తిగా, దూరంగా వెడలిపోయెను. మరి శిష్యులంతా పూర్వ జీవనంతో సంబంధం పూర్తిగా త్రెంచుకున్నారు గావున, అతడు వెడలిపోయిన పిమ్మట, అతనితో సంబంధం లేకపోయింది. చాలా కాలం వరకు అతడేమైనది, మిత్రులకు తెలియదు.

అయితే పాపం, దౌలత్‌సింగు ఇంటికి వెళ్ళిన తరువాత అతి భయానకమైన జీవితాన్ని గడపవలసి వచ్చినది. సాటివారి యీసడింపులు, కుటుంబసభ్యుల తిరస్కారంతో నికృష్టజీవితం గడిపాడు.

మొదట్లో కొన్నాళ్లు, భార్యా పిల్లలు ఆయనను ఎంతో ఆప్యాయంగా చూచుకున్నారు. ఆ తర్వాత ఆరంభమైనది రగడ. నిత్యం తన భుక్తికొరకు ఆహారాన్ని. నవ జీవన నియమానుసారం, భిక్షాటన చేసి సంపాదించేవాడు. అది చూచి వారు సహించ లేకపోయారు. అలా చేయుట, వారికిష్టము లేకపోయినది. ఒకటి రెండు రోజులైతే వారు పట్టించుకొనేవారు కారు. కానీ ఇదిశాశ్వతంగా కొనసాగవలసిన విధానమైనందున వారువ్యతిరేకించారు. వారిది వున్నతకుటుంబము. ఆస్థి పాస్తులతోపాటు పేరు ప్రఖ్యాతులున్న వ్యక్తి. అందునా వారు కాపురమున్న బజారులోనే బిచ్చమెత్తుట వారికి తలకొట్టినట్లయినది. అసలు యాచక వృత్తికే వారంగీకరించలేదు.

ఈ డాక్టరు పిచ్చివాడౌతున్నాడని, అతని భార్యా, పిల్లలు, తమ కుల పెద్దకు రిపోర్టిచ్చారు. ఇంతచేసినా దౌలత్ చలించలేదు. ధృఢంగావున్నాడు. బాబా ఆజ్ఞ అక్షరాల పాలించుటకే కృతనిశ్చయుడైనాడు. ఆ వీధిలోని యిరుగు పొరుగు, ఆయనకు నచ్చచెప్పుటకు ప్రయత్నించారు. ఫలితం లేనందున, విసిగి, రాళ్లతోను, చెప్పులతోను బాదుట మొదలిడిరి. భిక్షార్థిగా ఎవరి యింటిముందుకు వెళ్లినా ఛీత్కరించి పొమ్మనేవారు. కానీ ఎన్ని చేసినా ఆయనలో మార్పు రాలేదు.

తుదకు కుటుంబ సభ్యులుకూడ చెప్పులతో, రాళ్లతో కొట్టడం తరమడం మొదలిడిరి. తన స్వంతభార్య, బిడ్డలే ఆయనకు ఎదురుతిరిగి హింసించారు. ఇంటిలో వుండుటకు వీలులేదని ఇంటినుండి తరిమివేశారు. వారాయనను పూర్తిగా పరిత్యజించారు. అందువలన పాపమాయన స్వంత

వూరు వదలి పాదచారిగా వూరూరా తిరుగుతూ భుక్తికొరకు భిక్షాటన చేసుకుంటూ నవజీవన వుడుపులతో కాలంగడుపుతున్నాడు.

బెల్గాంలో శిక్షణా కాలం పూర్తి చేసుకొని, బాబా మిత్రులతో బెల్గాం వదలి, వుత్తరభారతం వైపు పయనించి, వారణాసి డెహరాడూన్ మున్నగు అనేక ప్రదేశములు తిరిగి, తుదకు దక్కను పీఠభూమిపై పయనిస్తున్నారు. అప్పటికి నవజీవనంలో దాదాపు ఒకటిన్నర సంవత్సరములు గడిచినది. ప్రస్తుతం వారు సతారాలో విడిదిచేసి వున్నారు.

వారంతా విడిది చేసినచోట ఒకగదిలో, బాబా తన మిత్రులతో ఒక సమావేశాన్ని ఏర్పాటుచేశారు. సమావేశం మధ్యలో హఠాత్తుగా, బాబా దృష్టి దూరంగా రోడ్డుపైవున్న ఒక వంతెనమీద కూర్చున్న వ్యక్తిపై పడినది. ఆ వెంటనే ఈరుచ్‌ని దగ్గరకుపిలచి, దూరంగా కనపడే ఆ వ్యక్తి ఎవరో వెళ్లిచూచిరమ్మన్నారు.

అతడొక ముదుసలి. బారెడుగడ్డం, పీక్కుపోయి శుష్కించినమోము తీరాచెంతకు చేరి పలుకరించ బోగా, అతడు దౌలత్‌సింగని గుర్తించాడు. ఆశ్చర్యంతో తన కళ్లను తానే నమ్మలేక పోయెను. చంకలో జోలె, చేతిలో భిక్షాపాత్ర. వంటిపై నవజీవన దుస్తులు, నెత్తిన తలపాగా " నీవా ? దౌలత్‌సింగ్ ! " అన్నాడు

"అవును. బాబా యిక్కడే వున్నారా? "అని అడిగెను. " ఆహా యిక్కడేవున్నారు." "అయితే బాబా యింటికి వచ్చి నేను భిక్ష అడుగ వచ్చునా?". "నేను చెప్పలేను. కానీ ఒకటి మాత్రం గుర్తుంచుకొనుము. బాబా నిన్ను గమనించే నన్ను, నీ వద్దకువెళ్లి తెలుసుకు రమ్మనిపంపారు" అన్నాడు.

అందు కాతడు అత్యంత సంతుష్టుడై సంబర పడ్డాడు. ఈరుచ్ వెనుక బాబా విడిదికి చేరాడు. వచ్చి తలుపు తట్టాడు " బాబా! భిక్షా దీజియే! "

అని అర్థించాడు. అతి దయాళుడైన బాబా తన ఆసనం నుండి లేచి, వెళ్లి అతని భిక్షపాత్ర నిండా ఆహారాన్ని నింపి, చిరునవ్వుతో అతడిని ఆలింగనం చేసుకున్నారు.

వెంటనే కొద్ది సేపు కూర్చుండ బెట్టు కున్నారు. అప్పటి వరకు తన జీవితంలో ఎదుర్కొన్న సంఘటనలన్నీ వివరంగా చెప్పమన్నారు. అలా అడుగుటలో బాబా వుద్దేశ్యం నవజీవనమంటే బాబా సమక్షంలో వుండి నవజీవనం అనుభవించుట, ఆయన పరోక్షంలో వుండి అనుభవించుట, ఈ రెంటి మధ్యవున్న సారూప్యాన్ని తన శిష్యులకు అవగాహన అగుటకే అతడిని అలా ప్రశ్నించారు. బాబా సన్నిధిలో వుండి తామనుభవించిన నవజీవనం కంటే, ఆయన పరోక్షంలో దౌలత్‌సింగు అనుభవించిన నవజీవనం ఎంతటి వుత్కృష్టమైనది?. అతడు పడిన కష్టములు పైన వివరించిన విధంగా ఒకటొకటిగా చెప్పినప్పుడు, యీ రెంటి మధ్యా ఎంతో వ్యత్యాసమున్నదని వారు గ్రహించారు.

అతడి కథనంతా విన్న బాబా పరమానందపడిరి. అతడిని మరో సారి ఆలింగనం చేసుకున్నారు. సంతోష వదనంతో "నీవిప్పుడు యీ నవజీవనం నుండి విముక్తుడవైనావు. కనుక మరల నీ యింటికి వెళ్లి నీ పాత వృత్తియైన వైద్యవృత్తి స్వీకరించుము. ముఖ్యంగా గుర్తుంచు కొనుము, ఏదో ఒక రోజున, నేను స్వయంగా మీ యింటికి వచ్చెదను, ప్రస్తుతము నిన్నానందంగా వుంచుటయే నా కోరిక." అన్నారు.

మళ్లీ బాబా ఆజ్ఞ మేర, దౌలత్‌సింగు తిన్నగా తన యింటికి వెళ్లాడు. ఎంతటి వాడికైన, అది ఎంతో సాహసంతో కూడిన పనే. ఎవరైతే తన యింటి నుండి తన్ని తరిమివేశారో, తిరిగి, వారున్న యింటికే పునరాగమనం అంటే, నిజంగా అది సాహసమే కాగలదు.

అయితే దౌలత్ ఎంతో ధైర్యంతో బాబా ఆజ్ఞాబద్ధుడై యింటికి వెళ్లాడు. వూరువారు కానీ, కుటుంబ సభ్యులుకానీ ఎవరూ ఆయనరాకకు అభ్యంతరము చెప్పలేదు. సాదరంగా ఆహ్వానించారు. తిరిగి తనవైద్యవృత్తి ప్రారంభించాడు. అతి త్వరలోనే గొప్ప డాక్టరుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు. కుటుంబమువారు, సంపూర్ణ ఆదరణతో గౌరవ మర్యాదలు యినుమడింప చేశారు.

## వాగ్దాన పాలన

1952లో బాబా అమెరికాలో కారు ప్రమాదం జరిగిన తరువాత భారతదేశంతిరిగివచ్చి, కొంతకాలానికి మరలా మస్తు కార్యక్రమం చేపట్టారు. ఒక రోజున బాబా కొందరు శిష్యులతో ఆ కార్యక్రమంపై బెంగుళూరు వచ్చారు. అప్పుడు బాబా ఈరుచ్‌తో "దౌలత్‌సింగు యిక్కడే వున్నాడు గదా! అతని అడ్రసు నీకు తెలుసా?" అని అడిగారు. అడ్రసు ఉన్నదనుటతో, వాళ్లయింటికి వెళ్లివద్దామని బయలుదేరారు.

అది వుషోదయపువేళ, షుమారు ఆరుగంటలు కావస్తున్నది. అక్కడక్కడా ఒకరిద్దరిని వాకబు చేసి, తుదకాతని యిల్లు చేరుకున్నారు. యింటిముందు కారు ఆపి, ముందుగా ఈరుచ్ లోనికి వెళ్లి దౌలత్‌సింగును కలుసుకున్నాడు.

బాబా వాగ్దానం ప్రకారం తన యింటికి స్వయంగా వచ్చారని విని వృద్ధుడైన దౌలత్ ఒక్కుమ్మడి యువకిశోరమై ఎగిరిగంతేశాడు. పరమానందభరితుడై, ఒక్క అంగలో బయటనున్న బాబా కారు చెంతకు చేరి కారు తలుపుతీసి లోనవున్న బాబాను గాఢాలింగనం చేసుకున్నాడు. అంతటితో అచేతనుడై ఏమి చేయాలో తోచక, నిరుత్తరుడైనాడు.

బాబా స్వయంగా, అతనిని తీసుకొని కారుదిగి, అతడియింటిలోని డ్రాయింగు రూముకు దారితీశారు. బాబాను ఒక కుర్చీలో సుఖాశీనునిచేసి, భార్యా పిల్లలను పిలచి "సాక్షాత్తు దైవం మనయిల్లు పావనం చేయుటకు మనయింటికి వచ్చాడు నిజానికి మనమెంతో అదృష్టవంతులము" అని చెప్పి, మారుమాట లేక అర్ధనిమీలిత నేత్రుడైనాడు. ఆయన పాదములు పట్టుకొని కూర్చున్నాడు. పలుకులు తడబడినవి. క్రమంగా అమనస్కుడైనాడు. శ్వాసకూడ స్థంభించినది.

కొంత తడవైన పిదప, బాబా ఆప్యాయతతో ఆతడి వీపు నిమురసాగాడు. మెల్లగా చైతన్యం కలుగ నారంభించింది. బాబా స్వయంగా తట్టిలేపారు.

"నాకు నా వాగ్దానం గుర్తున్నది, వాగ్దానభంగంచేయక, నా వాగ్దానం ప్రకారం నీ యింటికి స్వయంగా వచ్చాను. పని పరిపూర్ణమైనది. యిప్పుడు నేను నిన్ను వదలి వెళ్ల నిశ్చయించితిని. నీవు యికముందు కూడ నీ డాక్టరు వృత్తిని కొనసాగించుము. నేను రమ్మనమని పిలిచినప్పుడు నా వద్దకు రాగలవు.నాయందు నీకున్న అపారమైన ప్రేమకు, నేనెంతయో అమితానందపడితిని. నీ అపారప్రేమకు నేను సంతృప్తుడనైతిని. ఇప్పటి నుండి నేను నిన్నేమియు కోరను." అని చెప్పిరి. ఆనందాశ్రువులతో వీడ్కోలు చెప్పగా, బాబా దౌలత్‌సింగును యింటివద్దనే వదలి మరలి వెళ్లిరి.

అలా బాబా బయటకు వెళ్లగానే, దౌలత్‌సింగు, తన రొమ్ములు బాదుకుంటూ, బిగ్గరగా అరుచుచూ, పెద్ద పెట్టున రోదించసాగెను. అగమ్యంతో ఏమిచేయాలో తెలియక వెర్రికేకలేస్తున్నాడు. బాబా రాక సినిమారీలులా చకచకా జరిగిపోయింది. అతని వూహలో ఆయన మరి కొంతసేపు తనయింట వుంటారను కున్నాడు. ప్రేమ ప్రసాదంగా

అల్పాహారం, టీ వగైరా తాపీగా ఏర్పాటు చేయాలను కున్నాడు. హారతి యివ్వాలను కున్నాడు. కానీ అందుకు భిన్నంగా, తాను అచేతనుడై ఏమీ ఆతిధ్యం సలుపలేకపోతినన్న భావం రాగానే విచారంతో దుఃఖం పెల్లుబికింది ఎంతో సేపు విలపించాడు.

ఆ పిమ్మట ఆయన యిచ్చే ప్రతి దర్శన, సాహవాస కార్యక్రమాలకు వెళ్లేవాడు. తరచూ కలసి సేవించుకొనే వాడు, తన జీవితాంతం ప్రజలకు బాబాను గురించి విశదపరుస్తూ, ఆయన సేవలోనే శాశ్వతంగా కన్ను మూశాడు. శిఖ్కుజాతివారి మధ్య బాబా అవతారతత్వం గురించి, చెప్పేవాడు. ఈ నాటి శిఖ్కుజాతి బాబా ప్రేమికులు దాదాపు అంతా అతడి కృషిఫలాలే! దీనినిబట్టి మనకు, బాబాతో నవ జీవనంలో సహజీవనం కష్టతరము కాక, ఆయనతో హితులుగా మెలగుటలో ఎంతో ఆనందం వున్నట్లు విశదమగును.

ఇంతటితో ఈ దౌలత్‌సింగు కథ ముగిద్దాం. ముఖ్యంగా యీయన ద్వారా మనం గ్రహించవలసిన విశేషమేమంటే, బాబాకు దూరంగా వుండి, ఆయన పరోక్షంలో నవ జీవనాన్ని కొనసాగించుటకు ఎంత శ్రమపడినాడో మనకు అవగతంకాగలదు, మరి కొన్ని సంఘటనలు, బాబాతో గడిపిన నవజీవనంలో అవి ఎంతటి కష్టతరములే అయిననూ ఆయన సమక్షంలో వున్న సహచరులకు సుఖాంతములే అగుచున్నవి.

## నవజీవన శిక్షణ

ఎంతటి జటిల సంఘటనలైనా ఆయన సమక్షంలో శిష్యులు సులభంగా పరిష్కరించుకో గలిగెడి వారనుట కిదొక నిదర్శనం. వారు బాబా యొక్క నిర్దుష్టమగు, కఠినమైన ఆజ్ఞలకు బద్ధులై యున్నందున, ఆ ఆజ్ఞలు వారిపై సంకెళ్లవలె పనిచేసేవి. అయితే అదే సమయంలో,

అవి ఎంతటి కఠినమైన వైనప్పటికీ, బాబా వాటిని శిష్యులకు సులభతరం చేసేవారు. వారు చేయవలసినదల్లా తాము ఎల్లప్పుడూ, సుఖంగా ఆనందంగా వుండునట్లు తమకు తామే జాగ్రత్త వహించుట మాత్రమే.

అందుకే బాబా చెప్పారు. " నా యొక్క ఆజ్ఞలన్నీ ఈ నవజీవనంలో మీరు ఆచరించే ఒక్క చిన్న విషయం ద్వారా ఆవిరియై, నాకెంతో సహాయకారి కాగలవు. మీరు చేయవలసినదల్లా, మీరు ఎల్లప్పుడూ సంతోషంగా వుంటేచాలును. **Dont worry. Be happy.** విచారింపకుడు. సంతోషంగా వుండుడు. "

"మీరు ఒకే కోణంలో మీ దృష్టిని కేంద్రీకరించుడు. నేను సిద్ధపురుషుడను. అందువలన మీకు నాతో కల ఆధ్యాత్మిక సంబంధమున కెంత మాత్రం భంగం కలుగదు. మీరు మీగురించిన, యితరుల గురించిన యోగక్షేమములు తలుపక, కేవలం మృతప్రాయులుగా వుండుడు. నా ఆజ్ఞలు పాలించు నప్పుడు, మీకు కలిగెడు సుఖ దుఃఖములు మున్నగు వాటి ఫలమును భగవంతునికి విడిచి పెట్టి, మహా కష్టసమయమందు సైతం మీరు నన్ను విడువక, జతాకమువలె నెన్నంటి పెట్టుకొని యుండుట మీకెంతయో శ్రేయస్కరము. "

"నాకు కావలసినదల్లా, మీరు, నా స్నేహితులుగా మన సహచర బృందాన్ని ఎల్లప్పుడు, ఆనందమయంగా వుంచుడు. ఎట్టి పరిస్థితులలోను తామసభావాన్ని, కోపతాపాల్ని ప్రదర్శించకుడు. మనము కనుక యీ చిన్ని జాగ్రత్తను పాటించినట్లయితే, ఏ విషయంపైనా వ్యధ చెందకున్నట్లయితే, ప్రతి విషయం కూడ సరళంగా జరిగిపోవును" అని హెచ్చరించారు.

బాబా పదే పదే శిష్యులకు ప్రధానంగా, ఏ విషయంపైనా వ్యధపడకుడు అనే సూత్రాన్ని అంతగా చెప్పి, దానిపైనే ఎక్కువగా కేంద్రీకరించారు.

శిష్యులంతా, నిస్సహాయ నిరాశామయ స్థితిలో అంతగా జీవితం గడుపు తున్నప్పటికీ ఆయన, వారలను యీ సూత్రంపైనే నడిపారు. వారుకూడ అలా తు. చ. తప్పక తమ శాయశక్తులా ప్రవర్తించారు.

నవజీవనం గడిపే శిష్యులంతా తామింక వెనుతిరిగి పోబోమని పూర్తిగా విశ్వసించారు. బాబా ప్రకటనల ద్వారా వారటు వంటి విశ్వాసాన్ని పొందారు. వారిలో అలాంటి విశ్వాసం పాదుకున్న తరువాత యీ ప్రపంచ మంతా వారికిశూన్యమైంది, దానితో వారికి ప్రమేయం తప్పింది. ఎందుచేత! వారు తమ తను, ధన, మన, ప్రాణాల్ని సైతం బాబా అధీనం చేశారు.

భార్యా బిడ్డల్ని, కుటుంబాల్ని, యావదాస్తులను, సోదరీ సోదరులను, మాతాపితరులను, వయోవృద్ధ భేదం లేక సమస్తాన్ని పరిత్యజించి, బాబాతో నవజీవనం గడుపు తున్నారు. వారు దేనినీ లెక్కచేయరు. ఏమి చేయుటకు వెనుకాడరు.

ఒకే ఒక్క నెల నోటీసుతో వారు తమ సర్వస్వాన్ని వదలి బాబాను అనుసరించారు. అలా వారు చేయకలిగి నప్పుడు, ప్రాపంచక విషయము లందేల లెక్కచేయ వలయును ! గుర్వాజ్ఞాపాలనా బద్ధులై నవజీవనంలో ఆయన ననుసరించుటకు వారు కృత నిశ్చయులైనారు. అందువలన వారలా నవ జీవనం ప్రారంభించ కలిగినారు.

నే నింతకు ముందే తెలిపినట్లు బెల్గాంలో శిష్యులకు శిక్షణా శిబిరం ఏర్పాటైనది. బెల్గాం పట్టణం పూనాకు దక్షిణంగా వున్నది. అక్కడ బాబా సంకల్పించిన శిక్షణా కార్యక్రమం దాదాపు నలుబది రోజులు జరగాలని నిర్ణయించారు. శిక్షణాకాలం జయప్రదంగా జరగడానికి బాబా చెప్పగానే సహచరులు తక్షణమే విని, ఆయన ఆజ్ఞలు పాలిస్తే శిక్షణ బాగా జరుగు నన్నారు.

శిక్షణ అంటే ఏమిటో చూడండి. నవజీవనం గడుపుట గురించి నిశ్చయించి వాగ్దాన మిచ్చిన రోజు వుదయం కార్యక్రమం పూర్తికాగానే క్రింది మెహెరాబాద్ ఆశ్రమ వరండాలో ఒక మూల దౌలత్‌సింగు కూర్చొని వున్నాడు. యీ వరండాను యిప్పటికీ మనం చూడవచ్చును. అది చాలా పెద్దది. విశాలంగా వుండి రోడ్డుదిగగానే కనబడుతుంది. దాని నానుకొని వున్న హాలులోనే బాబా దర్శన కార్యక్రమాలు జరిగేవి.

ఆ వరండాలో ఒక మూల బెంచీ ఒకటి వున్నది. దౌలత్ ఆ బెంచీపై కూర్చొని విశ్రాంతి తీసుకుంటున్నాడు. తన మనస్సులో బాబాను మరొక్కమారు చూచి తరించాలని ఆశగా వుంది. వరండాలోకి ఒకసారి వస్తే తానెంతటి అదృష్టవంతుడనోకదా ! అనుకున్నాడు.

అంతలో బాబా వరండాలోనికి వచ్చి అటు యిటూ పచార్లు ప్రారంభించారు. మరో ప్రక్క డాక్టర్ ఘనీ కూర్చొని వున్నాడు. బాబా మండలిలో ఎవరూ పొగత్రాగరాదని నిషిద్ధం. అయితే డా. ఘనీకి మాత్రం యీ విషయంలో సడలింపు యిచ్చారు. అందుచేత ఆ సమయంలో డా. ఘనీ సిగిరెట్టు త్రాగుతున్నాడు.

బాబా ఒకటి రెండుసార్లు పచార్లు చేసి ఘనీ త్రాగే సిగిరెట్టును నోటినుండి లాగి, దౌలత్‌సింగుకు చూపి, తీసికొని త్రాగమన్నారు. వెను వెంటనే మారు ఆలోచన చేయక, ఏ సంకోచంరానీయక దౌలత్‌సింగు ఆ ఎంగిలి సిగిరెట్టుపీకను అమితానందంతో త్రాగేశాడు.

అతని విధేయతకు బాబా ఆనందించారు. సిగరెట్టు కాల్చరాదనేది నియమం. మరి బాబా ఎదుటనే త్రాగుట అనేది వూహాకందని విషయం. అయితే నేమి ? ఇది బాబా ఆజ్ఞ "సిగరెట్టుత్రాగుము" అన్నారు. ఇది విపరీతమైన ఆజ్ఞ. పాటించాలా ? వద్దా ? అనే ఆలోచన, సంకోచం ఏ మాత్రం రాలేదు. అతని విధేయతకిది పరీక్ష.

అందునా యిక్కడ మనము మరో విషయం ముఖ్యంగా తెలుసుకో వలసి వున్నది. దౌలత్‌సింగు ఒక శిఖ్కు. శిఖ్కులు సిగరెట్లుత్రాగరు. వారి మతంలో పొగత్రాగుట నిషేధం. యిక్కడ దౌలత్‌సింగు మాత్రం, బాబాకు విధేయుడై ఆయనను ప్రేమించే మతం. అందుచేత ఒక మహ్మదీయుని ఎంగిలి సిగరెట్టుని కూడ సంకోచించక బాబా ఆజ్ఞ వెంటనే పాలించాడు. ఇలాగే బాబా సహచరుల విధేయతను, విశ్వాసాన్ని అనేక విధాల పరీక్షించిన ఘట్టాలనేకం వున్నాయి. ముందు ముందు వివరంగా తెలుసుకుందాం.

# నవజీవన ప్రారంభం

నవజీవనం ప్రారంభించుటకు అక్టోబరు 16వ తేదీ నిర్ణయించారు. ఆనాడు తెల్లవారుఝూమున రెండు గంటలకే లేచి అంతా కాలకృత్యాలు పూర్తిచేశారు. మూడయ్యే సరికి టీ సిద్ధమైంది. టీత్రాగటం పూర్తికాగానే, సరోష్‌తెచ్చిన కార్లో బాబా, మెహెరా, మణి, మెహ్రాగోహెరులు ఎక్కి బయలుదేరారు. 4–15 నిమిషములకు అహ్మదునగరురైల్వే లేవెల్‌క్రాసింగు దగ్గరకు చేరారు. అప్పటికే పురుషమండలి సహచరులు సామానుతో వున్న బస్సుపై అక్కడకు చేరుకున్నారు. యీలెవెల్‌క్రాసింగు నుండి బయలుదేరు నప్పుడు, బాబా పరివారం తమ పాత జీవితం వదిలేశారు.

బాబా, పరివారం, కారు బస్సులను లెవెల్‌క్రాసింగు వద్ద వదిలేసి, కాలినడకన నవజీవనం ప్రారంభించాలని నిర్ణయించారు. వారు బయలుదేరు సమయానికి శుభ సూచకంగా వర్షం కురిసింది. బాబా కార్యక్రమాలు ఏవి ఎప్పుడు మొదలుపెట్టినా, ఆరంభంలో శుభ శూచకంగా వర్షం కురియుట అందరికీ అనుభవమే ! అందుచేత వర్షానికి లెక్కచేయక, అంతా గోనె సంచులు మడతవేసి నెత్తిన కప్పుకొని కాలినడక సాగించారు.

వర్షం పడుతోంది కదా ! అని, సరోష్, నడచివెళ్లే శిష్యుల వెనుక బాబాను, స్త్రీ మండలిని తీసుకు వచ్చిన తన కారువస్తే బాగుంటుందని బాబాతో చెప్పాడు. ఆదీ (జూ) కూడ అతని సలహాకు వూతం యిచ్చాడు. వర్షం హెచ్చే సూచనలున్నందున కారు అవుసరం అయితే సిద్ధంగావుంటుంది! కదా ! తనకారు కూడ తెస్తాను అని చెప్పగా బాబా 'సరే !' అన్నారు.

బాబా ముందు ఆడవాళ్లతో నడుస్తున్నారు. ప్రక్కనే ఈరుచ్ వున్నాడు. ఫర్లాంగు దూరం వెనకవుండి తమను అనుసరించ మన్నారు. బయలుదేరే ముందు బాబా ముందుగా వంగి నేలనుతాకి ఒక నిమిషంపాటు మౌనంగా వున్నారు. తరువాత అందరినీ అలానే ఒక నిమిషంపాటు మౌనం పాటిస్తూ నేలను తాకింప చేశారు.

తరువాత బాబా చేతులెత్తి "భగవాన్ ! ఈ నవజీవనం మా అందరికీ విజయవంతమై శాశ్వతానందాన్ని కలుగ చేయునట్లనుగ్రహింపుము ! " అని అందరినీ ప్రార్థించ మన్నారు. వారంతా అలా ప్రార్థించిన తర్వాత, ఒక నిమిషంపాటు ఆయన మౌనంగా వున్నారు. " ఇప్పుడు మౌనంగా నేనో ప్రమాణం చేశాను. అదేమిటో చెప్పగలరా " అని శిష్యుల నడుగగా తలా ఒక విధంగా చెప్పారు. అవేమీ కాదంటూ తానొక ప్రమాణం చేశానని, అది ఒక రహశ్యమని, ఎవరికీ చెప్పనని అన్నారు.

పిమ్మట పరివారం వెంటరాగా, కాలినడకన, వర్షంలోనే తడుచు కుంటూ పయనమై రెండుమైళ్లలో వున్న "ఛాస్" అనే గ్రామం వైపు నడకసాగుతోంది. వర్షం కూడ ఎక్కువైంది. బాబా మహిళలతో సరోష్ కారు ఎక్కి మిగతావారిని ఆదీ ( జూ ) కారులో రమ్మన్నారు.

## నవజీవనంలో సహజీవనం

వర్షంమూలాన అనుకున్న విధంగా జరగనందున చాస్‌లో ఆగలేదు.

ఉదయం 6 గంటలకు "సూపా" అనే వూరు చేరుకున్నారు. అక్కడ పొలిమేరలో వున్న రహదారి బంగళాలో మకాం వేశారు. ఈ మకాంలో గడుపనున్న నవజీవన ఛాయల గురించిన అనేక నియమాలు విధించారు వాటి సారం మాత్రం యింతకు ముందు మనం చెప్పుకున్నట్లు, ఆయన. ఆజ్ఞలను కిమ్మనకుండా తు. చ. పాటించుట. దాపరికం లేకుండా నిజాయితీగా ప్రవర్తించాలి. ఎట్టి పరిస్థితులలోను నిజంతప్ప మరేదీ మాట్లాడరాదు. కోపం వచ్చినా బయటకు కనపరచకూడదు.

యివన్నీ చెప్పాక, వారు చేయవలసిన పనులు పురమాయించారు. కాకా, బైదుల్, మురళి వంటపని చేయాలి. డాన్‌కిన్, నీలూ, ఆదీ (సీ) యింకా యితరులు నీరు తోడితేవాలి. అలాగే తక్కిన వారికి, వారి వారి సామర్థ్యాన్ని బట్టి పనులు పురమాయించారు. అంట్లు తోమడం; కూరలు తరగడం. వగైరా అన్ని పనులు పురమాయించబడ్డవారు చేయాలి. సహచరులంతా తమకు చెప్పిన పనులు, ఆషామాషీగాకాక శ్రద్ధగా చేయాలి.

సూపావరకు తమ సామాన్లన్నీ లారీపై తేబడినయి. నీలూ లారీ లోని సామాన్లు దింపుతూ కాలు జారి క్రిందపడ్డాడు అయితే దెబ్బేమీ తగలలేదు. దెబ్బలు తగల నందున ఆ సంతోష సమయాన్ని పురస్కరించు కొని, బాబా పది రూపాయలు పెట్టి వేడివేడి జిలేబీ తెప్పించి, శిష్యులందరికీ పంచిపెట్టమన్నారు. వర్షం తగ్గనందున రెండు రోజులుపాటు సూపాలోనే మకాం వేశారు.

రెండవ రోజు రాత్రి అంతా ఆదమరచి నిద్రపోయారు. బాబా కూడ గాఢ నిద్రలో వున్నారు. బాబా గాఢనిద్ర అంటే అర్థం వేరు. ఏ మాత్రం ధ్వని కలిగినా ఆయనకు మెలకువ వస్తుంది. కూర్చున్న మనిషి లేస్తేచాలు, ఆ చిరుసవ్వడి ఆయనకు మెలకువ తెస్తుంది.

ఆనాటి రాత్రి బంగళాలో బాబా డైనింగు టేబిలుపై పడుకొని వున్నారు. అర్ధరాత్రి సమయంలో బాబా పడుకున్న గది తలుపును ఎవరో దబదబా బాది గట్టిగా తోశారు. తలుపు తీద్దామని బల్ల దిగబోయి, 55 సంవత్సరాలు నిండిన బాబా గభాలున క్రింద పడిపోయారు. బరువంతా చేతుల మీద ఆపుకున్నందున దెబ్బలేమీ తగలలేదు.

ఈరుచ్ బాబా చెంతనే పడుకున్నా అతనికిదేమీ తెలియదు. బాబా మెల్లగా లేచి మరల పడుకున్నారు. ఉదయం లేచాక, రాత్రి జరిగిన విషయం బాబా అందరికీ చెప్పారు. బాబా మంచి వుల్లాసంగా వున్నారు.

ఘనీ, సమయస్ఫూర్తితో, లారీమీద నుంచి పడి ఏ దెబ్బ తగలక తప్పించుకున్నందుకు నీలూకు 10 రూపాయలు జిలేబీ వేడిది ఖర్చుబెట్ట నిశ్చయించినప్పుడు, బాబా అంతటివారు పడిపోయి, ఏ దెబ్బా తగలక తప్పించుకున్నందుకు, పెద్ద పండుగే చేసుకోవాలి అన్నాడు.

చిరునవ్వుతో బాబా "తప్పక అలాగే చేసుకుందాం. ఇదిగో ! ఈ ఇరవై రూపాయలు పెట్టి లడ్డూలు తెప్పించండి." అన్నారు. సూపా చిన్న ఊరైనందున, జిలేబీకానీ లడ్డూలుకానీ యిక్కడ దొరకవని, తదుపరి మజిలీ అయిన "ఘోద్ నది" చేరగానే, రెండు స్వీట్లు అక్కడ కొనుటకు. నిశ్చయించారు.

మూడవ రోజున వుదయమే బయలుదేరి వర్షం లేనందున, నడక సాగించి, నారాయణగామ్ మధ్యాహ్నానికి చేరారు. పొలంలో చెట్లక్రింద విడిదిచేశారు. భోజనాలయిన తర్వాత మళ్లీ నడక మొదలుపెట్టి సిరూర్ అనే వూరు చేరారు. వర్షం మూలాన నేలంతా తడిగావున్నందున, ఘోద్ నదికి వెళ్లాలని నిర్ణయించారు.

# వశీనా యోగం

ముందు స్త్రీలతో బాబా, ఆ వెనుక ఫర్లాంగు ఎడంగా తక్కిన పురుషులు నడక కొనసాగించుటచేత, ఎవరు ముందు వెళుతున్నారో, ఎవరు వెనుకపడుతున్నారో అగమ్యమైంది. అందుచేత, సహచరులను ఈమారు ముందు నడువమని, వారి వెనుక, బాబా స్త్రీమండలితో నడిచి వెళుతున్నారు. ముందున్న పురుషులు మాత్రం, వెనుకకు తిరిగి చూడ రాదనే నియమం పెట్టారు.

యిప్పుడు ఎండ ఎక్కువ కాస్తున్నది. నెత్తి మాడుతోంది. నడక వలన, బాబా మృదువైన పాదాలు బొబ్బలెక్కాయి. మెహెరా వెంట మరో చెప్పులజోడు తెచ్చింది. బాబా ఆ జోడు తొడుక్కొని నడక సాగించారు. బాబా అరికాళ్ళకు మందుపున్న టేపును డా॥ డాన్‌కిన్ అతికించి బాధ అనిపించకండా చేశాడు.

ఎండ కన్నెరుగని స్త్రీలు, శ్రమ ఎరుగని పురుషులు, నడి బజార్లెంట పదిమందిలో నడుస్తూ సంచారం చేయుట యిదే ప్రథమం. అందునా పురుషులంతా నవజీవన దుస్తులు ధరించి వున్నారు. తెల్లటి బారుగౌను, పచ్చటి తలపాగా, చంకలో జోలె. చూచేవారికో రెజిమెంటువలె వున్నారు. నడక అలవాటు లేనందున, ఆగుతూ, కూర్చుంటూ లేస్తూ నానా యాతన పడుతూ నడుస్తుంటే, గ్రామీణ ప్రజలు తమాషాగా చూచేవారు. చివరకు, ఆపుకోలేక, ఒకపూళ్ళో " బస్సుండగా యిలా నడిచిపోతున్నారే"మని ఒకాయన అడగనే అడిగాడు.

వారు ఫలానా అనీ, వారి నాయకుడు బాబా అని ఎవరికీ చెప్పరాదని నియమం. అందుచేత ఏదో జవాబు చెప్పి తప్పించుకోవాలి కదా! "కావాలనే నడుస్తున్నాంలెండి!" అన్నారు. బహిరంగంగా ఎన్నడూ

సంచరించని స్త్రీలకు ముఖ్యంగా ఇది ఓ పరీక్షే కూర్చుంది. వారివంకే చూచే ప్రజల దృష్టినుండి తప్పించుకోలేక, సిగ్గుతో తలవంచేవారు.

అందరిలోకి వృద్ధుడు, గుండెజబ్బున్నవాడు అయిన డా॥ ఘనీ నడవలేక ఆయాసపడుతున్నాడు. బాబా అతనిని వూరడించి, ఓ చేతికర్ర కూడ యిచ్చి దాని ఆసరాతో సునాయాసంగా నడవమని చెప్పారు. "అదిగో ! ఘోద్ నది వచ్చేస్తోంది. ఆ కనపడేదే ఘోద్ నది" అన్నారు శిష్యులలో ఒకరు.

"నా గొంతెండిపోయింది. నేనిక ఒక్క అడుగుకూడ వేయలేన"ని ఘనీ ఓ చెట్టుక్రింద కూలబడ్డాడు. నీలూని, డాన్‌కిన్‌ను ఘనీకి ఏం కావాలో చూడమని బాబా ఆదేశించారు. డా॥ గోహెర్ తనవద్దవున్న ఫస్ట్ ఎయిడ్ పెట్టె తెరచి ఏదోమందు తీసి డాన్‌కిన్ కిచ్చింది. ఒక పావు గంట తరువాత, కాస్త శక్తి పుంజుకొని, మెల్లగా తేరుకున్నాడు.

అంతా మరల నడక సాగించి ఘోద్‌నది వూళ్ళోకి చేరారు. రహదారి బంగళా ఏదీ ఖాళీలేనందున, నీలూ, కాకా, బైదుల్, పెండూలు ముందుగానే వూళ్ళో బాబా విడిది కవుసరమగు తావుకొరకు విచారించారు. బాబా ప్రేమికుడొకరి కావూళ్ళో ఓ సినిమాహాలున్నది. అందులో ప్రస్తుతం సినిమా వేయుటలేదు. అందువలన సంతోషంగా బాబా పరివారానికా సినిమాహాలు విడిదిగా ఇచ్చాడు.

అప్పటికి భోజనకాలమైనందున కాకా, బైదుల్‌లు ఏర్పాటుచేసిన భోజనంచేసి అంతా విశ్రాంతి తీసుకున్నారు. మధ్యాహ్నం టీసమయానికి, లారీనుండిపడి, దెబ్బలు తప్పించుకున్నందుకు, నీలూపేర జిలేబి తెప్పించుకొని అంతా తిన్నారు. ఆనాడు దీపావళి పండుగ పర్వదినం. ఆ రాత్రికి అక్కడే విడిది చేశారు.

# ఆంతరంగిక ప్రేరణ

దీపావళి పండుగ హిందువులకు ప్రధానమైన పండుగ. దీపాలంకరణతోపాటు, వివిధ రకాల టపాకాయలు కాలుస్తారు. ఆ రాత్రి చుట్టుప్రక్కల, టపాకాయల చప్పుళ్ళు విపరీతంగా వున్నా, బాబా బృందం ఆదమరచి నిద్రపోయారు. బాబా మాత్రం శబ్దాలను భరించలేకపోయారు. ఈరుచ్‌ను పిలిచి, ప్రక్కయిళ్ళల్లో టపాకాయలు కాల్చేవారిని అలా కాల్చకుండా ఆపమని చెప్పి రమ్మన్నారు.

అతడికిదో పరీక్షై కూర్చున్నది. ఆనందంతో వేడుకగా వాళ్ళు టపాకాయలు కాల్చుకుంటుంటే, కాల్చవద్దని చెప్పుటకు తానెవరు? అతనికేమి అధికారం వున్నది. ఏమి చేయాలో అంతుపట్టలేదు. ఆలోచనలతో గుక్కతిప్పుకోలేక పోయాడు. చివరకు భారమంతా బాబామీద వేసి ధైర్యాన్ని కూడగట్టుకొని, ఎదురుగావున్న వారింటికి వెళ్ళి యిలా ప్రాధేయపడ్డాడు.

"అయ్యా! ఆ సినిమాహాలులో మా బృందం విడిదిచేసి వున్నది. మా అగ్రజుడు, మా బృందనాయకుడు అలసటలోవుండి విశ్రాంతి తీసుకుంటున్నారు. నిజానికీరోజు మీకెంతో పర్వదినం. వేడుకతో టపాకాయలు కాల్చుట మీ ఆచారం. అయినా మా అగ్రజునికి, నిద్రాభంగం కలుగకుండా, టపాకాయలుకాల్చుట మానమని ప్రాధేయపడుతూ అభ్యర్థిస్తున్నాను" అని కోరుచే తడవుగా, ఆ యింటి యజమాని, టపాకాయలు కాల్చే, పిన్నాపెద్దలందరినీ కాల్చవద్దని చెప్పాడు.

మరి అతనిలో ఏ ఆంతరంగిక ప్రేరణ మేల్కొన్నదో తానే స్వయముగా యిరుగుపొరుగు యిళ్ళల్లో కూడ నలుగురినీ కలసి, టపాకాయలు

కాల్చుట మాన్పించాడు. పూర్వజీవనంలోవున్నా, నవజీవనంలో వున్నా బాబా యొక్క దివ్యాధికారం ఇలా ప్రస్ఫుటంగా బహిర్గత మయ్యేది.

అందుచేతనే, ఆయన నవజీవనంలో కేవలసహచరునిగానే ప్రవర్తించినా, ఆయన అవతారుడనే భావాన్ని తోటిసహచరులు ఒక్క క్షణం కూడ మరువలేకపోయారు. వ్యక్తులను చూడకపోయినా, ఆయన తన అధికారాన్ని వారికి ఎలా ఎరుకపరచేవారో, లేదా అప్రయత్నంగానే వారిలో ప్రేరణ కలిగించి, ఆశించిన పనిని వారిచేత ఎలా చేయించేవారో అవన్నీ అనేక సంఘటనలున్నాయి. నేను మీకు, కొన్ని సంఘటనలను, వాటి ద్వారా ఆయన అధికారిక అనుభూతులను శిష్యులు ఎలా పొందకలిగారో అవన్నీ ముందుముందు వివరిస్తాను.

## బెల్గాం పయనం

తెల్లవారితే 20 అక్టోబరు. ఆ రాత్రి పున్నట్లుండి, బాబా శిష్యులను పిలిచి, " ఈ రాత్రికే బెల్గాం వెళ్ళిపోదాం ! బస్సు మాట్లాడండి ! " అని పురమాయించారు. చీకటి పడింది. ఆ సమయంలో శిష్యులు బస్సు ప్రయత్నం చేయుట వారికో పరీక్ష. అయితే క్రమశిక్షణలో ఆరితేరిన వారు కనుక, బాబామీదనే భారంవేసి, ప్రయత్నించారు.

ఫలితంగా ప్రభుత్వరవాణా బస్సే కుదిరింది. రాత్రి 1—30 గం॥ లకు బస్సు పూనా మీదుగా బెల్గాం వెళ్ళుటకు బయలుదేరింది. సామానంతా లారీమీద పెండూ, కాకాలు తీసుకొని ముందుగానే వెళ్ళిపోయారు. బాబా తమ శిష్యులతో వచ్చారని తెలిసి కొందరు ఆయన దర్శనానికి వచ్చారు. బాబా వునికి బహిర్గతపరచుట నవజీవన నియమాలకు వ్యతిరేకం. కనుక, అలా వచ్చినవారికి నచ్చచెప్పుట శిష్యులకు కొంచెం కష్టమే అయ్యింది. ఎలాగైతేనేం జనంలోంచి తోసుకొని, బాబా, తక్కిన స్త్రీలతో ముందుగా

బస్సెక్కారు. స్త్రీలకు పురుషులకు మధ్య తెరలాంటిది కట్టారు. వెనుక భాగంలో పురుషులంతా కూర్చున్నారు.

బస్సెక్కగానే మళ్ళీ వర్షం ప్రారంభమైంది. దారివెంట వర్షం పడుతూనే వున్నది. తెల్లవారుఝామున నాలుగు గంటలకు పూనా చేరారు. ఇంకా టీ దుకాణాలు తెరవనందున రైల్వేస్టేషనువద్ద బస్సు ఆపి, అందరికీ టీ ఇప్పించారు. ఉదయం 8 గంటలకు సతారా చేరారు.

అక్కడ బస్సు ఆపి కాలకృత్యాలు తీర్చుకున్నారు. స్నానాలు పూర్తిచేసి, ఫలహారం చేశారు. ప్రతివారికి ఓ లడ్డూ రెండు చపాతీలు తెప్పించి పెట్టారు. భోజనం వేళకు కొల్హాపూర్ చేరారు. కానీ అక్కడ హోటళ్ళవారు హర్తాళ్ చేయుటవలన, భోజనం దొరకలేదు. కనీసం టీ కూడ లభ్యపడలేదు.

సాయంత్రం 3 గంటలకు "నిప్పాణి" అనే వూరు చేరారు. అక్కడ చపాతీలు, లడ్డూలు పుష్కలంగా దొరికాయి. వాటిని కొని తెప్పించి అందరికీ బాబా స్వయంగా పంచిపెట్టారు. టీ కూడ యిప్పించి మళ్ళీ బయలుదేరారు.

ఎలాగైతేనేమి, సాయంత్రం 4-30 గం॥ లకు బెల్గాం చేరారు. అక్కడ కూడ వర్షం పడుతోంది. చలి విపరీతంగా వున్నది. బెల్గాం లోని తలక్‌వాడిలో బాబా శిక్షణకాలం పూర్తిచేయుటకు తాత్కాలిక ఏర్పాట్లు చేశారు. బాబా బృందం వుండుటకు ప్రత్యేకంగా కుటీరాలు నిర్మించారు. గోడలకు బదులు, వెదురుతడికలు పెట్టి వాటిపై మన్ను పూశారు. నేలంతా సిమెంటు చేశారు.

తలక్‌వాడిలో శిక్షణకొరకై నిర్ణయించిన యీ ప్రదేశం 22 ఎకరాల స్థలం. అది వెనుక బాబా పేరుతోనే వుండేది. నామమాత్రపు ఖరీదు

పుచ్చుకొని ఆ ఆస్తినంతా విష్ణుబావగారు శ్రీ విశ్వనాథహల్దన్‌కర్ పేర వ్రాసి యిద్దామనుకున్నారు. కానీ విష్ణు అందుకు ఓ సూచన చేశాడు.

“నామమాత్రపు ధరకు అంత భూమి వ్రాసియిచ్చే బదులు, తీసుకున్న కొద్దిపాటి ధనానికి సరిపడా షుమారు 18 ఎకరాలు మాత్రం తన బావగారికిచ్చి, తక్కిన నాలుగెకరాలు యింటితోసహా మెహెరా పేరుతో వుంటే బాగుంటుం” దన్నాడు.

మెహెరా నవజీవనంలో వున్నది కనుక, ప్రస్తుతం, బెల్గాం ఆస్తిని హల్దన్‌కర్, ఆతని భార్య సుశీదేవరుక్కర్‌లు చూస్తున్నారు. ఏర్పాటు దారులు అజమాయిషీ చేస్తున్నారు.

మొదటి నాలుగురోజులపాటు వంటపని తలపెట్టలేదు. హోటలు నుండి భోజనం తెప్పించారు. రెండుపూటలా టీ తీసుకొనేవారు. ఆ తరువాత వంట వారే స్వయంగా ప్రారంభించారు. పైడుల్ నీరుతోడగా, గోహెరా వంటకు కావలసిన నీరు తెచ్చింది. మెహెరా పర్యవేక్షణలో మణి వంటచేసింది. ఆమె ఎక్కువమందికి మున్నెన్నడూ, వంట చేసి ఎరుగదు. వంట రుచిగా వుండాలని మెహెరా దగ్గరవుండి పప్పు, కారం వగైరా మసాలాలు వేయిస్తోంది. అఖరులో సూపు కాసే వంతు వచ్చింది. మసాలాలన్నీ గుర్తుంచుకొనే వేశారు. కానీ ఎంతకాగినా కమ్మని వాసన రాలేదు.

అంతలో బాబా వచ్చి ప్రక్కనేవున్న డబ్బాలోంచి ఒక చిటికెడు పొడి ఆ పులుసులో వేశారు. మరుక్షణంలో, గిన్నె నుండి ఘుమఘుమలాడుతూ సువాసనలు వెదజల్లబడ్డాయి. పులుసు బాగా రుచిగా తయారైంది. అంతా లొట్టలేసుకుంటూ తిని, చివరకు లేదనిపించారు. అప్పటినుండీ దానికే “భగవాన్‌సూపు” అని పేరుపెట్టారు.

# తలక్‌వాడిలో తర్ఫీదు

భోజనానంతరం బాబా నవజీవనం గురించి వివరిస్తూ, "యీ శిక్షణ జయప్రదంగా జరిగినచో జనవరి 1–వ తేదీ తరువాత, యీ జీవితం దేవతలకుకూడ అసూయపడేలా వుంటుంది" అన్నారు.

"ఇంతవరకూ మన జీవితం బాధతోను, నొప్పితోను కూడివుంది. అది ఎవరికీ హాయికలిగించలేదు. 1950 లో యింతకంటె బాధాకరంగా వుంటుంది. కానీ యీబాధవల్లనే హాయి దొరుకుతుంది" అన్నారు. బాధాయుతమైన జీవితం హాయిగా అనుభవించుట అంటే ఏమిటో వివరించారు.

"ఒకనికి తామరవచ్చి దురదపెడుతోందనుకోండి. అది గోకుతున్నంతసేపు అతనికి సుఖంగానే వుంటుంది. బాధ సుఖంగా వుంటుందంటే అలాటిదే" నని వివరించారు.

ఇక్కడ శిక్షణాకార్యక్రమంలో భాగంగా, టీ కాచడం, నీళ్ళు తోడటం యింట్లోకి మోసుకువచ్చుట, అంట్లుతోముట మొదలగు పనులన్నీ ఎవరెవరు ఏపని చేయాలో ముందుగానే వంతులువారీగ శిష్యులకు వప్పజెప్పారు.

స్త్రీలు, పురుషులు వారిదివరకెన్నడూ చేయనిచాకిరీ చేసుకుంటున్నారు. పరస్పర సహకారంతో, పనిమనుషుల్లా అన్ని పనులు చేసుకుంటున్నారు. 25–వ తేదీన అసలు శిక్షణ ప్రారంభమౌతుందని ప్రకటించారు.

శిష్యులతో చాలాసార్లు చర్చలు జరిపి, తుదకు బాబా శిక్షణాకార్యక్రమం తయారుచేయించారు. ఈ శిక్షణ కార్యక్రమాన్ని మూడు భాగాలుగా విభజించారు.

1. నవంబరు 20–వ తేదీ వరకు బెల్గాంలో శారీరక శ్రమతో కూడిన శిక్షణాకాలం. దీనినే ఫకీనాయోగమన్నారు. యిది మొదటి శిక్షణాకాలం.

2. రెండవ శిక్షణాకాలం డిశంబరు 10–వ తేదీ వరకూ, గోచీ పాతతో యాచకవృత్తి గడుపుట. దీనినే లంగోటీయోగం.

3. మూడవ శిక్షణాకాలం డిశంబరు నెలాఖరువరకూ హిప్పీల వలె, వూరూరా తిరుగుతూ గడపడం.

బెల్గాంలో శిక్షణా కార్యక్రమం ప్రారంభిస్తూ, లోగా తాను సూపాలో మాట యిచ్చివున్న విధంగా 20 రూపాయలు పెట్టి లడ్డూలు తెప్పించి తన స్వహస్తాలతో అందరికీ పంచిపెట్టారు.

వంటపని స్త్రీలకు తప్పించి, కాకా, బైదుల్‌లకు వప్పగించారు. మురళి పైపనులు చూస్తున్నాడు. ఈరుచ్ వూళ్ళో చిల్లరపనులేమైనా వుంటే చేసేవాడు. నీలూ, ఆదీ, పెండూ, ఆలిఅక్బరు, సదాశివ్ నూతిలో నీరు తోడేవారు. దౌలత్‌సింగు, బాబాదాసు అంట్లు తోమేవారు. సరుకులు తేవటం, విష్ణువంతు. పాచిపని చేయటం గుస్తాద్‌జీ వంతు. అన్నా, జక్కార్ రాత్రి కావలివంతు. రోజూ డైరీ వ్రాయడం ఘనీవంతు.

యిల్లాడ్చి, పాచిపనిచేయడం యిష్టంలేక, గుస్తాద్‌జీ ఆపని మరెవరికైనా వప్పగించమన్నాడు. అంత బాబా, ఎవరి పనులు వారు చేసితీరవలసిందేనని, అవి మార్చబడవని స్పష్టం చేశారు. " తన ఆదేశాలు వ్యతిరేకిస్తే నవజీవన నిబంధనల్ని వుల్లంఘించినట్లు కాగలదు " అన్నారు.

తా నిచ్చిన ఆదేశం, ఎంతటి అసాధ్యమైనదైనా, అర్థరహితంగా వున్నట్లు కనపడినా, ఆచరణలో సంకోచించక, విధేయతతో పాటించాలనేది బాబా ఇచ్ఛ. ఇక్కడ మనము గమనించవలసిన విశేషమొకటి వున్నది.

గుస్తాద్‌జీకి వప్పగించిన బాధ్యతనుండి తప్పించుకో ప్రయత్నించా డంటే, మన మనస్సు యిచ్చే ప్రేరణ ఎంత బలీయమైనదో వూహించ వచ్చును. అది ఎప్పుడూ మనలను పెడత్రోవలో పెట్టుటకే ఆలోచనలను రేకెత్తిస్తుంది. కొన్ని దశాబ్దాలుగా బాబా సాంగత్యంలో ఎనలేని శిక్షణ పొందిన వ్యక్తి గుస్తాద్‌జీ. ప్రపంచాన్ని, సర్వస్వాన్ని త్యజించి ఆయన పాదసేవలో పునీతుడైనాడు. అయినా, ఆయన ఆజ్ఞను పాటించుటలో వెనుకంజ వేశాడు.

పూనా కస్బాపేట జోంపడీలోవుండే రోజులలో, మేర్వానుగా బాబా గుస్తాద్‌జీ యెడల అధిక ప్రాధాన్యత చూపేవారు. తక్కిన శిష్యులకు అతనియెడల గౌరవం చూపేవిధంగా ప్రవర్తించేవారు. జోంపడీలో ఒక ప్రక్కన గుస్తాద్‌జీ ఫొటోపెట్టి పూలదండతో అలంకరించేవారు. తక్కిన శిష్యులుకూడ ఆ విధంగా, ఆ ఫొటోకు దండలేస్తే అది తనకు వేసి సత్కరించినట్లే కాగలదని చెప్పేవారు.

ఈ సందర్భంలోనే, బాబా తననొక రైలుఇంజను డ్రైవరుతో పోల్చుకొని, గుస్తాద్‌జీ ఇంజనువంటివాడన్నారు. పెట్టెలకు, యింజనుకు మధ్యవున్న కప్లింగులు సదాశివ్‌పాటిల్ అన్నారు. బువాసాహెబ్ ( బెహ్రంఫెర్దూన్ ) ను గార్డు అన్నారు. బెయిలీని రైలుపట్టాలన్నారు. తక్కిన శిష్యులంతా తనతో వారికున్న అనుబంధాన్ని బట్టి, వివిధ తరగతులుగల రైలుపెట్టెలన్నారు.

మరి అంతటి విశ్వాసపాత్రుడైన గుస్తాద్‌జీకికూడ ఆధ్యాత్మిక పరంగా, యింకా శిక్షణ అత్యంతావశ్యక మైనది. అక్టోబరు 25 శిక్షణ ప్రారంభదిన మైనందున, ముందుగా శిష్యులను తమకేమైనా కష్టాలుంటే చెప్పుకోమన్నారు. వారిని తృప్తిపరచే విధంగా తాను ప్రయత్నించడం యిదే ఆఖరుసారని, యికముందెవరినీ తృప్తిపరచే విధంగా వుండనని హెచ్చరించారు,

# నిరీక్షణ

"మీకు యింకో అవకాశం యిస్తున్నాను. మీరు బాగా ఆలోచించుకొనండి. నన్ను అనుసరిస్తూ ముందుకు సాగుతారో లేదా వెనుతిరిగివెళతారో తేల్చి చెప్పండి. ఎలాంటి శంకలతోవున్నా, నవజీవనం గడుపలేరు. నేను అబద్ధం చెప్పను. నిజం చెపుతున్నాను. నమ్మండి! నేను ఎవరిపట్ల ఎక్కువ వితరణ చూపను. ఏవిధంగాను నిబంధనలకు వ్యతిరేకంగా ప్రవర్తించను. మీకు ఇంకో అవకాశం యిస్తున్నాను. మీరు యీ సాయంత్రంలోపుగా తేల్చుకొని చెప్పండి. నాతో వుండడమా? లేదా వెళ్ళిపోవడమా? నిశ్చయించుకోండి." అన్నారు.

మనస్సును అదుపులోపెట్టడం ఎంతకష్టమో యీ చర్యవలన మనకు అవగతమౌతోంది. ముఖ్యంగా మెహెరాతో బాబా ముచ్చటిస్తూ "ఎవరి మాట ఎలావున్నా, నీవైనా ఎట్టి పరిస్థితులలోనైనా సంతోషంగా వుండి, నా కార్యక్రమానికి సహాయపడ" మన్నారు. ఎలాంటి సహచరులనైనా వదులుకోడానికి, మీ మనస్సు, మీ వైఖరి చాలన్నారు.

అలా మాట్లాడుతూ, దౌలత్‌సింగువైపు తిరిగి, అతనిని తమవద్దకు వచ్చి తనను చూచి ఒక లెంపకాయ కొట్టమని ఆదేశించారు. ఏ సంకోచం రానీయక దౌలత్‌సింగు బాబా చెప్పినట్లు చేశాడు. అతని విధేయతను బాబా ప్రశంసించారు.

తరువాత సహచరులందరినీ వచ్చి వరుసలలో నిలబడమన్నారు. అలా వారు నిలబడగానే, బాబా ప్రతివారి పాదాలు వంగి స్పృశించారు. ఆ తరువాత వ్యక్తిగతంగా అందరితో సంభాషణలు జరిపారు. వారి మనసులోని సందేహాలు తీర్చడానికి ప్రయత్నించారు. వారు శిక్షణా కాలంలో ఎదుర్కొంటున్న చిక్కులు విడదీయుటకు కృషిచేశారు.

నవజీవనంలో సహచరులు రాజకీయాలు మాట్లాడకూడదు. వార్తా పత్రికలు చదువరాదు. పరిశుభ్రంగా వుండాలి. శుభ్రమైన ఆహారం తిని ఆరోగ్యంగా వుండాలి. అంతేకాదు! బాబా ఆజ్ఞలు తు. చ. తప్పక ఆచరించి, నూటికినూరుపాళ్ళు జయంపొందితే వారే బాబాకు యజమానులవుతారని, తాను వారికి బానిసనవుతానని చెప్పారు.

ఉదయం నుంచి సాయంత్రం వరకు, ఎవరు ఏపని, ఎప్పుడు చేయాలో సమయంతోసహా నిర్దేశించారు. చూచేవారికి నియమాలు చాల స్వల్పంగా వుండవచ్చేమోకానీ, అంతర్గతంగా అవన్నీ ఓర్పును, విధేయతను పరీక్షించేవే.

ప్రొద్దుటే 5–30 గం. లకు లేవాలి. కాలకృత్యాలు పూర్తిచేసుకొని ఆరయ్యేసరికి టీ త్రాగాలి. 11–30 గంటలకు భోజనం చేయాలి. మధ్యాహ్నం టీ 2–15 గం. లకు తీసుకోవాలి. రాత్రి భోజనం సాయంత్రం 6–00 గంటలకే తినాలి. రాత్రి ఎనిమిదయ్యేసరికి అంతా నిద్రపోవాలి.

కాకా, బైదులు వంటపనిచేస్తే, మురళి బజారెళ్ళి కూరలుతెచ్చి వంటపనిలో సహాయపడాలి. డాన్‌కిన్ పోస్టాఫీసుకువెళ్ళి వుత్తరాలు తేవాలి.

## విస్సహాయజీవనానికి నాంది

నవజీవన శిక్షణకాలంలో రెండవఘట్టం కాశీలో జరపాలని నిశ్చయించినందున, కాశీలో వుండవలసిన బస ఏర్పాట్లు గురించి శిష్యులతో వివరంగా చర్చించారు. అక్కడ ఏర్పాట్లుచేయడానికి ఎవరిని పంపితే బాగుంటుందో ముందుగానే చర్చించారు. తలా ఒక పేరు సూచించారు. సదాశివ్‌పాటిల్, బాబాదాసులకు కాశీమహానగరం బాగా తెలిసివున్నందున వారిరువురిని పంపాలని బాబా నిర్ణయించారు.

స్త్రీలకు, పురుషులకు కావలసిన వసతిసౌకర్యాలు ఏర్పాటుచేసి, బాబా తన పరివారంతో అక్కడకు వచ్చేవరకు వారిరువురిని అక్కడే వుండమన్నారు. వారణాశిలో వారు చేయవలసిన ఏర్పాట్లుగురించి వివరంగా మాట్లాడారు.

ముఖ్యంగా వారుచేయవలసిన ఏర్పాట్లు (1) 40 రోజులపాటు వుండడానికి బాబా పరివారానికి ఏకాంతప్రదేశంలో ఏ అద్దె లేకుండా తగిన వసతి చూడాలి. (2) కాశీలో మళ్ళీ అమ్ముడుపోయేవిగాచూచి రెండు ఆడ గాడిదలు, రెండు ఆవులు కొనడానికి ఏర్పాటుచేసివుంచాలి. (3) ఈ 40 రోజులూకూడ వసతికై యిచ్చిన యింటి యజమానే బృందానికందరికీ సరిపడా భోజనఏర్పాట్లు ఉచితంగా చేయాలి.

(4) యజమానితాలూకు మనుష్యులెవరూ బాబానిగాని, బాబాబృందం లోనివారినిగాని చూడరాదు. చూచుటకు ప్రయత్నించరాదు.

(5) బాబా ఎవరో ఎవరికీ తెలియనీయరాదు.

(6) వీరికి వసతి ఏర్పాటుచేసిన బంగళాలో వంటగదివున్నా సరే అక్కడ వంట తయారుచేయరాదు. వేరేచోట వండించి యజమాని, బృందమునకిచ్చిన వసతివద్దకు తన మనిషితో పంపాలి.

(7) యావత్తు భవంతి, బాబాబృందం పరిష్కారానికి వదలాలి.

(8) యింటివారు వంటచేయుటకానీ, వడ్డించుటగానీ చేయరాదు. ఆహారాన్ని బంగళా బయటగేటుఎద్దనే వుండి వప్పగించాలి. యజమానిగానీ, యజమానురాలుగానీ, ఎట్టి పరిస్థితులలోను వచ్చి బాబానుగానీ, బృందంలోని యితరులనుగానీ చూచుటకు ప్రయత్నించరాదు.

(9) ఉదయానే అల్పాహారం, మధ్యాహ్నం భోజనం, రాత్రి భోజనం పంపాలి. భోజనం సాత్వికాహారమై వుండాలి. పప్పు, కాయ కూర, అన్నం ; రాత్రికి ఆకుకూర ; అల్పాహారంలో రొట్టె, టీ. ఒకవేళ యజమాని ఏవైనా మధురభక్ష్యాలు పంపదలచినా అలా పంపరాదు.

ఈ పై నియమాలన్నీ వివరంగా చెప్పి, యీ షరతులకు లోబడిన రీతిలో వసతిఏర్పాట్లు చేయమని, సదాశివపాటిల్‌ని అక్టోబరు 26-వ తేదీన బనారసు పంపారు.

నవజీవనం ప్రారంభించేముందు, బాబాపరివారంలో కాకాబారియాను కోశాధికారిగా ఏర్పాటుచేసి ఖర్చులక్రింద అతనివద్ద కొంత పైకం వుంచారు. యిప్పుడు అతనివద్ద రు. 500-00 లు మాత్రమే వుంది. వారిరువురికీ ఖర్చులక్రింద ఆ పైకం ఇచ్చి పంపారు.

డిశంబరు ఆఖరువరకు తాను తన సహచరులకు కావలసిన సహాయం చేస్తానన్నారు. వాళ్ళుకూడ తనకు సహాయంచేయాలి అన్నారు. "తనకు కోపం వస్తుంటే, వారు నేర్పుతో అలా కోపం వస్తున్నట్లు జ్ఞాపకం చేయాలి. డిశంబరుతో పరస్పరసహాయం సమాప్తమవుతుంది, జనవరి 1-వతేదీ నుండి నవజీవనం గాలిమీద ఉంటుంది. ఆ జీవనంలో హృదయానిదే ప్రాధాన్యత. మనస్సుకు పనిలేదు. శరీరం దానికదే చూచుకుంటుంది. ప్రస్తుత జీవితానికీ, దానికీ పొంతన వుండదు. అసలైన జీవితం అదే" అని చెపుతూ వాళ్ళకు మానశికపరమైన తర్ఫీదు ఆరంభించారు.

ఇల్లు తుడవడం, అంట్లుతోమడం, వంటయింట్లో చేయూతనివ్వడం, సామానులు మోయడంలాంటి పనులు బాబా స్వయంగాచేయడం ఆరంభించారు. ఆదీ హార్మోనియం వాయిస్తూ పాడుతుంటే బాబా మద్దెల వాయించేవారు. నీలూ తాళాలు వాయించేవాడు.

కొన్ని విషయాల్లో మిత్రులు బాబా ఆజ్ఞలు పాటించుటలో తప్పటడుగులు వేశేవారు. గుస్తాద్ యిల్లు శుభ్రపరుస్తూ జంపఖానా దులుపుతుంటే, ఆలీఅక్బర్ ఒకప్రక్క జంపఖానా పట్టుకోవడం బాబా చూచారు. ఆలీ అక్బరుపని నీరు తేవడం. మరోపని చేయరాదు. మరి యీ నియమానికి

విరుద్ధంగా ప్రవర్తించాడు కనుక, అందుకు శిక్షగా బాబా అలోచాని వచ్చి చెవులు గిల్లి పొమ్మన్నారు.

మరోసారి కాకాబారియా మధ్యాహ్నం ఎండలో వూలుస్వెట్టరు వేసుకొని పచ్చడి చేస్తున్నాడు. ఎండగా వున్నందున స్వెట్టరు వూడదీయ మన్నారు బాబా. పచ్చడి నూరేసి తీస్తానన్నాడు కాకా. తన ఆజ్ఞ తక్షణం పాటించలేదని శిష్యులందరినీ పిలిచి చెప్పారు. వారందరి సమక్షంలో కాకాను వచ్చి తనను తన్నమన్నారు.

అప్పుడు బాబా చెప్పారు. " నేను మిమ్ములను చెవులు గిల్లమన్నా, కాలితో తన్నమన్నా, మీవల్ల జరిగిన తప్పులే దానికి కారణమని అనుకొన బోకుడు. నేనలా ఆజ్ఞాపించుటకు నా స్వంతకారణా లుంటాయి. మీ మధ్యలో నేనొక సోదరునిలా వుంటాను. అయితే సర్వకాల సర్వావస్థల యందు మీరు నన్ను మీ గురువులా చూచుకొని నాకు విధేయులుగా వుండండి " అని వివరించారు.

వారున్న యిల్లు ఒక చిన్న పెంకుటిల్లు. వర్షం వచ్చినప్పుడల్లా గదిలో నీరు నిలిచేది. ప్రతిరోజూ గోడలికి ఎలుకలు కన్నాలుపెట్టి మట్టిని తోడేవి. పైకప్పులోవున్న చిల్లులకు సిమెంటుచేయడం, ఎలుక కన్నాల్లో మట్టి ఎత్తిపారవేయడం శిష్యులు స్వయంగా చేసేవారు.

ఒకరోజు రాత్రి మణి నిద్రలోవుండగా తనచేతివ్రేలిని ఏదో కరచిం దని కేకపెట్టింది. మెహెరా ప్రక్కగదిలోవుంది. డా॥ గోహెర్, మెహూటా, మెహెరాలు ఆ అరుపువిని మణివద్దకు వచ్చారు. నిద్దట్లో ఆమెచేయి దోమతెర బయటకువస్తే ఎలుకేదో కరచిందని కనుగొన్నారు. కరచినచోటునుండి రక్తం వస్తోంది. డా॥ గోహెర్ మందువేసి కట్టింది. గోహెరాకి నిద్దురలో " సహాయం చేయండి—సహాయం చేయండి ! " అని ఎవరో అరచినట్లు ఆలాపనగా వినపడి " ఎక్కడా ? "

అని వెదుకుతూ మణీ గదిలోకి వచ్చేసరికి, మణీ మౌనంగానే వున్నది. "నీవు పిలిచావా ?" అని అడిగితే నేనలా అనలేదన్నది.

నవజీవనంలో సహచరులంతా రెండువిషయాలకు కట్టుబడి వున్నారు. (1) భగవంతుని సమక్షంలో ప్రతివిషయంలోనూ బాధ్యత వారిమీదనే వుంటుంది. (2) భౌతికంగా లేదా ఆధ్యాత్మికంగా, సహాయం లేదా బహుమతి ఏదీ వారు పొందరు. కానీ వారికి తెలియకనే అవుసర సహాయం సమయానికి పొందుతూనే ఉన్నారు.

బెల్గాం శిక్షణలో ముఖ్యమైనది, వారికి విధించిన నియమాలు జాగ్రత్తగా పాటించడం. విశ్వాసంతోను, నిజాయితీతోను నియమాలు ఆచరించడం. ఎలాంటి క్లిష్టపరిస్థితిలోనూ సంతోషంగా ఉండడం. ధనాన్ని, స్త్రీని తాకకపోవడం.

## నవజీవనగీతం

బాబా సూచనలమేఱకు డా॥ ఘనీ నవజీవనపాట వ్రాశాడు. అందు కొన్ని మార్పులు చేర్పులు బాబా చేశాక, ఆదీచేత ప్రతిరోజూ ఆ పాట పాడించేవారు. శిష్యులంతా ముక్తకంఠంతో ఆలాపించేవారు.

ఈ పాట సూక్ష్మంగా నవజీవనంగురించి వివరించింది. నవజీవన నియమాలన్నీ అందులో చొప్పించబడ్డాయి. పాటలో సాహిత్యం అద్భుతంగా వుంది. కవితాసౌందర్యం దానిసొత్తు. అయినా మొదట్లో ఘనీకి పాట తయారుచేసినప్పుడు, ఆఖరి చరణాలలోని భావం నాస్తికత్వాన్ని వుత్సాహ పరచే అర్థం వచ్చింది.

అటువంటి అపార్థం రాకుండా పాట తిరగ రాయాలని పలువురు సహచరులు సూచించారు. బాబా కావలసిన భావాన్ని వివరించి, ఆఖ్రి నాలుగు చరణాలు మార్చమని ఘనీని ఆదేశించారు. ఘనీ ఆ భావానికి

ప్రస్ఫుటంగా వ్యక్తీకరించలేనేమోనని సందేహం వెలిబుచ్చాడు. తెల్లవారే సరికి ఆ నాలుగు పంక్తులు మార్చి వ్రాయలేకపోతే నూరు గుంజీలు తియ్యాలని అజ్ఞాపించారు.

బాబా సూచనమేరకు ఘనీ ఆఖరు చరణం చక్కని కవిత్వంతో వ్రాశాడు. క్షణానికోతల్లీ, యుగానికో అవతారుడు. భగవంతుడుండుట సత్యం. ప్రవక్తలుండుట నిక్కం. నిరాశ, నిస్సహాయతమాత్రం మా సొత్తు. యిదీ దాని భావం. అంతా చాలా మెచ్చుకున్నారు.

రోజూ యీ పాట ఆదీ పాడుతుంటే బాబా డోలక్ వాయించేవారు. ఆ లయవిన్యాసం విని సహచరులు మైమరచేవారు. ఆయన వ్రేళ్ళ కదలిక అందరి దృష్టినీ ఆకర్షించేది.

## నిరాశాజీవనం

నైరాశ్యం, నిస్సహాయతలకు సంబంధించిన శిక్షణ, ఆజ్ఞా పాలనలో వారి విధేయతకు గీటురాయి. అనుక్షణం ఎన్నెన్నో అనుభవాలు కలిపించి తగు తర్ఫీదు యిచ్చారు.

గుస్తాద్‌జీకి రోజూ రాత్రిళ్ళు పడుకునే సమయంలో తన పక్కకు నాలుగువైపులా గీతల గుర్తులు గీసుకొని పడుకోవడం అలవాటు. ఒక రోజు రాత్రి అలా గీస్తుండగా, "ఆ అలవాటును యిప్పుడు ఎందుకు మరచి పోలేవు"? అని అడిగారు. "బాబా! అలా చేసినందువల్ల వచ్చిన ప్రమాదమేమీ లేదుకదా!" అని ఎదురు ప్రశ్నవేశాడు. ఆయన యిచ్ఛకు అనుగుణంగా సమాధాన మివ్వనందున అతడిని బాగా మంద లించారు.

కాకాబారియాను ఒకసారి బాబా వెంటనే రమ్మన్నారు. అతడు రావడం ఆలశ్యం చేశాడు. పాపం! అతడప్పుడు వంటింట్లో కుంపటి మీద వుల్లిపాయలు వేయిస్తున్నాడు. అవి మాడిపోతాయని, గభాల్న దించి, పరుగున వెళ్ళాడు. ఆ కొన్ని క్షణాల ఆలశ్యానికే అవిధేయతగా అతన్ని కేకలేశారు.

విష్ణుని పనిమీద ఒకసారి పూనా పంపారు. అతడు రాత్రికి తిరిగి రాగానే సహచరులతనిని చుట్టుముట్టి అక్కడి విశేషాలేమిటని ప్రశ్నించారు. నవజీవన నియమాల్లో రాజకీయచర్చలు, వార్తాపత్రికలు చదవడం నిషిద్ధం. కానీ పూనాలో పేపర్లమ్మే కుర్రాళ్ళు గాంధీమహాత్ముడ్ని చంపిన గోడ్సే, ఆప్టేలను నవంబరు 15–వ తేదీన వురితీస్తారని అరుస్తూ పేపర్లమ్ముతుంటే విన్న విష్ణూ ఆ వార్తని విశేషంగా, సహచరులతో చెప్పాడు.

ముందుగా నిర్ణయించిన కార్యక్రమం ప్రకారం పరివారమంతా నవంబరు 15 నాటికి కాశీ చేరాలి. మరి ఆనాడే వారి వురితీత వున్నందున, అలజడి లేకుండుటకై 144–వ సెక్షను అమలుచేయవచ్చనే ఆలోచన రాగానే సహచరులు ఆ విషయం బాబాతో చెప్పారు.

యిది రాజకీయపరమైన విషయమైనందున, అనవసరంగా అందులో తలదూర్చినందుకు నియమోల్లంఘనగానే భావించారు. ఫలితంగా విష్ణూని మందలించారు, అయితే సహచరులు, కొన్ని సందర్భాలలో మెళకువగా వుండుటకు, పత్రికలలోని వార్తలు తెలుసుకుంటే మంచిదని బాబాతో చర్చించారు.

అందుకు బాబా, ఏది ఏమైనా ఎవరూ పత్రికలు చదవరాదని ఆదేశించారు. రాజకీయాలగురించిన చర్చకూడ పనికిరాదన్నారు. కాని డాన్‌కిన్‌ని పిలచి, నీవద్దవున్న పైకంతో రోజూ పేపరుకొని, ముఖ్యమైన

వార్తలు కత్తిరించి బాబాకు చూపాలి. అప్పుడు అవుసరమైనవార్తలేమైనా వుంటే బాబా అంగీకారంతో సహచరులు చదవడాని కివ్వబడతాయని నిర్దేశించారు.

ఓరోజున, బాబా సహచరుల గదికి వచ్చి ఘనీని పిలిచారు. ఆ సమయంలో అతడు మరుగుదొడ్లో వున్నాడు. బాబా పిలుపు అక్కడ నుండే విన్నాడు. లాగూ పైకిలాక్కోకుండానే, బాబా పిలుస్తున్నారని వినగానే వున్న ఫళాన ఎలావున్నవాడు అలా పరుగున వచ్చాడు. అలా రావడం చూచి బాబా మహదానందం పడ్డారు. విధేయత అంటే అది అలా వుండాలి. ఆ సంతోషాన్ని ఆపుకోలేక, సహచరులందరినీ పిలిచి, ఆ దృశ్యాన్ని అందరికీ చూపి అందరినీ చప్పట్లుకొట్టి కేరింతలాడమన్నారు.

వీటినిబట్టి మన కవగతమయ్యేది ఒక్కటే. సహచరులంతా పాత అలవాట్లు విస్మరించి, బాబాయిచ్చే ఆజ్ఞలు, అవి ముఖ్యమైనవైనా, కాకపోయినా, అర్థంవున్నా, లేకపోయినా తక్షణం పాటించాలి. ఆయన కోపంగావున్నా, మందలించినా, సహచరులుమాత్రం వుత్సాహంగా వుండాలి.

ఒకసారి రైల్వేస్టేషన్‌లో వుండగా, నీలూకు తొందరగా దొడ్డికి వెళ్ళాల్సివచ్చింది. ప్రక్కనే లోనావాలా వెళ్ళే రైలుంది. గభాల్న ఆ రైలెక్కి దొడ్లోకివెళ్ళి కూర్చున్నాడు. అతనిపని పూర్తికాకముందే రైలు కదలింది. గత్యంతరం లేక, నీలూ లాగన్నా తొడుక్కోకుండా, అలాగే కదులుతున్న రైల్లోంచి దూకేశాడు. పాపం తొడుక్కోని లాగు కాళ్ళకు అడ్డంపడి నగ్నంగానే ప్లాట్‌ఫారంమీద పడిపోయాడు. ఆ దృశ్యం చూచి సహచరులంతా పొట్టచెక్కలయ్యేట్లు నవ్వుకున్నారు.

సహచరులను యీ విధంగా నిస్సహాయ, నిరాశామయ జీవితం గడుపుటకు తర్ఫీదు యిచ్చారు. వారుకూడ తు. చ. తప్పక నడుచు

కొనుటకు శాయశక్తులా ప్రయత్నించారు. దేనితోను వారికి ప్రమేయం లేకపోయింది. యీ ప్రపంచమే వారికి శూన్యమైంది.

## నవజీవన రెండవ ఘట్టం

బెల్గాంలో శిక్షణ పూర్తికాగానే బాబా పరివారంతో వుత్తరదిశగా ప్రయాణమై, బనారసు గమ్యస్థానంగా నిర్దేశించారు. ప్రతిరోజూ సగటున షుమారు 15 లేక 20 మైళ్ళు కాలినడకన ప్రయాణం సాగించాలి. మార్గమధ్యంలో అవుసరమయ్యే ఆహారం భిక్ష యెత్తి సంపాదించాలి.

రాత్రి విశ్రాంతికై ఆగవలసివచ్చినప్పుడు, బాబాయే అనువైన ప్రదేశం ఎంపికచేసి ఆగమనేవారు. మామూలుగా ఫలవృక్ష భరితమైన పళ్ళతోటో, మామిడితోటో, లేదా ఆరుబయట పొలమో ఎంపికచేసేవారు. అది చీకటిపడే సమయానికి వారుండే ప్రదేశంపై ఆధారపడి వుండేది. అప్పుడు సహచరులు తలా ఒకవైపుకు బాబా అజ్ఞానుసారం ఆ రాత్రి కవుసరమగు ఆహారాన్ని బిక్షమెత్తిసేకరించాలి.

వారు గనుక, ఒకవేళ ఏదైనా గ్రామంగానీ, పట్టణంగానీ, ప్రయాణించుట తటస్థిస్తే తన బృందానికి అవుసరమగు ఆహారం బిక్షమెత్తి సమకూర్చమని సౌంజ్ఞ చేసేవారు. గ్రామస్తులు ఏది యిచ్చినా తిరస్కరించక స్వీకరించాలి. ఫలానా ఆహారం పెట్టమని అడుగరాదు.

వారికేది కావాలన్నా బిచ్చమెత్తి యాచించాలేకానీ, సమీపంలో పొలాలలో లభ్యమయ్యే పళ్ళూ. కాయలు వగైరాలు కోసుకొని దొంగతనానికిమాత్రం వడిగట్టేవారుకారు. యితరుల సొత్తు దొంగిలించుట ఘోరమగు అపరాధం.

మామూలుగా ఒక రిద్దరు శిష్యులు, సమీప గ్రామానికి భిక్షాటనకై వెళ్లాలి. ఆహారమంటే, వండిన పదార్థాలుగానీ, పిండిగానీ గింజలు కానీ ఏదో ఒకటి సేకరించాలి.

చెట్లకొమ్మలు, పుల్లలు ఏరి రాత్రి మంటకు తెచ్చుట ఆడవారివంతు. అయితే యీ భిక్షాటనా కార్య క్రమాన్ని తన శిష్యుల యెడల ఎలా సుగమం చేశారో తెలుసుకుందాం. యింతకు ముందే చెప్పినట్లు, ఎప్పుడూ బాబాను అంటి పెట్టుకొని వుండుట ఈరుచ్ విధి.

ప్రతి రోజూ వుదయం కాగానే వారి ప్రయాణం ఆరంభమయ్యేది. బాబా ప్రక్కనే అంటి పెట్టుకొని నడచుట ఈరుచ్ వంతు. వారిరువురికి వెనుక కొంచెం ఎడంగా ఆడవారు నలుగురు నడిచేవారు. వారివెనుక అల్లంత దూరంలో తక్కిన సహచరులు నడిచేవారు,

ఉషోదయంతో ప్రాతఃకాలం కాగానే ప్రయాణమయ్యేవారు. అది ఎంతో ఆనందంగా వుండేది. ఉషఃకాల కాంతులలో బాబాతో ప్రయాణం చేయడం శిష్యులకెంతో ఆహ్లాదాన్ని కలిగించేది. యీ ప్రపంచమందలి మానవులందరి కంటే తామే, ఏకైక స్వాతంత్ర్య వ్యక్తిగా వుప్పొంగి పోయేవారు.

వారాయనను దైవ మానవునిగా తలపక పోయినా, భగవంతుని సన్నిధిలో వున్నామన్న భావమే వారి నరనరాన కనిపించేది. అది నిజాని కెంతో ఆనందప్రద విషయం. ఎక్కడో దూరంగా ఆకాశంలో ఎగిరే పొగచూపి " ఆ పొగ వచ్చే చోట తప్పక అగ్ని రాజుతూ వుండాలి. బృందాని కవుసరమయ్యే ఉదయ ఫలహారం, బిచ్చమెత్తి తెమ్మ''ని సౌంజ్ఞలు చేసేవారు.

శిష్యులలో యిరువురు పొలాల కడ్డంపడి, పొగ వచ్చే దిశగా వెళ్లి భిక్ష యాచించి, ఆయన ఆజ్ఞపాలించేవారు. శిష్యులుగా అది వారి కర్తవ్యము. యింకా ఆజ్ఞలెలా వుండేవో చూడండి ! అలా గ్రామాన్ని చేరిన శిష్యులు యాచన పూర్తిచేసి, ఆహారం సేకరించి,పరుగు పరుగున వెనుతిరిగి అల్లంత దూరంలో రోడ్డంట నడక సాగిస్తున్న బాబా బృందాన్ని చేరుకోవాలి.

భిక్షార్థియై వెళ్ళిన శిష్యులు తిరిగి వచ్చు వరకూ తమ గమనాన్ని ఆపేవారుకారు. ఆయన అలా ముందుకు సాగుతూనే వుండేవారు. భిక్షకోసరం వెళ్ళినవారు, తమకు వప్పగించిన విధిని సక్రమంగా పూర్తి చేసి తిరిగి బాబాను చేరుకోగలగాలి. వారెంతో వేగంతో పరుగులిడుతూ, యింటింటా బిచ్చమెత్తి, బాబాకు, మహిళలకు, తక్కిన సహచరులకు సరిపడా ఆహారాన్ని భిక్షగా సేకరించాలో, లేక తమ ఏకాగ్రతను సడల నీయక, భిక్షాటనయందే లగ్నంచేయాలో, మనం వూహించుకోవచ్చును.

బాబా తన పరివారంతో ముందుకు సాగిపోతుంటే, భిక్షకెళ్ళినవారు తిరిగి తమ బృందాన్ని కలవగలనా లేదా అని ఆలోచిస్తూ కూర్చుంటే, మరి భిక్ష సేకరించేదెప్పుడు ? వారి ఏకాగ్రతకిదో పరీక్ష. అన్యచింతన లకు తావీయక. భగవదాజ్ఞలకు బద్ధులై బాబా ఆజ్ఞలు పాటించేవారు.

ఈలోగా బాబాతో సంచరించే సహచరులుకూడ వారికి అవకాశం వచ్చినప్పుడు, అలాగే యాచించవలసివుండేది. ఎక్కువగా, యాచించే అవకాశం ఈరుచ్ కే దొరికేది. ముఖ్యంగా ఉదయ ఫలహారభిక్షలో పాల్గొనే అవకాశం యితనికే వచ్చేది. ప్రొద్దుటే అల్లంత దూరాన, గగన వీధిన క్రమ్ముకున్నపొగ చూడగానే దైవమానవుని జఠరాగ్ని వుద్రేకించేదో ఏమో, వెంటనే ఈరుచ్ ని పిలిచి, ముందుకుపోయి, యాచించి రమ్మనే వారు.

# భిక్షుక జీవనం

ఈ ఉదయ ఫలహారాన్వేషణకు సంబంధించిన ఒకటి రెండు సంఘటనలు చర్చించుకుందాం. నేనింతకు ముందే విశదపరచినట్లు ఈరుచ్ భిక్షార్థియై వెళ్ళినప్పుడు అతడు తిరిగివచ్చేవరకు ఆగి ఎదురుచూచే అవకాశం బాబా యిచ్చేవారుకారు. ఆయన కదలిపోతూవుంటే, ఆయన వునికి తన దృష్టికి కనుమరుగు కాకుండా, త్వరితగతిన భిక్షాటన పూర్తి చేసేవాడు.

ఒకవేళ ఎప్పుడైనా భిక్షాటన ఆలస్యమైతే, వూరు దాటింతర్వాత, అతని రాకకై ఎదురుచూస్తూ బాబా, పరివారంతో ఆగేవారు. సాధారణంగా భిక్షాటనకై వూళ్ళోకి వెళ్ళేప్పుడు, అడ్డదారంట త్వరగా కానిచ్చేందుకు పంపేవారు. లేదా అతని రాకకెదురుచూస్తూ ఆగేవారు. అలా తన రాకకొరకు ఎదురుచూస్తూ ఆగే అవకాశం యివ్వరాదనే వుద్దేశ్యంతో యీరుచ్ తన పని త్వరగా ముగించుకొచ్చేవాడు.

భిక్షాటన సమయంలో బాబా గురువైన ఉపాసినీ మహారాజు చెప్పిన కథమీద తన మనస్సు కేంద్రీకరించేవాడట. ఈరుచ్ తన తల్లితో మహారాజు ఆశ్రమంలోవుండే రోజులలో, ఒకసారి మహారాజు ఓ కథ చెప్పారట. నిజానికది కథకాదు, ఓ సలహా.

ఎప్పుడైనా శిష్యులు ఆహారాన్వేషణలో, భిక్షాటన చేయవలసివస్తే, వారెన్నడూ, గృహస్థు ఇంటిముందు యాచించవద్దని, దొడ్డి గుమ్మంలో భిక్ష అడగమని చెప్పారట. ఎందుచేతట ? ఇంటిముందు పురుషులుంటారు. దొడ్డి గుమ్మంలో స్త్రీ లుంటారు. దొడ్డి గుమ్మమంటే వంటిల్లు కదా! స్త్రీ లుండేది వంటింట్లోనే కదా!

సాధారణంగా స్త్రీలది సౌమ్య స్వభావం. ఆదరణ వారి సొత్తు. యింటి ముందు యాచిస్తే పురుషులు తారసపడి, యీసడించుకొని, దుయ్యబట్టి పారదోలుతారు. పెరటి గుమ్మంలో అయితే స్త్రీలు అంత నిష్కర్షగా తిరస్కరించరని బోధించారట. ఆ నాడు ఉపాశినీ చెప్పిన భావాన్ని ఈ నాటికీ శాశ్వతంగా గుర్తుంచు కున్నాడు యీరుచ్.

భారతావనిలోని, అనేక కుగ్రామాలలో యీ నాటికీ చాలా ఇళ్లకు వెనుక ముందు ద్వారాలే వుండవు. అసలు తలుపులంటూ వుంటే అదే ఓ గొప్ప. ఏమైనప్పటికీ యీరుచ్ మాత్రం "మా భిక్షా దీజియే" "అమ్మా భిక్షేమైనా పెట్టండి" అని ఆడవారినే పిలిచేవాడు. ఆ పిలుపుతో వారి హృదయాలు చూరగొనేవాడు. లేదనక, వున్నదాంట్లో, అంతో ఇంతో భిక్ష పెట్టేవారు. వృద్ధురాళ్ళయితే బయటకు తొంగిచూచి, ఆ తరువాత ఆహారమేదైనా పెట్టేవారు.

అప్పుడప్పుడూ, వ్యవసాయదారుల యిళ్లలో,తమ కోసరం చేసుకున్న వేడి వేడి జొన్నరొట్టెలు భిక్షగా పెట్టేవారు. అలా వారానాడు ఆ రొట్టెల తోపాటు వేడి వేడి కూరలు కూడ వండి పెడతాం కాసేపు ఆగమని కొందరు కోరేవారు. ఇది ఎవరి ఆంతరంగిక ప్రేరణో ! వారలా ఆప్యాయత చూపి జోలె నింపుతుంటే, ఈరుచ్ ఆశ్చర్యపోయేవాడు. భిక్ష అడుగగానే ఒక్క ప్రశ్న కూడ వేయక, పెట్టేవారు.

చాల అరుదుగా ఎప్పుడన్నా ఎవరో ఒకరు మాత్రం, " ఎవరు మీరు ? మీదేవూరు ? ఎక్కడుంటారు ? ఏ వూరు వెళుతున్నారు ? " అని ప్రశ్నించేవారు. అన్నిటికీ క్లుప్తంగా 'మేము వుత్తరాదికి పోతున్నామని' ఒక జవాబు చెప్పేవాడు యీరుచ్. మరొకప్పుడు మీరెంతమంది ? నీవు ఒక్కడివేనా ? యింకా ఎవరైనా వున్నారా ? అనడిగేవారు. మరి కొందరు

"నాయనా ఇంత పిన్నవయస్సులో వైరాగ్యం కలిగిందేమి ? యీ ప్రాపంచిక చింతన ఏల త్యజించితివయ్యా ?" అని ఆశ్చర్యపోయేవారు.

అందరికీ తానొకే జవాబు చెప్పేవాడు, తానొక సహచర బృందంతో బయలుదేరానని, తామంతా సన్నిహితులమని; తన బృందానికో నాయకుడు న్నాడని, ఆయనను తామంతా "పెద్దన్నయ్య" అని పిలుస్తామని చెప్పేవాడు. బాబా నవజీవన కాలంలో తమపేరు ఎవరికీ చెప్పరాదని శాశించారు, అందువలన, సహచరులంతా ఆయనను తమ బృంద నాయకునిగానో పెద్దన్నయ్యగానో వ్యవహరించేవారు.

భిక్షలో రొట్టె, వండిన కూరలు పెట్టేవారు. అలా యాచించిన భిక్షను యీరుచ్ దైవ మానవుని చెంతకు చేర్చేవాడు. అలా సమర్పించ బడే ఆహారమేమిటో గమనించండి. ఒక్కొసారి బృందమంతటికీ సరిపడ ఆహారం ఒనగూడేది. ఒక్కొసారి కొంచెం స్వల్పంగా లభ్యమయ్యేది.

అలా సమర్పించేదేదైనా సరే మారుపలకక, స్వీకరించమని బాబా ఆజ్ఞ. అలా వారికి కావలసినంత సమృద్ధిగా సేకరించిన తరువాత, యీరుచ్, తన బృందం ఏ మార్గం గుండా పయనిస్తున్నారో వెతుక్కుంటూ పరుగులు తీసేవాడు. అలా పరుగిడి వారిని చేరగానే, బృందమంతా ఒక చోట పోగయ్యేవారు. మహిళలు బాబా సన్నిధిలోవుంటే, పురుషులు కొంచెం దూరంలో అగేవారు.

భిక్షలో వచ్చిన నానారకాల పదార్థాలను బాబా తీసుకొని, అన్నీ కలిపేసి, తన స్వహస్తాలతో చిన్న చిన్న ముద్దలో ముక్కలోచేసి, అందరికి సమంగా పంచేవారు, అలా మనిషికి రెండేసి ముద్దలే పంచినా, అవి బాబా దివ్య హస్తాలతో పంచబడినందున కాబోలు, సహచరులకు సుష్టుగా భోం చేసినంత తృప్తి కలిగి, ఆకలితీరేది. అంటే పెట్టిబడినది కొంచమే అయిన ఎక్కువ తిన్నంతతృప్తి కలిగేది. వేడి వేడి రొట్టె, వేడి కూర, అందునా

దైవమానవుని చేతిమీదుగా పంచుట ! యింకేమని చెప్పాలి ? శిష్యుల జఠరాగ్ని పూర్తిగా చల్లారేది. ఆకలి తీరేది

ఫలహారానంతరం అప్పుడప్పుడు ఎవరైనా చెరకు ముక్కలు సమర్పిస్తే అవికూడ తలా ఒకటి పంచేవారు. వాటిని బృందమందరికీ సరిపోయే విధంగా చిన్న ముక్కలు ఆయనే చేసి స్వయంగా పంచేవారు. అవికూడ తిన్నాక మళ్లీ నడక సాగించేవారు.

## ప్రేమ భిక్ష

హృదయం చలించే సంఘటనొకటి వుంది. చెబుతాను. బాబా యీరుచ్‌ని సాధారణంగా భిక్షాటనకు పంపేవారని చెప్పాను కదా ! అప్పుడు ఈరుచ్, అది ఒక చిన్నపల్లె అయితే గుడిసె గుడిసెకూ వెళ్లి యాచన చేసేవాడు. ఒక చోట చిన్నరొట్టె దొరికితే మరోచోట కూర దొరికేది, అలా యింటింటికి తిరిగి ఎంతోసేపు గడిపేవాడు. ఎందుచేత ? బాబాతో వున్న 20 మంది సహచరులకు సరిపడిన ఆహారం సేకరించాలి కదా ! కనీసం మనిషికి రెండు ముక్కలన్నా రొట్టెలు దొరికే వరకూ బిచ్చమెత్తేవాడు. అంత ఆహారం దొరకాలంటే రెండు మూడిళ్లు తిరిగితే చాలదు. వూరంతా తిరగాల్సి వచ్చేది.

ఒక రోజున రోజూలాగానే, బాబా ఆదేశం మేరకు సమీప గ్రామంలో భిక్ష నర్థిస్తున్నాడు. మొదటిల్లు ఓ వృద్ధురాలిది. యితడామె యింటికి వెళ్లేసరికి ఆమె గుమ్మంలోనే పడుకొనివుంది. గుమ్మం చేరగానే "మా ! భిక్ష పెట్టండి ! " అన్నాడు. ఇక్కడ భిక్ష అంటే దానికి సరియగు అర్థంలేదు, భిక్ష అంటే, ఆహారమే కాదు ఒకరు కోరినప్పుడు, అవతలివారు ఏది సమర్పించినా, అది భిక్షే ! భిక్ష అంటే ముష్టి అని అర్థంకాదు.

భిక్ష అంటే, పక్వాహారం కావచ్చును. అపక్వాహారం కావచ్చును అన్నం, రొట్టె, కూరలు; పిండి, గింజలు, పంచదార, వెన్న, పళ్లు,కాయలు ఏవైనా భిక్షలే! భిక్షాటన సందర్భంలో బాబా యాచించే విధానం "మా! ప్రేమ్‌సే భిక్షా దీజియే" అనమన్నారు. "మా!" అంటే "అమ్మా" "ప్రేమతో భిక్షము పెట్టు" అంటే, అందలి గూడార్థం చూడండి!"అమ్మా! ప్రేమతో నీ యిష్టంవచ్చింది పెట్టు" అని దీని అర్థం–శిష్యులంతా భిక్షాట నలో ఆ విధంగా అర్థించేవారు.

మరి ఆ రోజు ఉదయం యూరుచ్, గుమ్మంలో పడుకున్న వృద్ధు రాలిని భిక్ష అడుగగానే, ఆమె గబగబా లేచింది.

"ఉండు నాయనా, కొంచం సేపాగుము. ఏమైనా పెడతాను" అన్నది. లోనికివెళ్ళి యింట్లోవున్న పెట్టెలు, డబ్బాలు మూతలుతీసి చూచింది. అన్నీ ఖాళీగా కనపడినయి. ఏ ఒక్క పెట్టెలోనూ ఆహార పదార్థం దొరకలేదు. హతాశురాలై బిక్కవోయిన ముఖంతో బయటకు వచ్చి, యూరుచ్‌ని అక్కడే కూర్చోమనిచెప్పి, ఆమె స్వయంగా పక్కిళ్ళల్లో యాచనకై వెళ్ళింది.

అలా ఆ బజారులోవున్న ఇళ్ళన్నీ తిరిగి, సమృద్ధిగా ఆహారాన్ని సేకరించి, తెచ్చిందంతా ఊరుచ్‌కి సమర్పించింది. ఆమెవద్ద తనదంటూ ఏమీ లేనప్పటికీ, భిక్షార్థియై వచ్చిన వ్యక్తిని రిక్తహస్తాలతో పంపుటకు మనస్కరించక, తానే స్వయంగా యాచించి తెచ్చిపెట్టింది.

ఆహా! ఎంతటి అద్భుతలీల. ఆ వృద్ధురాలానాడు దైవమానవుని ఆకలి తీర్చుటకు, ఆయన జఠరాగ్ని చల్లార్చుటకు, ఆయన సేవా కార్య క్రమంలో పాలుపంచుకొనుటకు, ఆయన బృందానికి కడుపార ఆహారం సమకూర్చుటకు పంపబడిన యూరుచ్‌కి బదులుగా తానే స్వయంగా, దైవ

మానవుని కొరకై తనకు తెలియకుండానే యాచించి, ఆహారం సేకరించి సమకూర్చిన ధన్యజీవి. ఆ వృద్ధురాలు ఎంతటి అదృష్టవంతురాలు!

ఈరుచ్ కూడ, తాను వచ్చువరకూ అక్కడే వుండమని ఆ వృద్ధురాలు కోరిన కోరిక, బాబా ఆజ్ఞగా భావించి, అలాగే వుండిపోయాడు. కాసేపటిలోనే, ఆ వృద్ధురాలు సేకరించి తెచ్చిన రొట్టెలు, వేడి వేడి కూరలు, ఘుమఘుమలాడే పచ్చళ్ళు అతనికి సమర్పించి తీసుకెళ్ళ మన్నప్పుడు అమితాశ్చర్యపోయాడు.

అలా సమర్పించిన ఆహారంతో యీరుచ్ బాబా చెంతకుచేరి జరిగినదంతా వివరించాడు, ఆయన ఆనందంతో పుప్పొంగిపోయారు. ఆయన వెనుకే వస్తున్న మహిళలను, ఆ వెనుకవున్న పురుషులను ఒక్క క్షణం ఆగమని ఆదేశించారు. రోడ్డుప్రక్కనేవున్న పెద్ద బండరాయిపై కూర్చొని, దైవమానవుని కొరకు స్వయంగా వృద్ధురాలు యాచించి పంపిన ఆహారం గురించి అంతా వివరంగా సౌంజ్ఞలతో చెప్పారు.

# మహాప్రసాదం

మరోరోజున వేరే సంఘటన జరిగింది. ఆనాడు సహచరులు వెంటరాగా, అలా రోడ్డంట బాబా శిష్యగణంతో నడుస్తూన్నారు. సాయం కాలమైంది. ఆరాత్రికి మకాంచేయాల్సిన స్థలాన్ని బాబాయే నిర్ణయించారు. భిక్ష సేకరించి తెమ్మని ఈరుచ్‌ని పంపారు. పోతూ దారిలో, "యీవేళ మరింత పప్పు అన్నం తేవాలని" మనస్సులోనే సంకల్పించాడు. పప్పు, అన్నం అంటే బాబాకు యిష్టం. పప్పు సాత్వికాహారంకూడ. అది దొరికిన నాడు, ఎంతోయిష్టంగాతినేవారు. కాని భిక్ష అర్థించేప్పుడు ఫలానా పదార్థం పెట్టండని వత్తిడి చేయడం లేదు.

చీకట్లో యీరుచ్ వూళ్లోకి చేరాడు. పరిసరాలు పరిశీలించగా అది సంపన్నమైన గ్రామంలా కనపడింది. తనకు పప్పులు బియ్యం కావలసినంత సమృద్ధిగా సేకరించగలననే భావన కలిగింది. నిజానికారోజు, బృందంలోని వారంతా ఆకలితో నకనకలాడుతున్నారు.

బృందాని కంతకూ సమృద్ధిగా సరిపడిన ఆహారం సంపాదించాలనే తలంపుతో యీరుచ్ వీధి వీధికి తిరుగుతున్నాడు. ఒక సందు చివర, ఓ మనిషి ఈరుచ్‌ని ఆపాడు. ఆయన వెంట యిద్దరు ముగ్గురు వ్యక్తులున్నారు. అతడు వయోవృద్ధుడు. ఈరుచ్‌ని ఆలింగనం చేసుకొని, చెక్కిలిపై ముద్దాడి, "ఓ యువకుడా ! తొందరగా పోతున్నా వెక్కడికి ?" అని ప్రశ్నించాడు. 'నేను నా బృందానికై ఆహారం యాచించుటకు పోతున్నాను' అన్నాడు.

"ఓ, బిడ్డా ! నీ వేషం చూస్తే సర్వసంగ పరిత్యాగిలా వున్నావు. నీవెందులకిలా బయలుదేరితివి ?" "అది మా అగ్రజుని అభీష్టం, నాకూ ఆనందమే !" "అయితే ఇంత చిన్నవయస్సులో నీ కింతటి వైరాగ్య భావం అబ్బుట అద్భుతం. నీ వెంతటి అదృష్టవంతుడవయ్యా !"

"మంచిది. యీ మాత్రం నాకూ తెలుసు. నేనిప్పుడున్న బృందంతో వున్నంత మాత్రం చేతనే నేనెంతో అదృష్టవంతుడిని." అనుకుంటూ ముందుకు సాగాడు. అంతనా వృద్ధుడు యీరూచ్‌ని వెనుకకు పిలచి "నాయనా వేగిర పడకుము. మా యింటికి పోదము రమ్ము. నీకు కావలసిన ఆహారం సమకూర్చెదను" అని తన యింటికి తీసుకువెళ్లాడు.

నూనె, మసాళా దినుసులు, పోపుసామాను, పప్పు, వుప్పు; చక్కెర బియ్యం, తదితర సరుకులు, చక్కని షడ్రసోపేతమైన విందు భోజనానికి సరిపడినన్ని సామానులు తెచ్చి యిచ్చాడు. వాటికి తోడు వండుకుందుకు

వంటచెఱకు మోపులు కూడ సరఫరా చేశాడు. ఆ తరువాత మరోసారి ఆలింగనం చేసుకొని యిలా చెప్పాడు.

"బాబా ! నాదో చిన్న కోరిక వున్నది. చెప్పమనెదవా ?" అంటూ "మీ యాత్ర పూర్తికాగానే దయవుంచి నీవు మా యింటికి తిరిగి వచ్చి కుమారునిగా, నాతో వుండగలవా ?" అని అభ్యర్ధించాడు. అందుకు తానేమీ మాట యివ్వజాలనని చెప్పి, అతడిచ్చిన ఆహారపదార్ధాలన్నీ మోసుకొని బాబా చెంతకు చేరాడు.

ఇక్కడ చూడండి ! ఊరుగాని ఊరు. అపరిచిత వ్యక్తితో సమావేశం. అది హృదయానికి హత్తుకుపోయే సన్నివేశం. మరి ఆ అపరిచిత వ్యక్తి, ఈరూచ్‌ని ఎందుకు అంతగా అభిమానించాడో దురూహ్యం. కానీ అతడు బాబా బృందాని కంతటికీ సరిపడిన రోజు గ్రాసం సరఫరా చేశాడు.

అపరిచితుడిచ్చిన సరుకులన్నీ తీసుకొని ఈరూచ్ బాబా వద్దకు తెచ్చి జరిగినదంతా చెప్పాడు. అంతా విన్నాక, ఎంతో అప్యాయతతో, వంటచేయించి, మహాప్రసాదంగా అందరికీ పంచిపెట్టించారు.

## అంతః ప్రేరణ

స్త్రీలకు జరిగిన అనుభవాలు చూద్దాం. మణిజా యిరానీ తన అనుభవాన్ని మరో విధంగా చెప్పింది. ఆడవాళ్లు నవజీవనంలో నడక సాగిస్తున్నప్పుడు వారికి ముందుగా బాబా ఈరూచ్‌లుండేవారు. కొంచెం వెనుకగా మణీ, మెహరా, మెహ్రూ, గోహెర్ లుండేవారు. చలిలో తెల్లవారుఝామున లేచి, కాలినడక సాగించేవారు. చలి గడగడలాడించేది. ఆడవాళ్లు మాత్రం కోట్లు ధరించుటకు అనుమతింప బడ్డారు.

అయితే వారు కోటు ధరించినా, వుధృతమైన చలికి తట్టుకోలేక పోయేవారు. చలికి వారి వ్రేళ్లు కొంకర్లుపోయేవి. బిగుసుకొని తిమ్మెర్లెక్కేవి. అయినా బాబాతో నడక సాగిస్తే ఎంతో ఆహ్లాదంగా వుండేది. పసుపు పచ్చ పూలతో కళకళలాడే ఆవచేలు దాటుకుంటూ నడుస్తుంటే ఎంతో ఆనందంగా వుండేది.

ఆరున్నర, ఏడు గంటలమధ్య, సర్వసాధారణంగా, గ్రామీణప్రాంత ప్రజలు తమ ఉదయపు ఆహారాన్ని తయారుచేయడం ప్రారంభిస్తారు. అదే సమయానికి, స్త్రీల బృందానికి కూడ ఏమన్నా తినాలనిపించేది. ఇదంతా సోదరి మణి చెప్పిన అనుభవం వ్రాస్తున్నాను.

అయితే వారు బాబా యిచ్ఛపై ఆధారపడి వుండేవారు. ఒకసారి యూరూచ్‌తో నడుస్తున్న బాబా అతనిని ముందు నడుస్తూవుండమని వదిలేసి, వెనక్కుతగ్గి స్త్రీలనుచేరి, వారితో కాసేపు సంభాషించి "ఆకలిగా వున్నదా?" అన్నారు. "అవును బాబా!" అని నలుగురూ ముక్త కంఠంతో చెప్పారు, అంత తటాలున బాబా, ఒక్క అంగలో ఈరూచ్‌ని చేరి, వెంటనే సమీప గ్రామంలో ఆహారాన్ని సేకరించి తెమ్మని పురమాయించారు.

ఈరుచ్ తిరిగి వచ్చేవరకూ, ప్రయాణాన్ని ఆపేసి స్త్రీల చెంతనే కూర్చున్నారు. వారంతా కూర్చొని, కూర్చొని దాదాపు గంట గడిపారు. అంతలో అల్లంతదూరాన వస్తున్న యూరుచ్‌ని బాబా గమనించారు. స్వయంగా ఎదురెళ్ళి, అతడు తెస్తున్న ఆహారపు జోలె అందుకున్నారు. జోలెలోవున్న పదార్థాన్ని స్త్రీలకు తలాకాస్త పెట్టారు.

ఆ తరువాత ఆ ఆహారం ఎలా సేకరించబడిందో వివరించమని ఈరుచ్‌ని అడుగగా అతడిలా వివరించాడు. పొలంగట్లవెంటపడి ఊళ్ళోకి

చేరగానే, ఊరి మొదట్లో ఒక గుడిశ తారసపడింది. ఇంటిముందు శగ కాచుకునే కట్టెలగుట్ట మండుతున్నది. ఆ చెంతనే నిప్పులమీద ఒక స్త్రీ రొట్టె కాలుస్తోంది. అప్పటికే ఒక దొంతర రొట్టెలు తయారైనయి.

గుమ్మం ముందుకు యీరుచ్ రాగానే "ఏం నాయనా? ఏం కావాలి?" అనడిగింది. "మా! భిక్షా దీజియే" అన్నాడు. "అయితే కాసేపు వుండు బాబూ! రొట్టెలు కాలుతున్నాయి పెడతాను" అంది. ఆ సమయంలో ఆమె కాలుస్తున్న రొట్టెల పరిమాణం యీరుచ్ మెదడులో కదిలాయి. ఒక కుటుంబానికి రోజంతా తినడానికి సరిపోతాయి అనుకున్నాడు. నిజానికవన్నీ వారి ఉదయ ఫలహారానికే. మనమైతే ఏవో రెండు ముక్కలు నంజుకుతిని టీ త్రాగేస్తాం. దానితో ఉదయ ఫలహారం పని అయిపోతుంది.

వారు కూలీ నాలీ చేసుకు జీవించేవారైనందున, క్రితం రోజు సంపాదనతో కొనితెచ్చుకున్న పిండి వగైరాలతో ఉదయాన్నే రొట్టెలు చేసుకొని కడుపార భుజించి, పనికి వెళ్ళిపోతారు. పాపం వారింట ఆనాటికి సరిపడినంత ఆహారం మాత్రమే వున్నది. మరి అంతకుమించి వారింట మరే ద్రవ్యమూ లేదు. అయినప్పటికీ ఆమె, దాదాపు రెండు దొంతర్ల రొట్టెలు, వాటికి సరిపడినంత కూర వేడి వేడిగా చేసి యీరుచ్‌కి భిక్షగా యిచ్చివేసింది.

యీరుచ్ చెపుతున్నదంతా విన్న తరువాత ఆయన అమితానంద పడ్డారు. ఆయన హృదయంలో యీ సంఘటన బాగా హత్తుకుపోయింది. "బాగున్నాయా? రుచిగా వున్నాయా?" అని మాటిమాటికీ పదేపదే అడిగి, వారిచేత తినిపించారు. నిజానికవి ఎంతో రుచిగా వున్నయి. అంతకుమించి వేడిగా వున్నయి. శీతాకాలంలో ప్రొద్దున్నే రోడ్డుప్రక్క

కూర్చున్న వీరికి, అలాంటి వేడివేడి ఆహారం దొరికినప్పుడు, అంతకంటే కోరుకొనే దేముంటుంది ? బజారులో దొరికే నిలవవున్న రొట్టె వెన్న తినేకంటే, వేడివేడి రొట్టె,కూర, బాబా స్వహస్తాలమీదుగా వడ్డించినప్పుడు, దానిని మించిన ఆహారం యింకేముంటుంది ?

# హృదయ పరివర్తన

దీనికి విరుద్ధంగా బాబా వేరొక సందర్భంలో కాకా, నీలూలను, భిక్షాటనకై పంపారు. సహచరులంతా ఒక పట్టణపరిసరములు చేరి ఆ రాత్రికి అక్కడ మకాంవేశారు. యథాప్రకారం, ఒక ప్రత్యేక ప్రదేశం, మామిడి తోటలో విడిది చేశారు. అది చాల విశాలమైన తోట. బృంద మంతటికీ వాసయోగ్యమైనది.

మండలి ఎప్పుడూ ఆకాశాన్ని కప్పుగా చేసుకొని, చెట్లక్రిందే పడుకొనే వారు. ఆడవాళ్లు మాత్రం రాత్రిళ్లు నిద్రించుటకు గూడుబండి (కారవాన్) ఎక్కేవారు. రోజూ మాదిరే, యీనాడు భిక్షాటన, నీలూ, కాకాల పంతైంది. వారిరువురు నవజీవనపు దుస్తులు ధరించారు. అది బాబా ఆజ్ఞ. ఆయన ఏమి చేయమన్నా చేయాలి. అందుకే వారు బారుగౌను, తలపాగా ధరించారు

న్యాయానికి వారు ముష్టివారు కారు. వంశపారంపర్యా స్థితి మంతులు. అయినా బాబా చెప్పిన దానిని తు . చ . తప్పక ఆచరించేవారు. ఆనాడు చలి ఎక్కువగా వున్నందున, మామూలుగా ధరించిన బట్టలమీద, వారికున్న వుడుపులన్నీ ఒక దానిమీద ఒకటి వేసుకున్నారు. దారిలో భిక్షగా పాత స్వెట్టరు, కోటు ఎవరో యిచ్చారు. అవి కూడ ధరించారు. వాటిపై బారుగౌను, నెత్తిన తలపాగా పెట్టుకున్నారు.

అసలు వీరిద్దరూ మంచి బలాఢ్యులు. బక్క చిక్కన రకంకాదు. చాల అందంగా ఆరోగ్యంగా వుండేవారు. బహు బలశాలురు. గుండ్రంగా బంతిలాగా వుండేవారు. అసలే బలిసినట్లుండే వారు తమకున్న గుడ్డలన్నీ ఒకదానిపై ఒకటి వేసుకొనేసరికి వస్తాదుల్లా కనపడుతున్నారు.

వారు భిక్షార్థులై నగరంలో ప్రవేశించే సరికి ప్రజలనుండి తీవ్ర తిరస్కారాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఒకరింటి ముందాగి భిక్షనర్థించారు. "మా ! భిక్షా దీజియే !" అన్నారు. గృహయజమాని బయటకు వచ్చి వారి తీరు చూచి కోపోద్రిక్తుడైనాడు. "ఏం ! దున్నపోతుల్లా వున్నారు, ముష్టెత్తుకోడానికి సిగ్గులేదూ ? వస్తాదులకు మించిన అవయవసౌష్టవం వున్నది. చదువుకున్న వాళ్లలా వున్నారు ఏమిటి మీ సంగతి ? ఎప్పైనా ప్రయత్నం చేసి వుద్యోగం సంపాదించ వచ్చును గదా ! అడుక్కోవడం తేలికై పోయింది. బలసిన ఏనుగుల్లా వున్నారు. కష్టించి, శ్రమపడి సంపాదించుకోవచ్చు గదా ! పొండి పొండి, ఎక్కడైనా కుస్తీ పోటీలు పెట్టి డబ్బు సంపాదించుకోండి ?" అని తరిమికొట్టాడు.

ఆనాడు వారే యింటికి వెళ్లినా ఆ నగరంలో అలాంటి జవాబులే ఎదురైనాయి. మీరు వస్తాదులుగా పనికి వస్తారు కానీ, ముష్టివారుగా పనికిరారని తేల్చిపారేశారా పూరిజనం. తుదకు రిక్తహస్తాలతో మకాం తిరిగి చేరారు. కాకా మాత్రం, అంతా బాబా యిచ్ఛ అని జరిగిన దానిని చాలా తేలికగా తీసుకున్నాడు. కానీ నీలూ పరాభవం పాలయ్యానని చింతించాడు. అతడొక బ్రాహ్మణ యువకుడు. తన వంశాచారాన్ని, సాంప్రదాయాన్ని జ్ఞాపకం చేసుకొని అవమానం పాలయినట్లు పరితపించాడు.

ఇక్కడ నీలూ బాధ తాను బ్రాహ్మణుడుగా అవమానింపబడి నందుకు కాదు. తానొక బ్రాహ్మణుడుగా, కనీసం హిందూ మత సాంప్రదాయానుసారం, సాక్షాత్తు పరమేశ్వరుడైన బాబా కొరకు ఆహారాన్వేషణలో వెళ్లి

విఫలుడనై, ఏమీ సంపాదించలేకపోతినే అని బాధ. అంతేకాని, బాబా యిచ్చిన కఠోరనియమాన్ని వుల్లంఘించి ఆయన సమక్షంలో విచారవదనం తో వుండుట క్రిందకు రాదు.

ఈ సందర్భంలో మనం తెలుసుకొనవలసింది కొంత వుంది. హిందూ సాంప్రదాయానుసారం, హిందువులు తమ మతగ్రంథములపైన ఆచార వ్యవహారములపైన ప్రాముఖ్యాత వహించి, అతిధి మర్యాదలకు అత్యంత విలువ యిస్తారు. అతిధి అభ్యాగతి యెడల వారికి ప్రీతి మెండు. యాచకులై తమ ముంగిట వచ్చిన వారిని, తిరస్కరించి లేదని ఎన్నడూ త్రిప్పి పంపరు,

అలా ఎందుకు త్రిప్పి పంపరంటే, వారికో ప్రగాఢ నమ్మకమొక టున్నది. ఏదో ఒకరోజున జగద్రక్షకుడు, ఆ పరమేశ్వరుడు, సాక్షాత్తు భగవంతుడు, మానవరూపంలో, తమయింటికి భిక్షకోరి తప్పక వచ్చునని వారి నమ్మిక. అందుకే, అవతారులవతరించి, వందలకొలది సంవత్సరాలు గడిచినా, మళ్ళీ భగవంతుడు, మానవరూపధారియై ఏదో ఒకరోజున తమ ముంగిట దర్శన మిస్తాడనే వూహతో ఎదురుచూస్తారు. భిక్షార్ధులై వచ్చే ముష్టివారు, సాధువులు, సన్యాసులు, వారెవరైనా సరే, నిజమైన వారా ? మోసకారులా అని ఆలోచించక; ప్రతివారికీ, లేదనక, తమ కున్నదాంట్లో భిక్షపెట్టి పంపుట వారి సాంప్రదాయం.

ఏదిఏమైనా సరే లేదుపొమ్మనరు. యిది పూర్వాచారం. ఎందుకంటే, ఏమో ? ఎవరు చెప్పగలరు ? భిక్షార్ధులై వచ్చేవారెవరో ? ఏరోజున ఎవరు వస్తారో ? ఎవరు చెప్పగలరు ? బాబా ప్రేమికులుగా మనకో అనుమానం రావచ్చును. బాబా చెప్పినట్లు అవతారుని కాలం 700 సంవత్సరాలకొకసారి వచ్చును, మరి యిప్పుడు భగవంతుడు అవతార్ మెహెర్‌బాబా గా అవతరించాడు. మళ్ళీ ఆయన 700 సంవత్సరములకు గాని మానవ

రూపధారిగా రాడుగనుక అప్పటివరకూ మానవులు ఎవరికీ ఏమీపెట్ట నవసరము లేదా ? అని ప్రశ్న రావచ్చును.

ఇక్కడ ఓ ధర్మసూక్ష్మం వున్నది. భగవంతుడు అవతారుడుగా అవతరించి, బహిరంగంగా తానే అవతారుడనని ప్రకటించిన సందర్భాలు బహుఅరుదు. అంతేకాదు అవతారుని ఆగమనం, నిర్వాణం, సామాన్యునికి విశదం కాదు. అందువలన అనునిత్యం, మనం అలా ఎదురుచూస్తూ, ఆయన రాకకొరకు తితీక్షకులై వుండుట సహజమైపోయింది.

ఈ సందర్భంలో యీరుచ్ మన పౌరాణికాలలోని శబరి కథను చెప్తాడు. కోయ జాతి స్త్రీ శబరి యొక్క యిష్టదైవం రాముడు. ఆయన ఏదో ఒక రోజు తన గుడిశకు వచ్చి, దర్శన భాగ్యం కలుగ జేసి, తన ఆతిథ్యం స్వీకరిస్తాడని నమ్మింది. రాముని రాక కెదురు చూస్తూ రోజులు గడుపుతోంది, ప్రతిరోజూ అడవిలోని ఫలాలు రక రకాలు ఏరి కోసి, తెచ్చి, కొరికి రుచి చూచి, మధుర ఫలాల్ని రాముని రూపంలో తన దైవం రాకకొరకు రోజూ ఎదురు చూచేది.

ఈనాడలా, ఎంగిలి ఫలాలు భగవంతునికి ప్రసాదంగా సమర్పించడమంటే అసభ్యంగా కనపడవచ్చును. మనమలా చేయలేముకూడ. పూజకై వుపయోగించే పూలవాసనకూడ చూడరాదనేది నేటి నియమం. అదేమాదిరి ఆహార నియమం కూడ. నివేదనచేసే ఆహారం శుచిగా, కుడిచేత్తో సమర్పించుకోవాలి. యివన్నీ మన పూర్వ సాంప్రదాయాలు.

కానీ యీ సాంప్రదాయాలన్నీ శబరి విషయంలో విస్మరించబడినయి. నీచజాతికి చెందినదేఅయినా, శబరి సమర్పించిన ఎంగిలి ఫలాల్ని రాముడు అత్యంత ప్రీతితో ఆరగించి తన ప్రేమతత్వాన్ని చాటాడు. అందువలన ముఖ్యంగా యీ సంఘటన వలన మనకు ద్యోతకమయ్యేది ఏమంటే, మన

ఇంటికి భిక్షార్థియై వచ్చే ఏ వ్యక్తినీ రిక్తహస్తాలతో పంపరాదు. ప్రత్యేకించి, ఆహారం అర్థించినప్పుడు యిది చాలా ముఖ్యం. యీ నియమాన్ని కేవలం హిందువులేకాక, భారతదేశంలోని ముస్లింలుకూడ పాటిస్తారు.

# డా. సిద్దేశ్వరనాథ్

ఇంతవరకు భిక్షాటన జీవనంలో సహచరుల అనుభవాలు కొన్నింటిని గురించి తెలుసుకున్నాం. యిహ అసలు కథకు వద్దాం. జనవరి 1 నుండి ప్రారంభం కావలసిన నవజీవనంలో రెండవ ఘట్టం ఏర్పాటు చేయుటకు సదాశివ పాటీలును, బాబాదాసును ముందుగా బెనారసు పంపినట్లు యింతకు ముందే తెలుసుకున్నాం. అక్కడ వారికి నిర్దేశించిన నియమాల ప్రకారం బాబా సహచర బృందాని కవుసరమగు వసతి ఏర్పాటు చేయుటకు వారు పొందిన అనుభవాలు తెలుసుకుందాం.

మిత్రులిద్దరినీ బెనారసు పంపి, షుమారు 40 రోజులపాటు సహచర బృందమంతా విడిది చేయుటకు సరిపడిన బంగళా ఒకదానిని, ఏ అద్దె లేకుండా (ఎందుకంటే వారంతా యాచకవృత్తిలో జీవిస్తున్నారు. వారి వద్ద డబ్బులేదు)ఎవరైనా సమకూర్చ గలరేమో తెలుసుకొని ఏర్పాటు చేయమన్నారు, అంతేకాదు ఆ నలుబది రోజులుకూడ, ఆ వ్యక్తే యీ బృందాని కంతకూ సరిపడిన ఆహారం సమకూర్చాలి. బాబా ఎవరో చెప్పకూడదు వగైరా యివన్నీ నియమాలు. ఆ నియమాలకు లోబడి తగు ఏర్పాట్లు చేసి కబురంపమని చెప్పి వీరిని ముందుగా పంపారు.

విషయాలన్నీ బాగా గుర్తుంచుకొని సదాశివపాటీల్, బాబాదాసులు ముందుగా బెనారసు చేరారు. బాబాయొక్క ఆంతరంగిక సహాయంచేత

ధైర్యాన్ని కూడగట్టుకొని కార్యోన్ముఖులైనారు. ఎన్నో వీధులు తిరిగారు. ఎందరినో చూచారు. బాబా విధించిన షరతులు పూర్తిచేయగల వ్యక్తిని కనుక్కోవడం దుస్సాధ్యమైంది.విసిగి వేసారారు. రోజులు గడుస్తున్నాయి. చేతి ఖర్చుల కిచ్చిన పైకం కూడ అయిపోవచ్చింది.

చివరి కొకరోజున ఓ వ్యక్తిని కలశారు. అతడ్ని చూడగానే వారికి యాయన తప్పక తమకుపయోగ పడగలడనే భావం కలిగింది. ఆయనను కలసి తమ పైనమంతా చెప్పుకున్నారు. ఆయన వీరి గోడంతా ప్రశాంతంగా విన్నాడు. తుదకు వీరి కోరిక మన్నించి, వారి బృందమంతా విడిది చేయుటకు తగు బంగళా ఏర్పాటు చేయుటకు, వారికి కావలసిన సమస్తం వారు కోరిన విధంగా సమకూర్చుటకు అంగీకరించాడు. ఒక్కే దొడ్లో 4 స్త్రీలకు, 16 పురుషులకు వేర్వేరు గదులు ఏర్పాటు చేయాలన్నారు.

బాబా విధించిన షరతులన్నిటికీ యిష్టపడి తన అంగీకారం తెలిపాడు. మర్నాడు ప్రొద్దుటే వస్తే, యీలోగా అనువగు భవనం వాకబు చేసి, వారి కోరిక లన్నిటిపైనా తన అంగీకారం తెలిపెదను మళ్లీ రమ్మన్నాడు. ఎక్కడెక్కడికో తన మిత్రులకు ఫోను చేశాడు. మొత్తానికి,పరివారమంతటి కీ సరిపడిన పెద్ద భవంతి నొక దానిని కనుగొన్నాడు. యిహపోతే, ఇంత పెద్ద బృందానికి, 40 రోజులు పాటు భోజనం తయారుచేసిపెట్టే వంటవాని వెదకుట మాత్రం మిగిలివుంది.

వారిచే అలా ఎన్నుకోబడిన ఆ వ్యక్తి పేరు డా॥ సిద్ధేశ్వరనాధ్. ఆయన భారతదేశంలో అత్యంత ప్రఖ్యాతి చెందిన కంటి వైద్య నిపుణుడు. వారికి మాటయిచ్చిన ప్రకారం వసతిసౌకర్యం దొరకినందున, ఆహారపు

ఏర్పాట్లు కూడా చేయుటకు అంగీకరించెను. కానీ బంగాళాలో వుండే వంట గదిలో వంట చేయరాదనే నిబంధన అతి కష్టమై కూర్చుంది.

చివరకు తన యింటిలోనే వంట చేయించుటకు నిర్ణయించుకున్నాడు. బాబా షరతుల ప్రకారం, విడిది ఏర్పాటుతో పాటు వంట సదుపాయం కూడ చేయాలి. అలా చేసే వంట, గృహయజమాని కాక, వేరేవారిచేత వండించి పంపాలి కదా! "అందుకు అవసరమగు వ్యక్తి ఎవరు దొరుకుదురా!" అని డా॥ నాథ్ ఆలోచించాడు.

ఆ రోజులలో కాశీ విశ్వ విద్యాలయానికి, విద్యా విషయాలలో ఎంతో ప్రాముఖ్యత వుండేది. ఆ యూనివర్శిటీలో డా॥ బి. బి ఖేర్ అనే నేత్ర వైద్యుడు ప్రొఫెసర్‌గా పని చేసేవాడు. ఆయన డా॥ నాథ్‌కు మిత్రుడే కాక ఆయన వద్ద సహాయకుడుగా శిక్షణ పొందియున్నాడు. డా॥ నాథ్ ఎప్పుడూ హడావిడిగా విరామం లేకుండా వుండే వైద్యుడు. అందువలన, ఎక్కువగా తన సహాయకుడు డా॥ ఖేర్ మీద ఆధారపడేవాడు. వృత్తిరీత్యా తీరిక లేకుండుటేకాక భోజనపు ఏర్పాట్లు వేరే వ్యక్తి చేత చేయించాలనే షరతు వున్నందున ఆయన దృష్టి తన సహాయకునిపై మళ్ళింది.

ఆలోచన వచ్చుటే తడవుగా డా॥ ఖేర్‌కి కబురంపి, పిలిపించాడు. ఫలానా బృందం వారు బెనారసు వస్తున్నారు. వారి విడిదికై నీచుభాగ్ సమీపంలోని, "నాతి ఇమ్లి " భవనంలో ఏర్పాటు చేశాను. వారు షుమారు 22మందివున్నారు. వారికి దాదాపు 40 రోజులుపాటు వంట చేయించిపంపాలి అంటూ వారి ఏర్పాట్లులో అనుసరించవలసిన నియమ నింబంధనలన్నీ వివరించి చెప్పాడు. ఆ సమయంలో డా॥ ఖేర్‌కి డా॥నాథ్ ఏమి చెప్పినా

తిరస్కరించే స్థితిలోలేడు. అనుకోకుండా అతని హృదయం స్పందించింది. వళ్లు గగుర్పొడిచింది.

ఆ సమయంలో డా॥ నాథ్ "చూడండి డా॥ ఖేర్ ! మీ కభ్యంతరం లేకుంటే, ఆ బృందాని కవుసరమగు భోజనపు ఏర్పాట్లు మీరు చేయగలరా?" అని అడుగగా, కాదనలేకపోయాడు. "అలాగే చేస్తాను" అన్నాడు.

## డా॥ బి. బి. ఖేర్

ఇప్పుడు డా॥ ఖేర్ గురించి కొద్దిగా తెలుసుకుందాం. ఈయనిది హమీర్‌పూర్ జిల్లాలోని, "రాఢె" అనే గ్రామం. ఆయన తలిదండ్రులు మెహెర్‌బాబా ప్రేమికులు. అందువలన, అహ్మద్‌నగర్‌లో వుండే, మెహెర్‌బాబా తన శిష్యులు, కొందరితో కాలినడకన దేశాటన చేస్తున్న సంగతి వినియున్నాడు. అయితే ఆ బృందమే యిప్పుడు తాను ఆహారపు ఏర్పాట్లు చేయవలసిన బృందమని యెరుగడు.

ఆ వివరం తెలుసుకొందుకుగాను డా॥ నాథ్‌ని అనేక ప్రశ్నలు వేశాడు "ఆ బృందనాయకుడు మౌనం పాటిస్తున్నాడా? కనీసం అలాంటి వైనం తెలుసుకున్నారా" అని అడిగాడు. నాకేమీ తెలియదన్నాడు. డా॥ నాథ్.

నాథ్‌గారింట్లో ఎవరికీ; యీ బృందం వారెవరో అందులో ఎవరైనా మౌనం పాటిస్తున్నారో లేదో, అదేమీ తెలియదు. వారి అనుపాను లెరుగరు. సరే ఏమైతేనేమి, ముందు ఆ రోజుకు వంట ఏర్పాట్లు పూర్తి చేయాలికనుక, డా॥ ఖేర్, తన తలిదండ్రులను డా॥ నాథ్ యింటికి పంపాడు.

# నాతీ ఇమ్లీ

సరే! యిప్పుడు మిత్రుల కొరకు ఏర్పాటుచేసిన భవంతి గురించి తెలుసుకుందాం. కాశీ మహానగరం. భారతదేశమంతటికి అత్యంత పుణ్యక్షేత్రం. ఆ మహానగరంలోని కంటోన్మెంటు ఏరియాలో భారత్‌మిలాప్ సెక్షనుకు దగ్గరగా నీచీభాగ్ అనే తోట వున్నది. ఆ తోట సమీపంలో నాతీ ఇమ్లీ అనే పెద్ద భవనం వుంది.

ఆ మహాభవన ప్రాంగణంలో పెద్ద దొడ్డి, ఫలపుష్పాదులతో కూడిన తోట వున్నాయి. అది వూరు బయట ఏకాంత ప్రదేశంలో వున్నా నీరు విద్యుచ్ఛక్తి సౌకర్యాలున్నాయి. మూడంతస్తుల భవనమది. రెండో అంతస్తులో మహిళలకు విడిది ఏర్పాటు చేశారు. సింహద్వారం ముందు పెద్ద పోర్టికో అందు ప్రవేశించుటకు మెట్లు వున్నాయి. మెట్లకిరువైపులా రెండు విగ్రహాలు రక్షకభటులు పహరా కాస్తున్నట్లు కనపడతాయి.

భవనంలోని ప్రధాన హాలులో పూర్వ వైభవాన్ని చాటే కుర్చీలు బల్లలు ఎన్నో వున్నయి. ఖరీదైన కార్పెట్లున్నయి. క్రింద భాగంలో పురుషులంతా తలా ఒక గదిలో సర్దుకున్నారు. సేవకులకు వేరే యిల్లుంది. వంటకు విడిగా గదులున్నయి. కక్కూసు దొడ్లు చాలానే వున్నయి. వంట యిల్లు, స్నానాల గది, నీటి కుళాయి, మరుగుదొడ్డి విడిగా వున్నయి.

చుట్టూ తోట, పూలవనం, ఫౌన్‌టెన్‌లతో కళ కళలాడుతూ కడు శోభాయమానంగా వుంది. వీటన్నిటినీ చుట్టివున్న ప్రహరీ గోడలో వున్న ప్రధానద్వారం; పెద్ద తాళంతో మూయబడి వున్నది. అది ఎంతో రమణీయమైన భవనం. చూడ ముచ్చటగా వుంది.

భవనంలోని ఫర్నిచర్ కానీ, కార్పెట్లు కానీ ఏవీ వాడవద్దని బాబా సహచరుల నాజ్ఞాపించారు. వచ్చిన వుదయాన్నే వాటన్నిటినీ తీయించి, వేరే గదిలో పెట్టించారు. ఒక రోజున, ఆ భవనం యజమాని, తన ఎస్టేటు సందర్శించవచ్చి కాపలాదారునితో ముచ్చటించాడు. భవనంలోవున్న అతిధులకు అన్ని మర్యాదలు సక్రమంగా జరుగు తున్నాయా? వారేమీ అసౌకర్యం పడుటలేదు కదా? వారికేమైనా సహాయం కావాలా? అంటూ అనేక ప్రశ్నలు వేశాడు.

అయితే ఆయన రాక బాబాకు చిరాకు కలిగించింది. వెంటనే వెళ్లి పొమ్మని కబురంపారు. ఏమి ఆశ్చర్యం? అంత ఎస్టేటుకు యజమాని. అందునా తమకు అసౌకర్యం లేకుండా తగు ఏర్పాటు చేయవిచారిస్తుంటే బయటకు వెళ్లిపొమ్మని, అగంతకుడుగా వచ్చిన వారు చెబితే వెళ్లి పోవాలి. ఏమి ఆశ్చర్యం? మూకామందు మారు మాటాడక వెనుదిరిగి వెళ్లిపోయాడు.

## బాబా బెనారసు మకాం

బెనారసులో తమ విడిదికి తగు ఏర్పాట్లు పూర్తిచేసి, తమరాకకై ఎదురుచూస్తూ వుండమని ముందుగా బెనారసు పంపబడ్డ, సదాశివపాటిల్, బాబాదాసులు, తమకు వప్పగించిన పని పూర్తిచేసారు. తమకు ఇంగ్లీషు సరిగా రాకపోయినా, అత్యున్నత విద్యావంతుడైన డా॥ ఖేర్‌తో సంభాషించి, అన్ని ఏర్పాట్లు పూర్తిచేసారు.

చాలా రోజులు ముందుగా పంపినా, వారు తగు వ్యక్తిని అన్వేషించుట లో, కాలయాపన జరిగినది. ఆ రోజే బాబా బృందంతో బెనారసు చేరే రోజు, బాబాదాసు, హడావిడి పడుతూ, సహచర బృందాన్ని సాదరంగా ఆహ్వానించాలని స్టేషను చేరాడు.

ఆ లోగానే బాబా, తన సహచరులిరువురూ తాము వచ్చేసరికి స్టేషనులో వుండమని ముందుగా ఆదేశించినా రాలేదని, వారిని వెదికి పిలుచుకు రమ్మని ఆదీజీని ఎదురు పంపారు, బాబాదాసుకు అదే ప్లాట్ ఫారం మీదే ఎదురైనాడు. వారు అల్లంత దూరంలో వుండగానే సహచర బృందం గుర్తించింది. బృందమంతా వారిని చూడగానే ఆనంద పరవశులైనారు. బాబాతో సహా సహచరులంతా ప్లాటుఫారం మీదే వున్నారు.

అయితే బాబా, దూరంగా వున్న ఓవర్ బ్రిడ్జిపై నిలబడి వీరివైపే చూస్తున్నారా ? అన్నట్లు నిలబడివున్న ఒక దంపతుల జంటను గమనించారు. యీరుచ్‌ని పిలచి, బ్రిడ్జివైపు చూపి, వారు తమ వైపే చూస్తున్నారేమో చూడమన్నారు. తామున్న చోటుకా బ్రిడ్జి చాలా దూరం వుండుటవలన, వారిని యీరుచ్ గమనించ లేకపోయాడు. "ఎవరో ప్రయాణీకులై వుంటారు. మన వైపు చూచుటలేదు" అన్నాడు. వారి బంధువు లెవరైనా రైలుకు వెళుతుంటే వీడ్కోలు చెప్పేందుకు వచ్చి వుండవచ్చునన్నాడు.

అందుకు బాబా అంగీకరించక, యీరుచ్‌ని వెంటనే వారివద్దకు వెళ్ళి, వారెవరో ఆచూకీ తెలుసుకొని రమ్మన్నారు. నిజానికి నవజీవన మంటే, ఆజ్ఞాపాలనేకదా ! వెంటనే పాపం యీరుచ్ అంతదూరం నడచి, మెట్లన్నీ ఎక్కి వంతెనపైవున్న ఆ దంపతులను చేరాడు. అయితే మీరెవరని వారిని అడుగలేక, సమీపంలోవున్నవారినడిగి, వారు డా॥ నాథ్ ఆయన శ్రీమతి అని తెలుసుకున్నాడు, తమ విడిది ఏర్పాట్లు చేసిన వ్యక్తి యీయనే అని తెలుసుకున్నాడు.

కానీ ఏమీ మాట్లాడలేదు. ఏలననగా, అక్కడ బాబాదాస్, సదాశివపాటిలులు ఆయనతో ఏమి ఏర్పాట్లు చేశారో, బాబా వారికిచ్చిన

నియమాలేమిటో అతనికి తెలియదు. ఏ విషయం తెలియదుకనుక, వారు ఫలానా అని తెలుసుకొని బాబా చెంతకు తిరిగి వచ్చాడు. బాబా ఆజ్ఞ ప్రకారం, అతని విధి వారు ఫలానా అని తెలుసుకొని వచ్చుట మాత్రమే కదా ! అలాగే నడచుకున్నాడు.

యీరుచ్ బాబా వద్దకు వచ్చి, విషయం చెప్పబోయాడు. కానీ బాబా వ్రేళ్ళు కదలటం ప్రారంభించాయి. "రండి ! కదలండి, సామానులు సర్దండి ! మనమిక్కడ ఏర్పాటు చేసిన విడిదిలో వుండ లేము. మనకు ఆతిథ్యం యిచ్చుటకు అంగీకరించిన యజమాని మాట తప్పాడు. తన కిచ్చిన నిబంధన పాటించలేదు" అన్నారు.

పిమ్మట, పాటిల్‌ని, బాబాదాసులను పిలిపించారు. తాము ఏర్పాటు చేసిన యజమానితో ఎట్టి పరిస్థితులలోను, వారు బాబాను గాని, బృందాన్నిగాని చూడరాదన్న నియమం ఏల చెప్పలేదని అడిగారు అన్ని వివరములు, ముందుగానే వారికి చెప్పామని, వారెవరు యిక్కడకు రాలేదని విన్నవించారు.

వారెవరూ యిక్కడకు రాలేదని మీరు ఎలా చెప్పగలరని బాబా అడుగగా, ఉదయాన్నే యింత చీకటిలో వారెలా రాగలరని జవాబిచ్చారు. తాము ఖచ్చితంగా వారితో తమ బృందాన్నిగానీ, బృందనాయకుని గానీ చూడరాదన్న నియమం చెప్పామన్నారు.

అంత బాబా, తన చూపుడు వ్రేలితో, దూరంగా వంతెనపై వున్న దంపతులను చూపుతూ, "అదుగో.! అటు చూడండి ! ఆమూల నిలబడి వున్న ఆ జంట మీకు కనబడుతున్నారా ? వారు డా॥ నాథ్ ఆయన శ్రీమతి కారా ?" అన్నారు. వారిని గమనించిన బాబాదాసు, పాటిలు ఆశ్చర్యపోయారు. బాబా వారి నెలా గుర్తించారా ? అని విస్తుపోయారు. అయితే నవజీవనంలో బృందంలోని మిత్రునిగా బాబా జోశ్యంగా

భవిష్యత్తును గురించి చెప్పరాదు. ఆయన యిప్పుడు దైవంకాదు. మామూలు మానవుడుగా వున్నారు. యీరూచ్‌ని పిలిచి జరిగింది చెప్పమన్నారు.

బాబా వారిని ముందుగా గమనించి తనను పంపగా, వారి వద్దకు వెళ్లి, ప్రక్క వారినడిగి తెలుసుకొని, తరువాత మీరు ఫలానా వారేనా అని అడిగి రూఢి పరచుకొని వచ్చినట్లు ఈరుచ్ వారితో చెప్పాడు. అంత బాబా యీరుచ్‌ని మళ్లీ వారివద్దకు పంపారు. వారు తమకు, తమ బృందానికి కల్పించిన విడిది ఏర్పాట్లుకు చూపిన ఆదరణకు తమ బృందనాయకుడు ఎంతో సంతోషించారని, కానీ ఎట్టి పరిస్థితులలోను, తమ బృందనాయకునిగానీ, బృందాన్నిగాని ఎదుటబడి చూడరాదన్న నియమాన్ని తాము పాటించ నందున, యిహ ఎంత మాత్రం, యిక్కడ వుండజాలక పోతున్నందుకు విచారిస్తున్నామని చెప్పి రమ్మన్నారు. తమ బృందం విడిది ఏర్పాట్లు వేరే తామే ఏర్పాట్లు చేసుకొనగలమని, వారు ఏర్పాటు చేసిన ప్రేమపూరిత సమర్పణకు తన అభినందనలు తెలుపమని కూడ చెప్పారు.

ఈరుచ్ వారి వద్దకు వెళ్లి బాబా చెప్పినట్లు డా॥ నాథ్ దంపతులతో చెప్పగా, వారెంతో నొచ్చుకున్నారు. ఎంతో బాధ పడ్డారు. వారికేమి చేయాలో పాలు పోలేదు. తమ తప్పును గ్రహించారు. జరుగరాని జరిగిన పొరపాటుకు మథన పడ్డారు. ఏం జరుగరాదో అది జరిగిపోయిందంటూ విలపించసాగారు. దీనిని బట్టి, వారిలో పశ్చాత్తాపమనే ప్రేరణ అంత రంగంగా బాబా కృపవలన కలిగినదనుకో వచ్చును. వారివాలకం చూస్తే పశ్చాత్తాపం పడుతున్నట్లు అనిపించిందని ఈరుచ్ అంటాడు.

అంత వారు, యీరుచ్ గడ్డం పట్టుకొని, వెనుతిరిగి పోవద్దని బ్రతిమలాడసాగారు. యిహ ముందెన్నడూ, మీ అగ్రజునిగానీ, మీ బృందాన్నిగానీ చూచు ప్రయత్నం కూడ చేయమని, మీ పెద్దన్నయ్యతో తమ తరుపున క్షమించకోరమని బ్రతిమలాడారు. అసలు యిప్పుడు యిక్కడకు వచ్చే వారం కామని, తమ బృందంలో నలుగురు అతి సుకుమారులైన ఆడంగు లున్నారని తెలిసి, తామంతా తెల్లవార్లూ ప్రయాణం చేసి, నిద్రలేక వస్తారని తెలిసి; తాము వచ్చే రైలు ఎటూగాని వేళలో వచ్చును గనుక, ఆ సమయంలో స్టేషనులో, టాంగాలుగానీ, టాక్సీగానీ మరే యితర వాహనాలు వుండవనే తలంపుతో, తమకారు యిచ్చి వెళ్లాలని వచ్చి,కారును స్టేషను వద్ద ఆపి తాము దూరంగా నిలబడితిమని చెప్పారు.

తాముఏర్పాటు చేసిన విడిది స్టేషనుకు చాలా దూరంలో వున్నందున అలసి వచ్చే మీబృందం సునాయాశంగా విడిది చేరుటకు, అవకాశం కలిపించుటకే తామట్లు చేశామని, తమ తప్పును మన్నించమని వేడుతున్నామని, మీ పెద్దన్నయ్యతో చెప్పమని యీరూచ్‌ని వారు మరీమరీ బ్రతిమలాడారు. తమ కారు వారికొరకు వదలి, యింటికి తిరిగి వెళ్లుటకు, ఏదైన వాహనం బాడుగకు దొరుకునేమోనని ఎదురుచూస్తూ దూరంగా వంతెనపై వున్నామే కానీ, బృందాన్ని గమనించుటకు కాదనికూడ తెలుపమని వేడుకున్నారు.

పశ్చాత్తాపంతో కుమిలి పోతూ వారు చెప్పిన వివరాలన్నీ విన్న యీరూచ్ చలించి పోయాడు. "సరే! మీరు చెప్పినట్లన్నీ వివరంగా

మా పెద్దన్నయ్యతో  చెప్పిచూస్తా " నని వెనుతిరిగి బాబా దగ్గరకు బయలు దేరాడు. దారిలో అతని మనస్సులో సంక్షోభం బయలు దేరింది. "యిప్పటికి రెండుసార్లు యింతదూరం నడచాను. బ్రిడ్జి ఎక్కిదిగాను. యిప్పుడు బాబా ఏదైనా ఆదేశం యిస్తే, మళ్ళీ ఆయన ఆజ్ఞ పాటించి, యింత దూరం నడచి మళ్ళీ బ్రిడ్జి ఎక్కిదిగాలి గదా !" అనుకుంటున్నాడు. పాపం తెల్లవార్లు బాబాను అంటిపెట్టుకొని, నిద్ర లేమితో అలసి వున్నాడు.

అయితే శిష్యునిగా అది ఎంతటి కష్టమైనదైనా, విధేయతతో పాటించుట తన విద్యుక్తధర్మం. అలా అనుకుంటూ బాబా దగ్గరకు చేరాడు. నాధ్ దంపతులు చెప్పినదంతా బాబాకు చెప్పి, ఆయనను ఒప్పించుటకు తన శాయశక్తులా ప్రయత్నించాడు. పశ్చాత్తప్తులైన వారి నివేదన బాబా స్వీకరించారు. మళ్ళీ ఆ దంపతుల వద్దకు పోయి, మీ నివేదనను మా పెద్దన్నయ్య విని చాలా ఆనందించాడని చెప్పి రమ్మన్నారు. అయితే వారు ఏర్పాటు చేసిన కారు వుచితంగా వాడుకొనుటకు అంగీకరించ మని చెప్పమన్నారు. మరి వారి వద్ద పైక మేమీ లేనందున, బాడుగ క్రింద కేవలం ఒక్కరూపాయి మాత్రం చెల్లించ గలమని చెప్పమన్నారు. అందుకు అంగీకరించే ఎడల తమ కారు వాడుకోగలమని వారి వద్దకు వెళ్ళి కనుక్కొని రమ్మన్నారు.

పాపం! యారుచ్ అంతదూరం నడుచుకొని, వారి వద్దకు వెళ్ళి బాబా ఆదేశాన్ని వారికి ఎరుక పరచాడు. బాడుగ క్రింద వారిచ్చే రూపాయి మహా ప్రసాదమను కున్నారో ఏమో, మరుక్షణంలో వారు ఆనందంతో

అంగీకరించారు. వారు అంగీకరించారన్న వార్త ఈరుచ్ తిరిగి వచ్చి బాబాతో చెప్పగానే, బాబా మహిళలతో స్టేషను బయట వేచి వున్న కారులో ఎక్కి కూర్చున్నారు. కారు డ్రైవరుకు తమ కొరకు ఏర్పాటు చేసిన విడిది ప్రాంగణం తెలిసి యుండుట చేత, కారు బయలుదేరి విడిదికి వెడలి పోయింది. తక్కిన మిత్రులంతా లాగుడు బండ్లు మాట్లాడుకొని తమ సామానులు వేసుకొని కాలి నడకన బయలు దేరారు.

## మొదటి భాగం సమాప్తం



# గ్రంథావిష్కరణ సభ



ది. 24–7–1983న చల్లపల్లిలో జరిగిన "నవజీవనం" గ్రంథా విష్కరణ సభలో పాల్గొన్న ముఖ్యుల్లో సోదరులు సర్వశ్రీ తాడేపల్లి బసవయ్య: పింగళి దుర్గాప్రసాదరావు: డి. కృష్ణయ్యర్: చింతా సర్వారావు, వై. మాణిక్యాలరావు గారలు. ఆవిష్కర్త శ్రీ బి. హెచ్. వి. రమణరావు తదితరులతో రచయిత శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు.

స్పందన ప్రింటర్స్ మచిలీపట్నం

